# పిండోడిం

బమ్మిడి జగదీశ్వరరావు




విప్లవ రచయితల సంఘం

విశాఖ యూనిట్

# పిండోడిం

## బమ్మిడి జగదీశ్వరరావు కథలు

జనవరి, **1998**

ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
విశాఖ యూనిట్

లోపలి చిత్రాలు :
కథలకు ఆయా పత్రికల ఆర్టిస్టులు వేసినవి

ధర : రూ 25-00

ప్రతులకు :
చలసాని ప్రసాద్
**15**, ఎల్.ఐ.జి
విశాఖపట్నం - **22**

'దిశ' - హైదరాబాద్
ప్రగతి బుక్‌హౌస్ - విజయవాడ
మైత్రిబుక్ హౌస్ - విజయవాడ
నవోదయ బుక్‌హౌస్ - హైదరాబాద్

కంపోజింగ్ : ఎస్.కె.ఎం.ఎల్. గ్రాఫిక్స్, జగన్నాధపురం, అక్కయ్యపాలెం, విశాఖపట్నం.
ముద్రణ: చరిత గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

# కాళ్ళ కింది భూమిలోకి ....

బమ్మిడి జగదీశ్వరరావు రెండవ కథల సంపుటియిది. మొదటి సంపుటి 'రెక్కలగూడు' లో పితృస్వామిక అణచివేత, హింసా రూపాలను అనేక కోణాల్నించి చిత్రించాడు. స్త్రీత్వం నిర్మితమవుతున్న విధానాలనీ, సమస్త స్త్రీ శక్తుల పరాయీకరణనీ, ప్రతిగా ధిక్కారంలో తన అస్తిత్వాన్ని నిర్వచించుకునే ప్రయత్నాన్ని ఆ కథలు ఆవిష్కరించాయి. గ్రామీణ వ్యవస్థని పణంగా పెట్టి పట్టణీకరణ వేగవంతమవుతున్న నేపథ్యంలో పితృస్వామిక అణచివేత నిర్దిష్టరూపాల్ని, సంస్కృతి వికృతిని చిత్రించాడు కనుకనే గ్రామాలనుంచి కార్మికులుగా, వుద్యోగులుగా మారి మధ్యతరగతి జీవనస్థాయినీ, విలువల్నీ అందుకున్న పాత్రలు ప్రధానంగా ఆ సంకలనంలో కన్పిస్తాయి. ఈ సామాజిక ఆర్థిక సంక్షోభానికి మరోచిత్రంలో కన్పించే శూద్ర, దళిత కులాలకు చెందిన చిన్న రైతులు, రైతుకూలీలు, కార్మికులు ఎదుర్కొంటున్న వ్యవస్థాగత హింసని ఈ కథల్లో ప్రతిఫలించాడు. ఈ సంక్షోభం మూడు ప్రాంతాల్లో మూడు విలక్షణ రూపాల్లో వ్యక్తం అవుతోంది. తెలంగాణలో ఈ సంక్షోభాన్ని పీడిత ప్రజలపై రుద్దేక్రమానికి ప్రతిఘటన రైతాంగ పోరాటాల రూపంలో ముందుకు వస్తే, పాలక వర్గాలు దాన్ని రక్తపుటేర్లలో పాశవికంగా అణచివేయచూస్తున్నాయి. తెలంగాణ ప్రజారచయితల రచనల్లో అది ప్రతిఫలిస్తోంది. రాయలసీమలో ఫాక్షన్ హింస, హృదయ విదాయకమైన కరువు, వలసలు, పంటల విధ్వంసం, ప్రభుత్వ అంగాల నిర్లక్ష్యం, అణిచివేత, దుర్భర దారిద్ర్యం రూపంలో ఈ సంక్షోభం, హింస వ్యక్తం అవుతున్నాయి. రాయలసీమ రచయితలు కథల్లో బలంగా దానికి ప్రతిస్పందించడం కన్పిస్తోంది. కోస్తా ఆంధ్రాలో ముఖ్యంగా ఉత్తరాంధ్రలో కుల ఘర్షణల్లో, దళితులపై దాడుల్లో, అసంఘటిత శ్రామికుల దుర్భర జీవన పరిస్థితుల్లో రైతులు కూలీలుగా దిగజారి పోయే క్రమంలో, వ్యాపారపంటల దివాలా, రైతుల ఆత్మహత్యల్లో ఈ సంక్షోభం నుంచి ఉత్పన్నమవుతున్న హింస వ్యక్తమవుతోంది. ఈ స్థితినే ప్రముఖ ఆర్థికవేత్త అమర్త సేన్ సాంఘిక, ఆర్థిక అభివృద్ధిల మధ్య సమతుల్యం లోపించిందని వ్యవస్థాగత పరిమిత అర్థంలోనే వ్యక్తం చేశాడు. సాంఘిక అభివృద్ధి అంటే భూసంస్కరణలు, విద్యా, ఆరోగ్య సంరక్షణ లాంటి సంక్షేమ రంగంపై శ్రద్ధ అన్న అర్థంలో స్వీకరించిన ఈ పాక్షిక పరిష్కారానికి కూడా మన ఆర్థిక వ్యవస్థ నమూనా సడలించడం తప్పనిసరి. అయితే సమూల మార్పులో మాత్రమే సమగ్ర పరిష్కారం వుంది కనుక సామ్రాజ్యవాదంతో లంకె వేసుకున్న రాజకీయ ఆర్థిక చట్రాన్ని ఛేదించి పెట్టుబడిదారేతర ప్రత్యామ్నాయం దిశగా సోషలిజం కోసం చేసే పోరాటం మాత్రమే మార్పు తీసుకురాగలదనే స్థితిని ఈ కథలు చెప్పకనే చెప్తాయి.

ఈ కథలన్నిటిలో చితికిపోతున్న గ్రామీణ ఆర్థిక వ్యవస్థ, ఛిద్రమైపోతున్న వ్యవసాయ సమాజ మానవీయ అనుబంధాలు, విలువలు, పట్టణీకరణ క్రమంలోని పరాయీకరణలు, దుర్భర దారిద్ర్యంలో పెనుగులాడుతున్న జీవిత వాస్తవిక చిత్రణ వుంది. ఒక దృఢమైన సమీకృత ప్రతిఘటన బలంగా లేకపోవడంవల్ల దారీతెన్నూ లేని అంధకారంలో నిస్సహాయమైన రోదన,

తోడిన కొద్దీ వూరే దుఃఖపు చారిక ఏ కథ తడిమినా మనల్ని తాకుతుంది. ఇందులో కథలన్నీ విషాదాంతాలే. అయితే విషాదానికి మూలం పైన చెప్పుకున్నట్లు వ్యవస్థీకృత విధానాల హింసలోనే వుంది. ఈ నేపథ్యంలో ఈ కథల్లో జీవితాన్ని చూద్దాం. 'గతుకులు' కథ మొదట్లోనే, జారిపడ్డ గింజల్ని ఏరుకునే కోళ్ళ కంటే ముందే గింజలేరుకుంటూ కన్పించే దయనీయ స్థితిలో రైతు కన్నప్పడు కన్పిస్తాడు. చిల్లర వ్యాపారి కిష్టిగాడు షావుకారు క్రిష్ణమూర్తి అయిపోతే, సాంఘిక హోదా తలక్రిందులై అప్పుకోసం దేబిరించడంతో 'తన చేయి రాయి కిందున్నట్లుగా వుందని' వాపోయే రైతు మనకళ్ళముందు నిశ్చలంగా నిలిచిపోతాడు. సున్నితమైన ఆలుమగల ఏకాంతం ఇప్పుడు అప్పులబాధ, పెళ్ళిళ్ళు, పురుళ్ళు, బతుకు దిగులులో వికలమయిపోయి, బతుకుమీదే రోత పుట్టించి 'మానవజన్మ వుత్తమమైందని ఎలా అంటారని' కూలిపోయే రైతు జీవన వైరాగ్యం గుండెల్ని జలదరింపచేస్తుంది. వ్యవసాయం నుంచి అనుత్పాదకంగా అదనపు విలువని తోడేయడం ఎంత బాధామయంగా క్రూరంగా గ్రామీణ జీవితాన్ని అతలాకుతలం చేస్తుందో కొన్ని కథలు ఆవిష్కరిస్తాయి. 'వానపాములు' లో పరస్పర విధ్వంసంలో వ్యవస్థాగత హింసని చూడలేక పోవడం సాధ్యం అయ్యే పనికాదు. ఎరకడు, అసిరిగాడు, పొయ్యి వూది వూది గుండె లార్చుకు పోయిన సాయమ్మ మన వూపిరికి అడ్డంపడి మన నిశ్చింత, నిర్లిప్తతలలోని నైతిక విలువల్ని బలంగా ప్రశ్నిస్తారు. సాంప్రదాయ వృత్తి చట్రం పిడికిలి నుంచి బయటపడి తిరిగి కొంతసడలింపుతో మరోస్థాయిలో ఏర్పడుతున్న కులపరమైన వృత్తి విభజన ఏకొద్దిగానైనా తీసుకువస్తున్న ఆత్మగౌరవ ప్రకటనని 'జలగ' కథ ఆవిష్కరిస్తుంది.

'పోలిగాడి చావు'లో రెక్కలు తప్ప మరే ఆధారంలేని బ్రతుకుల్లో చొరబడే అమానవీయస్థితి మనల్ని వెంటాడుతుంది. గ్రామీణ సమాజంలో ప్రకృతిపట్ల, శ్రమసాధనాల పట్ల చాలా మార్మికంగా, Mythicalగా ప్రజల సంబంధం వ్యక్తమవుతుంది. ఇంటిలో పిచ్చుకల కోసం వేలాడదీసే ధాన్యపుటెన్నులు, గుమ్మంలో వేసే పిండి ముగ్గులు, జంగపోళ్ళు పాట పాడుకుంటూ బిచ్చమెత్తుకునే సన్నివేశాలు అటువంటి సంబంధాన్ని వ్యక్త పరుస్తాయి. ఆ సన్నివేశాలు కథలో సహజంగా అమరిపోవడంవల్ల రైతాంగ దుస్థితి, విచ్ఛిన్నమవుతున్న అనుబంధాలు మరింత గాఢంగా మనల్ని కదిలిస్తాయి.

రైతులు, కూలీలు, దళితులు, కార్మికుల జీవితంలోని బాధామయ పరిణామాల్ని, సామాజిక వాస్తవికతని సమగ్రంగా, సజీవంగా చిత్రించే రచనలు మరెన్నో కోణాల నుంచి రావాల్సి వుంది. ఈ సంకలనం ఆ ప్రయత్నాలకు దోహదపడుతుందని ఆశిస్తున్నాం.

కథల్లో చిత్రితమైన జీవితం, ఆయా పాత్రలు ప్రాతినిధ్యం వహించిన ప్రజానీకపు స్థితి పట్ల గాఢంగా చలించి ఎలాగైనా ఈ కథలు సంకలనంగా రావాలని ప్రోత్సహించి సహాయ సహకారాలు అందించిన మిత్రులందరికీ కృతజ్ఞతలు తెల్పుతూ విరసం ఈ సంకలనాన్ని మీ ముందుంచుతోంది.

విశాఖ
30-12-97

వర్మ
విరసం

# ఇదీ వరస

# గతుకులు



ఇన్నాళ్ళూ నాలుగు బియ్యపు గింజలో ధాన్యపు గింజలో పడితే ఆ ఇంటి ముందు కోళ్ళేరుకొనేవి. కానీ ఇప్పుడు నాలుగ్గింజలు పడితే కోళ్ళు కన్నా ముందు కన్నప్పడు ఏరుకుంటున్నాడు. 'లచ్చిమీ తల్లీ ' అని కళ్ళకద్దుకుని ' కళ్ళవుపడవా' అని ఇంట్లోకి కేక పెట్టి యజమాన్నని నిరూపించుకుంటున్నాడు. ఇప్పుడూ అదే పనిలో వుండి చేటలో నుండి జారిపడి బుగ్గిపాలయిన నాలుగు గింజల్నీ కోడిలాగ కళ్ళెట్టుకొని ఏరాడం. అసలు కాలమే మారిపోయింది. అందుకనే తన బతుకూ మారిపోయిందనుకుంటాడు అప్పడు.

కన్నప్పడిని కనొదిలేసి, రెండెకరాల భూమ్మాత్రం ఇచ్చి ఎళ్ళిపోయారు అతడి తలిదండ్రులు. నలుగురు కూతుర్లను గన్న తాను అది నిలుపుకోవడానికి నానా జెంజాటూ పడిపోయేడు. ఇప్పుడిద్దరు కూతుర్లకీ పెళ్ళి చేసేసాడు. మరో కూతురుకి ఈమధ్యే సంబంధాలు చూస్తున్నాడు. ప్రస్తుతం ఎకరా భూమే మిగిలింది. అయినా ఎకరాకి ఎన్ని గరిసెలు పండుతాయని? ఆ పంట ఏడాది పొడువునా ఎలా వస్తుంది? బత్తెము వెచ్చముకే చాలదు.పైగా చుట్టాలూ వచ్చిపోయే వాళ్ళూ... సాకలి కర్సూ, మంగలి కర్సూ... కూర కర్సూ... ఇవన్నీ ఎలాగో తంటాలు పడ్డా పొయ్యి మీదకుంటే కిందకుండదు. పొయ్యి కిందకుంటే పొయ్యి మీద కుండదు. అందుకే కన్నప్పడు కూలి పనికెళ్తాడు. నుయ్యి తవ్వుతాడు, పునాదులు తీస్తాడు. సొప్ప కొడతాడు. మట్టి పనికెళ్తాడు. ఒకటని ఏటి, అన్ని పనులూ చేస్తాడు. మరి కన్నప్పడుతోపాటు ఆడి పెళ్ళాం వరాలు గొప్పు తవ్వటానికి ...గాబు తీతకి ... ఎగరబోతకీ... చేనుకోతలకీ అన్నిటికీ బయలుదేరుతుంది. అదీ చాలదని తమ ఇద్దరి కూతుర్లనీ ఎంటేసుకు ఎల్తుంది. ఎకరా పంట పనులకు ఇంటిల్లిపాదీ కష్టపడతారు. అలా అయితేనేగానీ ఈదుకు రాలేక పోతున్నారు అన్న ఆలోచన వారికేనాడూరాలేదు.

''బియ్యమేరినావుగావాలా, అందులో దొరికిన దాన్నెపు గింజలు సెంబుతో

సిదుపుతానుగానీ.. కూరేదన్నా పట్రామి .. నువ్వూ నేనూ అయితే పరవాలేదు. పెద్దమ్మి కూడా వచ్చింది కదా... ఎళ్ళు'' అంది వరాలు.

భార్య మాట విని అక్కడ నుండి నడిచాడు కన్నప్పడు. పెద్దమ్మి మళ్ళీ వచ్చింది. పెళ్ళి సెయ్యడాకే సచ్చీసెడీ ఒకొడ్డు కొస్తుండే... ఈ పురుడులూ పున్నేలూ నావల్ల కాదు' అనుకున్నాడు. కానీ కూతురు ఏడుపు గుర్తొచ్చి కడుపు కరిగి పోయింది. ' అదేటో ఎదవ దురదుష్టం కాపోతే దానికీ ముగ్గురూ ఆడపిల్లలే. నాలుగో పురిటికి వచ్చిందిప్పుడు. ఈసారన్నా మొగపిల్లాడు పుడితే బాగున్ను' అనుకున్నాడు. 'ఎవరయితే ఏంలే' అంతలోనే మరేం గుర్తుకొచ్చిందో పెదవి విరిచాడు.

చెవ్విరక నుండి ఆరిపోయిన చుట్ట తీసి వెలిగించి రెండు గుక్కిళ్ళు లాగి, తాగాలని వున్నా మళ్ళీ ఆర్పేశాడు. కన్నప్పడికి చుట్టంటే ప్రాణం. ఆ అలవాటు ఈ నాటిది కాదు. తాతల తండ్రుల నాటిది. తన తండ్రీ తనూ కలసి మణుగులకు మణుగులు పొగాకు ఎండబెట్టి బాగు చేసి సంవత్సరానికి సరిపడినట్టూ నిలవావుంచుకొని... ఊసుపోక పోయినప్పుడల్లా ఆ కట్టలు దించి చుట్టలు చుట్టేవారు. అని ఎక్కువ తాగటం మూలాన్నే తన తండ్రి వేగిరం చచ్చిపొయ్యాడని అందరూ అంటారు.

'' అప్పుడు రూపాయిస్తే మణుగుడు పొగాకు... ఇప్పుడో, నాలుగు సుట్టలే రావు '' అనుకున్నాడు. అంతలోనే కన్నప్పడికి ఆయన తాత గుర్తొచ్చేడు. తాత మాటలుగురుతొచ్చేవి. '' పావలా ఇస్తే పట్టు సీరొచ్చేదట. అద్దురూపాయికి ఆవును కొనుక్కోవచ్చుట! అమ్మో... ఆ కాలమొస్తే బావుణ్ణు '' అనుకున్నాడు. అయితే ఉప్పుడు కూలి డబ్బులూ పెరిగాయి. అన్నిటి మీదా రేటులూ పెరిగాయి. కానీ రేటులు పెరిగినంతగా కూలి డబ్బులు పెరగలేదు అని అనుకున్నాడు.

కన్నప్పడు బడ్డీ ముందాగాడు. అప్పుడు కన్నప్పడికి కళ్ళకెదురుగా షాపు... సామాన్లూ... బడ్డీవాడి నగల భార్య... ఏమీ కనిపించలేదు. బడ్డీ కృష్ణమూర్తి జిగజిగల బంగారపు రంగు చొక్కాకూడా కనిపించలేదు. కళ్ళంలా తయారయిన పట్ట (బట్ట) తలా కనిపించలేదు. కనిపించిందల్లా ఒక్కటే... చింకి పాత కట్టుకొని సేగోడీలు సుప్పులు జంతికలు అమ్ముకొనే కిష్టిగాడు. అపుడంతా ' ఒరే కిష్టా... కిష్టిగా ' అని వాడిని పిలిచేవారు. అప్పుడు వాడెంతో మర్యాదగా మాట్లాడేవాడు. జవాబు చెప్పేటప్పుడు బితుకుగా చేతులు కట్టుకొనేవాడు...' ఇదంతా తలపుకు రావడంతో నవ్వొచ్చింది అప్పడికి.

'' ఏట్రా... అప్పుడూ... ఏటి బాకీ డబ్బులివ్వడానికొచ్చావా? '' కృష్ణమూర్తి అడిగాడు.

''ఏమండీ'' అని సంబోధించేవాడు తప్ప ఎప్పుడూ పేరు పెట్టి పిలవడానికే జంకే కిష్టిగాడు ఇప్పుడు ఏకవచన ప్రయోగం చేస్తూ అప్పడ్ని పిలవడంతో అప్పడు ఆశ్చర్యపడలేదు, ఆలోచనకు గురయ్యాడంతే. '' ఒకప్పుడు ఆడి స్థానంలోకి నే

వెళ్ళిపోయాను... అందుకే'' అని నిట్టూర్చాడు.

'' పలకవేటి బికీ సొమ్ము కడతన్నావా? ఆ మధ్య కూతురు సమర్తాడిందని నాలుగొందలొట్టికెళ్ళావు. దానికి వొడ్డీ లేదు మొదులూలేదు. ఆ సమర్తాడిన కూతురికీ పెళ్ళయిపోయి పురిటికొచ్చినా నువ్వు తీర్చినట్టు లేవు. సెత్తి మాల్నోడివి... గతిలేనోడివి ఏనికి పట్టికెళ్ళాల పౌరుషం వుంటే పడెయ్యి'' కృష్ణమూర్తి మాటలు- అవి మాటలు కాదు, అరుపులు...తిట్లు... కొరడా దెబ్బలు!

కన్నప్పడు కిక్కురు మనలేదు. తన చెయ్యి రాయికిందున్నట్లుగా అనిపించింది. చెయ్యి కదిపితే తనకే కష్టం. పెదవి విప్పితే తనకే నష్టం. అందుకే మరేమీ అనలేదు.

''... ఇచ్చేస్తాను... ఈ నెల... ఎలాగయినా సూసి...'' అని మౌనంగా తల దించుకుని అక్కడి నుండి కళ్ళం మడివేపు వెళ్ళాడు కన్నప్పడు.

రెండేళ్ళు కళ్ళంలో వదిలేసిన నాటుబండి వర్షానికి తడిసిపోయి బాగా మురిసిపోయి మన్ను తినేస్తోంది. అది చూసి కన్నప్పడికి ఏడుపొచ్చింది. తన జోడెడ్లు గుర్తుకొచ్చాయి. ఆ ఎడ్ల బండి మీద తను కూర్చొని ' ధా...ధ ..దదధ' అని అదిలిస్తూ తోక పట్టుకుంటే పది నిముషాల్లో పదామడలు చుట్టబెట్టి వచ్చేవి. వాటి మెడలోని మువ్వలు అమ్మోరు సంబరాల డప్పుల మోతలా వుండేవి. అలాంటిది అవి కూడా కూతురు పెళ్ళికి భోజనాలు పెట్టినపుడు అమ్మేశాడు. ఆ రోజు తనకయితే అన్నమే సయించలేదు. అవి కూడా వెళ్ళే ముందర చూసిన చూపు ఇప్పటికీ అగుపిస్తోంది.

మళ్ళీ ఎడ్లను కొందామనే బండి అమ్మలేదు. ఈ లోగా ఒక దానిమీదొకటి కర్సూ... కరమత్తూ వచ్చి పడ్డాయి. ఎడ్లు కొనలేదు కదా బండి కూడా ఇప్పుడు మట్లో కలిసి పోవడం... మనిషి పుట్టి పెరిగి మట్లో కలిసిపోయినట్లుగా తోస్తోంది అప్పడికి.

'' ఏటయ్యా కూరట్టుకు రమ్మంటే ఇక్కడ కూకున్నావూ'' ఆశ్చర్యంగా మొగం పెట్టి పిడకల కుచ్చిరి దగ్గరకు వచ్చిన వరాలు అడిగింది. జవాబివ్వలేదు గానీ పెళ్ళాం వైపు తల ఎత్తి చూసాడు.

కన్నప్పడు కళ్ళముందు గతం మబ్బులా కదిలింది. అప్పుడెలా వుండేది వరాలు! నిజంగా వరాలు వరాల మూటే అని పిల్లని చూసొచ్చి ఆనాడే అమ్మ అంది, అవును వరాలు తనని కట్టుకోబట్టి ఇలా అయిపోనాది గానీ అది రాజింటి బిడ్డ. వయసులో ఎల్లా వుండేది? దుబ్బుగా జాకెట్లు ఏసుకుంటే సెయ్యెత్తితే పరపరా సిరిగిపోయేవి. అంత కండ పట్టిన గట్టోళ్ళు. కానీ వరాలు జాకెట్టు ఏసుకోడ మెరుగదు. అసలాకాలంలో అందరూ జాకెట్లు లేకుండానే సీర మా సక్కగా కట్టుకొనీ వోళ్ళు. పెళ్ళయిన కొత్తలో అందరూ ఏసుకోవంతే వరాలు జాకెట్టు ఏసుకుంది కొన్నాళ్ళు. గానీ ఎంత సిగ్గుబడిపోయిందనీ, అసలు తమ పెళ్ళయిన మొదట్లో తను కళ్ళం కొస్తే కూడెట్టుకొచ్చే నెపం మీద పనుల్లో కొచ్చే మనుషుల సేత పంపకుండా తనే వచ్చేది. పిడకలకని కుచ్చిరి

దగ్గరకు వచ్చేది. కొంటెగా చూసేది. అప్పుడు తాను మాత్రం ఒగ్గోడా? గభీమనెళ్ళి గడ్డి కుప్ప మీదకు తోసేసి మరీ ఎన్ని ముద్దులు పెట్టోడు? ఎన్నిసార్లు తెల్ల లాల్చీమీద ఎర్రటి, నల్లటి మరకలవలేదు? అవి చూసి వరాలు ఎన్నిసార్లు మురిసిపోలేదు. అది తెలియక, పైనుండి ఇంటికి వచ్చి నతన్ను చూసి అమ్మకు ఎన్నిసార్లు అనుమానం రాలేదు...?!

'' నీకే! ఏటాలోసిత్తన్నావ్ '' వరాలు అప్పుడ్ని కుదిపేసింది.

ఆ... అన్నాడు అప్పుడు నిద్రలోంచి లేచినట్టు.

'' ఈ పూటకు ఆ షావుకారి కాడ దేనికిగానీ ఆ టమాట్లు, సిక్కుడు కాయలు నాలుగేరి పట్రా. మద్దేనం ఏలకి మళ్ళీ మీకు తిండి అమర్సాల...'' అంటూ వెళ్ళి పోయింది వరాలు.

అప్పుడు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

...అన్నిట్లోనూ ఎంత మార్పు...చివరకి మొగుడూ పెళ్ళాల బాంధవ్యం దగ్గర కూడా. ఇప్పుడు ఇద్దరూ ఏకాంతంగా కలిసే సమయమే దొరకదు. అధవా దొరికినా వాళ్ళిద్దరి కౌగిళ్ళుండవు. పకపకలుండవు. పట్టుకోడాలుండవు... కొంటెతనాలుండవు...వుండేదల్లా కృష్ణమూర్తి... పిల్లల పెళ్ళి... వాళ్ళ కాపురాలు... వాళ్ళ జీవితాలు ఇవే. కూలిపని మరో నాల్రోజులు దొరికితే అన్న ఆశే ఇద్దరికీ! వరాలు అవే మాట్లాడుతుంది. తానూ అదే మాట్లాడతాడు. ఏమిటో ఆలోచించినా అర్థం కాదు అప్పుడికి. అప్పుడప్పుడు అందుకేనేమో జీవితం మీద రోత కలుగుతుంది. 'మానవ జన్మ ఉత్తమమైంది' అంటారెందుకో', ప్రశ్నించుకున్నాడు అప్పుడు.

... ఏది ఏమి జరిగినా రోజుకు మూడు పూటలు తినాలి. తన పిన్నవయసప్పుడయితే అయిదుసార్లు అంటే అలబొద్దు... తెల్లారగట్ల తినేవాడు. నాలిక మీదకు ఏదో కూరాకుండాలి. మొగుడికి పెళ్ళమున్నట్టు... అన్నముంటే సాల్దు కూర కావాలి. అప్పుడు సుట్టుమొస్తే గొర్రెపోతునే ఏసేవాళ్ళు. ఇప్పుడు కోడయినా కొయ్యడం లేదు. ఆ కోడినమ్మితే పాతికో పరకో వస్తే కూతురికి సీర కొనెయ్యొచ్చు.. లేదంటే అల్లుడు అనరాని మాటలు అన్నా అంటాడు.

అపడు అక్కడి నుండి లేచి నిలబడ్డాడు.

చిక్కుడు కాయలు, టమాటోలు ఏరి తువ్వాలులో కట్టి ఇంటికి తీస్కెళ్ళాడు. తరువాత స్నానం చేసి కూర్చున్నాడు.

పెద్ద మనమరాలు వెంకటి టీ తెచ్చి అప్పుడి కిచ్చింది. అది టీ అంటే టీకాదు డికాషను. ఆ డికాషను తాగుతూ బ్రాందీ తాగినట్టుగా ఫీలవుతాడు అప్పుడు. అప్పుడు టీ తాగుతుంటే మౌనంగా నిలబడి చూసి చూసి ''మీ ఇంట్లో పాల్లేవా?'' అడిగింది. మనవరాలు.

కన్నప్పుడికి ఏం చెప్పాలో తెలియలేదు.

''మా అమ్మ అన్నీ గొప్పలు చెప్పుతాది... 'మా ఇంట్లో జన్నుపాలు మీగడా' అని, మీకు టీలోకే పాల్లేవు అమ్మవన్నీ అబద్ధాలే....'' అంది మళ్లీ వెంకటి

'' ఇప్పుడు లేవు అమ్మేసాం'' అని మనుమరాలితో అన్నాడు.

'' ఎందుకమ్మేసారు?'' మళ్ళీ ప్రశ్నించింది వెంకటి.

ఎలా చెప్పాలో అప్పుడికి బోధపడలేదు. చెప్పినా చిన్న పిల్లకి అర్థం కాదనుకున్నాడు. కాని వరాలు పోరు మీద తను ఒకప్పుడు పాలేపారం చేసాడు చాన్నాళ్ళు. నాలుగ్గేదెలు, ఒక ఆవూ వుండేవి. ఆటికి తిండి పెట్టడమే కష్టమయిపోనాది. కరువొచ్చి పంట నేల్లన్నీ కాష్టం కల్లయిపోనాయి. పచ్చగరిక ఎక్కడా దొరకలేదు. ఎవరో బోరింగులున్నోళ్లకే అన్ని సదుపాయాలు. ఎండు గడ్డి ఏనాడో అయిపోయింది. పసగడుగు గంజీ ఇరుగూ పొరుగూ ఇచ్చిన మినప్పొట్టుతో ఎన్నాళ్ళు ఆటి దానా నింపగలడు? అందుకే అవి వట్టిపోయాయి. వట్టిపోయాక పెంచడం మరింక వల్ల కాలేదు. అప్పుడు వట్టిపోయినవని రేటు సరిగా రాలేదు గానీ అమ్మేసాడు. ఆనాటి బక్కలు, గొర్రెలు, కోళ్ళు ఒక్కొక్కటి అన్నీ పోయాయి.

''తాతయ్యా.. నువ్వేం పండిస్తావ్'' వెంకటి ప్రశ్నించింది.

వెంకటి తొమ్మిదో తరగతి చదువుతూ హాస్టల్లో వుంటోంది. తల్లిని చూద్దామని పించి సెలవులకు వచ్చింది. ఆలయ్య అంతకూ పట్టించుకోడు. ఆడ పిల్లకు దేనికీ సదువు? అనుకున్నాడు గానీ తిండెడతారని సదువుకోమని పంపేసాడు. ఏది ఏమయినా వెంకటి ఆల్ల కుటుంబంలో తెలివయిందంటారు. అందుకే గావాల బోలెడన్ని ప్రశ్నలేస్తుంది.

''ధాన్యం.. నువ్వులు.. సెలక్కాయలు అప్పుడప్పుడూ వర్షం పడితే'' చెప్పాడు అప్పడు.

''ధాన్యం అమ్ముతావా... బియ్యమా?''

''అమ్మడమేమిటీ?'' అర్థం కానట్లు ముఖం పెట్టాడు అప్పుడు.

''పండించిన వన్నీ మనింటికేనా?'' మనుమరాలు.

''మిగలవు'' పైకి అన్నాడు. పంటంతా ఇంటికే చాలదు. కాని అవసరాలకి అమ్మేసి తరువాత కూలి డబ్బుల్తో కొనుక్కోడానికి నానా యమయాతనా పడిపోతాడు. ఇవన్నీ చిన్న పిల్లకు అర్థం కావని చెప్పలేదు అప్పడు.

''మొన్న అమ్మమ్మ'' నువ్వూ ధాన్యం అమ్మేరు నే చూసా'' అంది మనుమరాలు.

'' ఆ అమ్మాను. అయితేటంటావు?'' అడిగాడు గాని, 'అవన్నీ నీకెందుకు' అని అనలేదు. ఎందుకంటే మనుమరాలు మాట్లాడుతుంటే ముద్దనిపిస్తోంది.

''తాతయ్యా ఒకటడగనా?''

''వందడుగు'' అన్నాడేకాని అప్పడి గుండె కొట్టుకుంది. 'పైసలడిగితే?' తన దగ్గర చిల్లిగవ్వ కూడా లేదే... అప్పడు బాధపడిపోయాడు

అప్పడనుకున్నట్లు వెంకటి డబ్బులడగలేదు.

''తాతయ్యా ధాన్యం నీకు వచ్చిన రేటుకి అమ్ముతావా? ఎలాగమ్ముతావు'' వెంకటి ప్రశ్న అప్పడికి ఆశ్చర్యం కలిగించింది. పెద్ద ప్రశ్న? ఎంతయినా చదువుకుంటోంది గదా! అనుకున్నాడు మనసులోనే.

''సెప్పు''

''మనిష్టమొచ్చినట్లెలాగమ్ముతాం'' అప్పడు చెప్పబోయాడు.

''అదేటి తాత నీళ్ళు కట్టి దున్ని అన్నీ చేసి కష్టపడి పండించింది నువ్వు? మరి నువ్వు పండించింది నీ ఇష్టం కాదా?'' కాస్సేపు అప్పడికి ఏం చెప్పాలో తెలియక నోరావులించాడు.

''... ఎందుకంటే తాతా, సుప్పులు జంతికలు చేసిన వోళ్లే దానికి ఒక రేటు పెడతారు కదా! మనకి బల్లల పెట్టి చేసి అమ్మిన షరాబు పెట్టి రేటు ఆడే ఇమ్మన్నాడు కదా'' వెంకటి ఏదో ఆలోచిస్తూ అంది.

ఇప్పుడు అప్పడిలో ఆలోచన మొదలయింది.

నిజమే... నిజమే.. సామాన్లు చేసి అమ్మే నోళ్లే ఆళ్ళిష్టమొచ్చిన రేటు అన్నీ సూసుకొని మరీ ఎడతారు. కాని తమ రైతులు పండించే పంటకు ఎవడో వచ్చిరేట్లు నిర్ణయిస్తాడు. ఆడు సెప్పిన రేటుల అమ్మాల తాము పండించే పంటకు ఏ నాయకులో వచ్చి రేటెట్టడం ఆశ్చర్యంగానే తోచింది. అప్పడికి.

అప్పడి ఆలోచనలు మరింత వేగంగా పరుగెత్తుతున్నాయి.

''యూరియా గట్రా తయారు చేసిన ఫేక్టరీ వాళ్ళే దానికో రేటెట్టి ఆల్ల ఇష్టానికి అమ్ముతారు. సిలవరి.. రాగి... స్టీలు... ఇత్తడి సామానులు తయారు సేసినోడే తనిష్టమొచ్చిన రేటు లాభాన్ని సూసుకొని మరీ అమ్ముతాడు. ఏ ఫేక్టరీ వోళ్లయినా తాము తయారు సేసిన వాటికి తామే రేటు నిర్ణయం సేత్తారు. మారైతుల కాడికి వచ్చేసరికి మాత్రం అందుకు ఇరుద్దం...

అయితే ఏటి సెయ్యాలా?

తమ పంటకు గిట్టుబాటు రేటు తామే ఎట్టుకోవాల... అంటే అలా జరగాలంటే రైతులందరూ ఒక్కటిగా వుండాలి. ఏదో అర్ధమయిన వాడిలా అప్పడు అక్కడి నుండి లేచి వెళ్ళి అందరు రైతుల్ని కూడదీసి చెప్పాడు.

మొదట కొందరు నవ్వారు. తరువాత ఆలోచించారు ''అలా సెయ్యడం కష్టమేమో?'' అనుమానం కొందరు కక్కేసారు.

''మనమంతా ఒక రేటుకే అమ్మాల. ఏ వస్తువు తయారు సేసినోడు ఆ వస్తువు

అమ్ముకోగా లేంది .. మనం కష్టపడ్డది అమ్ముకోడంలో ఆశించడంలో అన్యాయమేముంది?'' అన్నాడు అప్పుడు

''అయినా మనం అమ్మేటన్ని పండిత్తన్నా మ(త్రా.. మనమేం పెద్ద రయితులమా మనకే మనం పండించింది సాలదు'' అన్నాడు ఇంకో రైతు. ''అలాగని అవసరాలకి అమ్మడం మానేత్తన్నామా? ఆ అమ్మేదేదో మనకి కిట్టినట్టు అమ్మాలనీ'' ఇంకో రైతు సర్దేడు.

''మనమిప్పుడు పుట్టి ఎనభై రూపాయిల కమ్మేత్తాం. కొనేసరికి నూటెనభై లెక్కయినా కావాల. 'అమ్మబోతోటికి అడవి... కొనబోతోటికి కొరివి' అని ఒత్తినే అన్నారా'' మరోచిన్న రైతు అన్నాడు.

'' ఈ డబ్బున్న మారాజులు మన దగ్గరిప్పుడు పంట రాగానే కొనేసుకొనే ఆళ గాదులూ... కొట్లూ అన్ని నింపుకుంటారు. లారీలతో ఎత్తికెళ్ళి పోతారు. మనం మళ్ళీ బియ్యం కొంటే కేజీ ఆ(రూపాయలంటారు'' నిట్టూర్చాడు రైతు.

అయితే ఎన్ని కష్టాలొచ్చినా అనుకున్న రేటుకే అంతా అమ్మాలని, అదీ రేటు పలికేకనే అమ్మాలని నిర్ణయానికొచ్చారు అంతా. తరువాత ఎవరిళ్ళకు వారెళ్లిపోయారు.

కన్నప్పడికి కడుపు నిండా తిన్నట్టుగా తృప్తిగా వుంది. మనసులోనే మనుమరాల్ని అభినందించేడు. పెళ్ళాం ఇంటికెళ్ళగానే కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చి భోజనం వడ్డించింది. అప్పుడు భోజనం ముందర కూర్చున్నాడు. రెండు ముద్దలెట్టాడో లేదో ''అమ్మా... అమ్మా...'' అరుపులు. కూతురు నొప్పులు పడుతున్నట్టుగా వుంది.

అప్పడు గాబరా పడుతూ ''డాకటేరు బావుదగ్గరికి తీసుకెళ్దామేటి?'' పెళ్ళాన్ని అడిగాడు.

''ఏనికి.. ఎవల్దగ్గర డబ్బులు మొలుస్తున్నాయి మన రాజమ్మ మం(త్రసానికి కబురెట్టినా వస్తుంది''. భార్య మాటకు తన దగ్గర డబ్బులుంటే ఎదురు చెప్పేవాడే కాని అవి లేకపోవడంతో మౌనంగా తిని దిక్కుతోచక అలవాటుగా పొలంవేపు నడిచాడు. ఎండ కాస్తున్నా లెక్క చేయకుండా చేనంత గాలించాడు. ఏదో పురుగు పట్టినట్టుంది. అప్పడికి భయం వేసింది. ఆశల మీద నిరాశ నీడ పడడంతో వెన్నులో వణుకు పుట్టింది. వరి వెన్నేసేటప్పుడే ఈ తెగులు రావడంతో అప్పడిలో గుబులెక్కువైంది. పొలమంతా అదేమాదిరిగా వుంది. అంతే... అప్పడికి కళ్లలో నీళ్ళు తిరిగాయి.

కాసేపు చూసాక కాళ్ళు ఎకాఎకిన పొరుగింటి పోతరాజును కలవడానికి వడివడిగా పడ్డాయి. అయితే ఎదురుగా నిలబడే పోతరాజుని చూసి విషయం చెప్పాడు. పోతరాజు కాస్తో కూస్తో చదువుకున్నోడని అందరూ ఆయన్నే అడుగుతారు.

అప్పడు చెప్పకుండానే ఏడ్చేసినంత పనిచేశాడు. పోతరాజుకి విషయం అర్ధమయినట్లుంది. అప్పడి భుజం మీద చెయ్యేసి ''మరేం దిగులు పడకు... నానే

సూసి నీకు సెపుదామనుకున్నాను ఈలోపు నీవే సూసినావు. ఇప్పుడు ఎంటనే మందులు పట్నం నుంచి తెప్పించి జల్లకపోతే ఎన్నంతా ఏళబడిపోద్ది.. ఈ సీడకి ఒక్క గింజా మిగలదు'' చెప్పాడు.

''మందులు ఎంతవుతాయి'' అప్పుడు ఆత్రంగా అడిగేడు.

''మూడొందలవొచ్చు...'' పోతరాజు మాట పూర్తి కాలేదు. అక్కడి నుండి అప్పడు ఇంటివేపు పరుగు తీశాడు. డబ్బులిప్పుడెక్కడ దొరుకుతాయి? నా నోటి మీద కూరాకు నిలబడుతుందా? అంత డబ్బు ఎలా? మెదడ్ని దొలిచేస్తోంది.

అసలు అప్పడికి ఊష్టమొచ్చినా (జ్వరం వచ్చినా) ఆస్పెట్లకి ఎళ్ళి ఎరగడు. ఇంట్లో ఎంతో ఇదయితేగాని తీసికెళ్లడు. కషాయం... ఇదీ అదీ అని కాలం గడిపేస్తాడు. కానీ పంటకింత రవ్వపీడొచ్చినా తట్టుకోలేదు. పేణం గిలగిల మంటాది.

ఇల్లు చేరేసరికి ఇంటి ముందు అమ్మలక్కలు గుమికూడున్నారు.

కన్నప్పడి గుండె మరింత వేగంగా కొట్టుకుంటూండగా '' ఏటయ్యింది'' అడిగాడు.

''...నీ పెద్ద కూతురు కడుపులో బిడ్డ అడ్డం తిరిగి పోనాది. రాజమ్మ తన వల్ల కాదనీసింది. పట్నం పెద్దాసపెట్లికి తీసుకెళ్ళాల'' పొరుగింటి పోతరాజు భార్య పోలమ్మ చెప్పింది.

అంతే అప్పడికి కాళ్ళూ సేతులూ ఆడలేదు. అమ్మోరమ్మకి బలిచ్చేముందు డప్పుల మోతకు బెదిరిపోయిన పోతులా అటూ ఇటూ చూసాడు. భయం వళ్ళంతా ఆవరించుకుపోయింది. అక్కడ పొలం ఏడాది పొడుగూ పెట్టుకున్న ఆశలూ బతకాల్సిన బతుకూ వున్న ఒక్క ఆధారం... జారిపోతున్నట్టు అనిపించింది.

''...ఏటి పెద్దోడో, మగ మనిషివి నీవే అలా అయిపోతే పెళ్ళం... పిల్లలు అందులోట ఆడ కూతుర్లేమవుతారు? ముందా పిల్లని ఆస్పెట్లకి తీసుకెళ్ళే మారగం సూడండి'' ఓ ముసలమ్మ అప్పడి చెయ్యి పట్టుకుని వెళ్ళమన్నట్టు తోసింది.

అప్పడి మిత్తవోరయిన గౌరిగాడూ మాలచ్చిమీ రెండీదులవతల నుండి పరుగున వచ్చారు. వరాలు అందర్నీ చూసి మరింత ఏడుస్తోంది.

'' ఎవరో సచ్చినట్టు ఏమిటా ఏడుపు'' గౌరిగోడు కసిరాడు. అంతలోనే నాటుబండి సిద్ధం చేసి ఎవులివో ఎడ్లను తెచ్చి కట్టారు. బండి మీద ఎండుగడ్డి పరిసి దాని మీదగోనేసి పైనేమో సింకి గుడ్డపాత, ఓపాత చీరతెచ్చి ఏశారు. అప్పడి పెద్ద కూతుర్ని అందులో ఎక్కించి మరో ఇద్దరు ఆడాళ్ళు ఎక్కారు.

''నువ్వు డబ్బులు గట్రా సజ్జు సుసుకొనిరారో అప్పడూ, నేనెల్లి ఆస్పెట్లో జాయినింగు సేసేస్తా. దానికేం ఫరవాలేదులే నేవెళ్తున్నాను. వోలే వరాలప్ప నువ్విక ఏడక ఆ సిన్న పిల్లలు, మీ మనుమరాలు మరీ జడుసుకుంతారు'' అంటూ బండి తోలాడు గౌరిగోడు. బండి క్షణాల్లో చూస్తుండగానే ఆ ఊరి పొలిమేరలు దాటేసింది.

అప్పడు అరుగరుగు తిరిగాడు. అంతా తనలాటోళ్ళే. ఆళ్ళు ఆదుకుందామనుకున్నా ఆదుకో లేరు. అప్పులిచ్చేవోళ్ళకి తనఖా పెట్టాల అంటే నమ్మకం పోయింది. మనుషుల మీద మనుషులకే నమ్మకం పోయినందుకు అప్పడు తిట్టుకున్నాడు.

వరాలు '' ఏటి తనకా పెట్టడమా?'' అని ఆలోచిస్తోంది. ''మామ సచ్చిపోతే కాళ్ళకడేలు అమ్మి సమయానికి కతా కార్యం సేనా బాగాసేసినాం'' అనుకున్నారు. ఉన్న సెవికమ్మెలు, ముక్కు బేసరీలకీ అలాగే అయింది. రెండో కూతురికి పెళ్ళి చేసి పడమటివైపిచ్చినారు. ఆలంతా పత్తి పండించేవోళ్ళు. పత్తి ఏటి తింటారాల్లు... గింజలైతే గెంజన్నా తాగీవోళ్ళు. ఆలకి సేనా కష్టాలొచ్చి పడిపోనాయి. ఎందరో ఆలూర్లో ఆకలికి బరాయించలేక బలిమిన సచ్చిపోనారు. ఉరి తీసుకున్నారు. విషం తాగేనారు. మలమల మాడి సచ్చిపోనారు. అలాటప్పుడు అల్లుడు కూతురూ ఏ గంగలో కలిస్తే కలవనీ అని ఎలా వదిలేస్తామని కమ్మెలు బేసరీలు అమ్మి చిన్న కొట్టు ఎట్టుకోమని డబ్బిచ్చినారు. గోరు సుట్టుమీద రోకలిపోటులా ఒకదానికి కొకటి పడుతుంటే ఏ మనుషులు మాత్రం ఎత్తురుతారు? ఏ బతుకులు మాత్రం బాగుపడతాయి? రెండెకరాల పొలం అంతమంది ఆదారమున్నా. ఎట్నుంచీ పైసా వచ్చిన రాబడీ లేదు. ఏ పూట కష్టపడితే అది ఆ పూటకే!

అప్పడు కాలు కాలిన పిల్లిలా ఊరంతా తిరిగేసినాడు. ఆరోజు అప్పడింట్లో పొయ్యిలో పిల్లి పడుకుంది.

సాయంత్రానికి గౌరిగోడు ఒక్కడూ ఎడ్లు బండి తోలుకొని వచ్చాడు.

'' ఏమయింది'' వరాలు పరుగున వచ్చి అడిగింది.

''బిడ్డ అడ్డం తిరిగిందట. ఆపరేషను సేసి బిడ్డను తియ్యాలట. పెద్ద డాకటేర్లు వున్నారు. తల్లికి ప్రమాదం కాదులే అన్నారు. పీజులకి మందులకీ ఓ అయిదొందలు అందాకొట్రమన్నారు.'' గౌరి గోడు విషయం చెప్పాడు.

వరాలు ఏడుస్తూ ఇంట్లోకి పోయింది. అప్పడు నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

'' ఏటి ఆలోసిత్తావు సీకటిపడతన్నాది డబ్బులు సూడు. ఇద్దరం పట్నుమెల్లి డబ్బులు కడితేగానీ ఆపరేషను సేసేటట్టుగా లేరు.... ఇదిగో అదిగో అంతారు. కాలయాపన సేత్తారు. అది కడుపు నొప్పితో సచ్చిపోతుంటే మత్తు ఇంజీసను ఇచ్చారులే'' మళ్ళీ అన్నాడు గౌరిగోడు.

అప్పడికి ఏడుపొచ్చేసింది. ఆపుకోలేక పోయాడు. ఏడుస్తుంటే '' ఆడదానిలా ఏనికా ఏడుపు... ఏదో సూడు'' అంటున్నాడే గానీ గౌరి గోడికి కూడా అప్పడిని చూసి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'రైతులకి రుణాల మాఫీ' సాయంత్రం రేడియోలో వస్తుంటే అది విని అంత ఏడుపులోనూ అప్పడికీ నవ్వొచ్చింది. రుణాలే మన దాక రానీరు. తీసుకుంటే కదా మాఫీ!

ఆ పెద్ద రైతులే.. పలుకుబడున్నోళ్ళే అన్నీ వుపయోగించుకుంటారు. ఆళ్ళకే బేంకోళ్లు అప్పులిత్తారు. వారయితే తీరుత్తారని నమ్మకమట. తామయితే తినీసి ఏరిగేస్తారని భయమట. హు... నిట్టూర్చాడు. ఎకరాసకరా భూమి గలోల్లంతా ఏకమయ్యారు కాని అప్పడ్ని ఆదుకోలేక పోయారు.

ఇదే అదననేమో అప్పుకెల్తే లేదని ఇప్పుడు ఇంటికొచ్చిన కృష్ణమూర్తి, మాజీ కరణం మరికొందరు అన్నారు. ''అరే... అప్పడూ నీ పొలం ఈ ఏడాది పంట ఎంతయితే అంత... లాభమొచ్చినా, నష్టమొచ్చినా నాదే వెయ్యి... వెయ్యి రూపాయలిస్తాను. ఇచ్చే...''

ఆమాటలకు భూమి తన చుట్టూ తాను తిరగడం మానేసింది. కాని అప్పడి తల అంతకు రెట్టింపు వేగంతో తిరిగిపోసాగింది. నరాలు ఆలోచనతో చిట్లిపోతున్నాయి. అంతకన్నా గత్యంతరం లేదని అనిపిస్తోంది. కాని ఒక ఆలోచన అప్పడికి అడ్డుపడుతోంది. అదే రైతులందరితోను తనన్న మాట. మనం కష్టపడ్డ పంటకు మనమే ధరెట్టు కోవాలి. అలా సెయ్యాలంటే అందరూ ఒక్కటిగా వుండి ఒకే రేటుకి అమ్మాల మరి.. ఇపుడు తనే మాట తప్పుతున్నాడు.

'' ఏటి ఆలోసిత్తన్నావు'' తోటి రైతులడిగారు.

'' ఎవడి కష్టాలకీ అవసరాలకీ వాడే ఒకడికి తెలీకుండా మరొకడు అమ్మేస్తూనే వున్నారు'' అన్న సంగతి వారి వారి అంతరాత్మలకి తెలుసు.

'' ఒప్పుకొని వెయ్యి తీసుకో'' సాటి రైతులు మళ్ళీ అన్నారు.

సరే అన్నట్టుగా తలూపాడు అప్పడు. వెంటనే చేతిలో వెయ్యి రూపాయలు పడ్డాయి. ''సంవత్సరమంతా ఎలా గడపాలి?'' అన్న తలంపుని గుండె లోపలే గొయ్యి తవ్వి పాతేస్తూ ''పద'' అన్నాడు గౌరి గాడితో. ఆ చీకట్లో ఎడ్ల బండి కదిలింది. ఊరుదాటింది. చిమ్మ చీకటయినా బండి వెళ్తూనేవుంది. ఆ చీకటి బతుకు చీకటి కంటే చిక్కనిదేం కాదు. అప్పుడప్పుడూ బండిని కుదిపేస్తున్న గతుకులు. తమని జీవితంలో కుదిపేసిన కష్టాల కంటే పెద్దవేం కావు. అందుకే అవేవీ పట్టించుకోకుండా బండెళ్ళిపోతున్నది..

*రచనా కాలం : 30 మార్చి 1990,*

*ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక, 1-6-90*




నిప్పుల పుటం పెట్టినట్లు అప్పటి దాకా ఎర్రగా కాచిన ఎండ మరుక్షణంలోనే మంచు కురిసినట్లు మబ్బులు కమ్ముకొని చల్లబడింది. అంతదాకా బందీ అయిన గాలి స్వేచ్ఛగా తిరుగాడుతూ వాతావరణం మార్పిడికి దోహదపడుతోంది. సమయం సాయంత్రమే అయినా చీకటి పడినట్లుగానే అనిపిస్తోంది. అందుకేనేమో వీధి దీపాలు వెలిగాయి.

ఎంకడు ఎదనిండా ఊపిరి పీల్చుకున్నాడు. చెమటతో తడిసిన ఖద్దరు బనీనూ, పంచె అరిపోయాయి.

అసలు ఎంకడికి ఆ వాతావరణం చూస్తుంటే సలిదన్నం కడుపు నిండా పెరుగు మిరపకాయలతో తిన్నట్టుగా వుంది. చుట్టూ చూశాడు. బేరాలేమీ రాలేదు. రిక్షా వెనుక రెండు చక్రాలకు రాళ్ళు పెట్టి రిక్షాలోనే కూర్చొని అలాగే వెనక్కి చేరగిలబడిపోయాడు.

'' ఏటో పగలంతా ఎండ కాసేసి మా పేనాలు తోడేత్తాది. రిక్షా ఏత్తే ఒళ్ళు సర్రున కాల్తాది. బుర్రయితే ఏడికి పొగలు బయలు దేరుతాయి. కనకాలు నా బుర్ర మీద నువ్వుల నూనేసి రుద్దితే ఎంత పొంగు ఎక్కింది? వంటికీ ఏడిసేసి పోనాది... అయితే ఇప్పుడు ఎండ వానయినట్టుగా వుంది. దీనికీ ఎగతాళే గావల్ల...'' ఆలోచనలు సాగుతున్నాయి ఎంకడి నిండా.

'' ఏయ్... రిక్షా.. చాపల మార్కెట్టుకి వస్తావా?'' ఎవరో ఆసామి మామూలుగా అడగలేదు. రిక్షా బెల్లు కొట్టి మరీ అడిగాడు. అందుకే అంత తొందరగా ఆలోచన కివతల పడ్డాడు ఎంకడు.

'' ఆ...'' అన్నాడు ఎంకడు.

'' ఎంత తీసుకుంటావు'' అడిగాడాసామి.

''నా(ల్రూపాయిలివ్వండి బాబూ'' ఎంకడు రిక్షా దిగుతూ అడిగాడు.

''నా (ల్రూపాయలే...'' గుండాగిపోయినట్లుందాసామికి.

''రెం(డ్రూపాయలు తీస్కో...''

''కుదర్దండీ...''

''పోనీ రెండుంపావలా''

''కిట్టదండి...''

''కిట్టక పోడానికిదేమన్నా యాపారమా ఏటయ్యా...''

''మీరు బేరామాడుతుంటే ఎవులయినా అలాగే అనుకుంతారు....''

''చాల్చాల్లే... ఆటోకే అయిదు రూపాయలు... అరగంటలో పోవచ్చు'' ''నాకు గంట పడతాదండి... అలాగయితే నే పది రూపాయలన్నా తీసుకోవాలి. మల్ల నా ఒంట్లున్నది ఎక్కడోయించుకొనే, డీజిలు పి(ట్రోలూ కాదు రక్తం...''

''కూలి ముండకొడుకు..'' ఏదో నోట్లోనే గొణుక్కుని ''మరో పావలా, నీ ఇష్టం...'' అంటూ వెళ్ళిపోయాడాసామి, వాడు తిట్టిన తిట్లు ఎంకడికి వినపించలేదు. వినిపిస్తే ఏమనేవాడో? మళ్ళీ రిక్షా ఎక్కి కూర్చున్నాడు ఎంకడు. ఆలోచిస్తున్నాడు.

''...తను... ఎన్ని మాట్లాడేసాడు? పి(ట్రోలు-రక్తమూ ఆహా... అయినా అన్ని ఏళ్ళూ ఒకటే బేరమా? వానొచ్చేటట్లుంది, ఎదురు గాలి. కష్టమాలోసించరు.

అయినా పిల్లలిద్దరూ వచ్చే ఏలయ్యింది. మరెటూ కదల్ను ఈలొస్తే వర్షము రాకుండానే ఇల్లు సేరుకోవచ్చు...''

తరువాత ఎంకడు బనీను లోజోబులోని డబ్బులు తీసి లెక్కపెట్టుకున్నాడు.

'ఇరవైయ్యేడు రూపాయలు. అయినా ఈ నెల్లో ఎలాగయినసేసి ఆల పుస్తకాలు కొనెయ్యాల... కనకం పట్టీలు తాకట్టుకు వడ్డీ తరువాత కట్టుకోవాల... ముందు సదువు.

ఆలయినా సదువుకుంటే వుజ్జోగం వస్తాది. ఆలూరిచ్చావోళ్ళు కాకూడదు ఎన్నో మార్లు లాగే ఆసారి నిర్ధారించు కున్నాడు.

ఎంకడికి భవిష్యత్తు మీద ఆశలున్నాయి. అవి తీర్చుకోడానికి కాయకష్టపడతాడు. కానీ ఎటొచ్చీ జానెడు పొట్ట జీవితాన్నంతా మింగేస్తోంది.

అప్పటికే తన మీద ఆల పేట ఉసూరు మంటందనీ.. ఉసూరుమని పదిమంది కళ్ళు పడితే ఏ మనిషయినా మసైపోతాడనీ ఎంకడు అనుకుంటూ వుంటాడు.

ఎంకడు రిక్షా దిగి చూసాడు.

పిల్లలు ఇంకా రాలేదు. చిన్నగా వర్షం మొదలయింది. బేరమొచ్చినా కాదని బడివేపు రిక్షా పోనిచ్చాడు. దారిలోనే పిల్లలు ఎదురయ్యారు.

''తడుసుకోని ఎవడు రమ్మన్నాడు. జలుబూ... జొరమూ సేస్తే ఒకదానికొకటి?'' కోప్పడ్డాడు ఎంకడు.

పిల్లలిద్దరూ రిక్షా ఎక్కారు. ఎంకడు అంత వర్షంలోనూ గూడకు వేగిరం చేరుకోవాలని బలంగానే తొక్కాలని ప్రయత్నిస్తున్నాడు.. ''పెద్దోడా, పాటాలు సెప్పినారా?'' '' ఆ రోజంతటికీ ఒకే మేస్ట్రు చెప్పాడు. మిగిలినోళ్ళు ప్రజెంటు ఏసీసీ బాతాఖానీ కబుర్లాడుకున్నారు'' చెప్పాడు కొడుకు. వాడికి పదిహేనేళ్ళుంటాయి. తొమ్మిదో తరగతి చదువుతున్నాడు. అంత పెద్ద చదువు లెవరూ మా గూడెంలోనే చదవ లేదని ఎంకడు మురిసిపోతుంటాడు.. పాఠాలు చెప్పనందుకు 'దొంగనాకొడుకులు' మనసులోనే తిట్టుకుని ''మరినీ కమ్మా నచ్చిమీ...'' కూతుర్ని అడిగాడు ఎంకడు. '' ఆ...అయినాయి'' అందాపిల్ల. '' ఏటయినాయి. ఇదిప్పుడే రొండుకి వచ్చింది. దీనికి పాటాలుండవు...'' తనకే పాటాలుంటాయనే గర్వం కొడుకు సూరి గొంతులో కన్పిస్తోంది. వర్షం పడుతూనే వుంది. ఎంకడు రిక్షా తొక్కుతూనే వున్నాడు. రిక్షా మాత్రం ఇంకా ఆ ఊరు మాత్రమే దాటింది. ఎంకడు కాపురం చేసే ఊరుకీ-రిక్షా వేసే ఈ ఊరికీ దూరం ఏడు కిలోమీటర్లు వుంటాది.

మధ్యలో అంతా మట్టి రోడ్డే. బండి జాడి మీదుగా రిక్షా పోతోంది. నలిగిన దారి అవడం, అలవాటు కావడం వల్ల ఎంకడికీ అంత కష్టంగా లేకపోయినా కాళ్ళు తోడేస్తున్నాయి. ముడుకులు సలుపుపెడుతున్నాయి. రిక్షా అందుకే నెమ్మదిగా పోతోంది. ఇందాకటి స్పీడు లేదు.

''అయ్యా... నువ్వు దిగరా నేను తొక్కుతాను...'' కొడుకు సూరి అడిగాడు.

''నువ్వు కూకోరా సినుకులు కదా, నానే తొక్కుతాను'' సర్దిచెప్ప బోయాడు ఎంకడు.

''దిగమంతే... దిగురా అయ్యా...'' ఆ అడగడంలో అలకా, అభ్యర్థన, చిరుకోపం మిళితమై వున్నాయి. ఎంకడు రిక్షా ఆపుచేసి దిగాడు. సూరి తండ్రి రిక్షాలో కూచున్నాక తొక్కడం ఆరంభించేడు.

సూరిగాడు వయసుకి చిన్నోడయినా కష్టపడ్డానికి పెద్దోడే. అది ఆళ్ళకి వరంలా ప్రసాదించింది వ్యవస్థ. అసలు ఎంకడి అయ్య, ఆల తాతలు కూడా పాకీలుగా, పాలేరులుగానే బ్రతుకుతూ వచ్చారు. ఎంకడి బాగార్లు ఇప్పుడు చెప్పులు కుట్టుకుంటారు. ఎంకడొక్కడే రిక్షా ఎయ్యడం చేస్తాడు.

'' ఒరే ఎంకడూ.. ఎంకా సెవుడ్రా? సెవిట్ల సెట్లు బలిసిపోనాయేటి'' ఆ మాట విని ఎంకడు అపమన్న మీదట రిక్షా ఆపాడు సూరి.

'' ఏటి బాబూ వర్షంల నడిసొచ్చేస్తున్నారా?'' రిక్షా దిగుతూ అడిగాడు ఎంకడు.

ఎంకడి మాటకు సమాధాన మీయకుండానే అప్పటిదాక తడుస్తూ నడుస్తున్న ఆ వ్యక్తి రిక్షాలో ఎక్కి కూర్చున్నాడు. నచ్చిమి వేపు చూసి ''అటేక జరుగే గుంటా'' అంటూనే పోనిమ్మనట్లు చూసాడు సూరివేపు. సూరి దిగి నడిపిస్తున్నాడు. తొక్కడం

ఆవానలో సాధ్యం కావడం లేదు. అసలు నడిపించడం కూడా ఆవయసుకి కష్టంగా వుంది. రిక్షా దిగిన ఎంకడు రిక్షా వెనుకే తడుస్తూ నడుస్తున్నాడు అసలే రిక్షా ఎక్కింది పెద్ద రైతు రామగోపాలం గోరు. ఆరి పక్కన కూకోడానికి 'దవిర్యం' ఎంకడిలో లేదు. ఎందుకంటే గోపాలంగారి అన్నల వద్దే ఎంకడి తండ్రీ, తాతలు కంబార్లుగా చేశారు. ''మా మోచేతిఖ కింద గంజి నీల్ళుతాగెటోళ్ళు మా కాళ్ళ కింద చెప్పుల్లా గుండాల...'' ఆమాట ఎంకడి చెవిట్లో జోరిగలా ఘీ పెడుతోంది. ఆమాట ఈనాటిది కాదు తన తండ్రి నాటిది.

ఏడాది పొడుగునా గొడ్డుల్లా కష్టపడ్డ కష్టానికి ఇచ్చే జీతం పదిహేను పుట్లు ధాన్యం. ఇంటిల్లిపాదీ ఈదుకు రావడం కష్టమైపోయింది. ఎన్నాళ్ళని భరిస్తాడు? సహిస్తాడు? ఎన్నాళ్ళు తలవంచుతాడు? అందుకే ఎంకడి తండ్రి బుగతోరుని జీతం పెంచమని అడిగాడు. కిక్కురుమనని కంబారిగోడు నోరిప్పడం బుగతకు తల తిరిగిపోయింది. అప్పుడన్న మాటది. తల బిరుసు తనమనుకున్నాడు గాని 'తిరుగుబాటు' అనుకోలేదు బుగత.

అందుకే ఎంకడు 'తల వంచలేదు'. రిక్షా స్వతంత్రంగా ఏసుకుంటున్నాడు. అయినా అనాదిగా వస్తున్న కట్టుబాట్లు మెడని కట్టి పడేసాయి అందుకే ఎంకడు ధైరంగా రామగోపాలం పక్కన కూర్చోకుండా వర్షంలో తడుస్తూ అడుగులు వేస్తున్నాడు.

ఆ చీకటిలో..: చినుకులలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రిక్షా ముందుకు పోతూ పోతూ ఆగింది.

రిక్షా మధ్యలో ఆపేయడంతో ఆశ్చర్యంగా చూశాడు రామగోపాలం. ''ఏటయింది రయ్యా '' రిక్షా వెనుకనుంచి పరుగున ముందుకు వచ్చాడు ఎంకడు.

''అయ్యా నువ్వు రిక్షా ఎక్కి కూకో, పల్లమే కదా లాక్కెల్లిపోతాను..'' సూరి తండ్రితో అన్నాడు.

రామగోపాలం ఆశ్చర్యంగా చూస్తున్నాడు సూరిని.

''పరవాలేదు.. పోనీరా...'' ఎంకడు అన్నాడు.

''నాను పోనివ్వనంతే పోనివ్వను. నువ్వు ముందెక్కు. సెల్నీ ఒడిలో ఎట్టుకో.... రిక్షా సరిపోతుంది....'' సూరి మొండికేశాడు.

''అది కాదురా...'' అనబోయాడు ఎంకడు.

''నువ్వు ముందల ఎక్కంతే...'' సూరిగాడి మాట కసిరిన ట్లుగా వుంది. మొండికేస్తున్నట్లు సూరిగాడి ప్రతి చర్యా తెలుపుతోంది. కచ్చా కెత్తుకుంటే వదలడనీ... సూరిగాడిది ఉడుము పట్టనీ ఎంకడికి తెలుసు. అందుకే మారు మాటాడకుండా రిక్షా ఎక్కాడు. కూతుర్ని ఒడిలో పెట్టుకొని రామగోపాలం పక్కనే ధైర్యం తెచ్చుకొని మరీ కూర్చున్నాడు. 'నా రిక్షాలో నాను కూకుంతాను' అని గుండె దిటవు చేసుకుంటున్నాడు

ఎంకడు లోలోపల

'' ఎంత పోత్రం...? ఏటిటీడి పోయేకాలం... నా పక్కనే కూకున్నాడే.... అరే!''
ఏదో అనాదిగా పాతుకు పోయిన దర్పం రామగోపాలానికీ అడ్డం పడుతోంది.

వురుమురిమి చూస్తున్న గోపాలం గారి చూపు సూరిగాడ్ని భయ పెట్టలేక పోయింది. రిషా నెమ్మదిగా కదిలింది. రామగోపాలానికి ఒళ్ళంతా కారం పూసినట్టయింది. గుండు గీసి గాడిద మీద ఊరేగుతున్నట్లుంది. తట్టుకోలేకపోతున్నాడు. ఏదో... ఏదో అనెయ్యాలనే వుంది.

తగువు తెచ్చుకోవాలనే వుంది. ''ఛీ..ఛీ.. ఈ రోజు మైలయి పోనాను. ఇంటికెళ్ళి స్నానం సెయ్యాల..'' పైకే అన్నాడు. రామగోపాలం ఎంత గింజుకుని గీపెట్టినా ఎంకడూ సూరి యేమనలేదు. దాన్తో బుగతగోరికి మరీ మండుకొచ్చింది. అయినా రిషా దిగి నడిచి వెళ్లలేక అలాగే కూర్చుండి పోయాడు.

కొంతసేపటికల్లా సూరిగాడి రిషా ఇల్లు చేరింది. ఎంకడు, కూతురు లచ్చిమీ దిగారు. రామగోపాలం గోరు రిషాదిగి దారితప్పిపోయినట్టు అటూ ఇటూ చూసి వడివడిగా అడుగులు వేసుకుంటూపోయారు.

'' ఇయ్యాల దాకేటి సేసినారు...''' కనకం ఇంట్లో ఎంకడూ పిల్లలూ అడుగు పెడుతుండడంతోనే అడిగింది.

''ముందు కూడెట్టు...'' ఎంకడు అన్నాడు. తలలు తుడుచుకొని తడిసిన బట్టలు మార్చుకొని అంతా తిండి దగ్గర కూర్చున్నారు.

ఎంకడు తింటూనే ఆలోచిస్తున్నాడు. సూరిగాడికి ఎంతో ఆనందంగా వుంది. లచ్చిమికి సరదాగా వుంది. కనకంకి అయోమయంగా వుంది.

భోజనాలయ్యాయి. అవతల వర్షం తగ్గినట్టుగా వుంది.

కాసేపయాక అంతా పడుకున్నారు.

ఎంకడికి మాత్రం నిద్ర రావడం లేదు.

''కొడుకు ఎంత పనిచేశాడు? మంచి పనే చేశాడు! కానీ గోపాలంగోరు ఇంత జరిగిన దానికి ఒగ్గుతారా?!''

అయినా ఎంత మార్పు? తాత పెదవి విప్పక పోయినా తండ్రి పెదవేం కర్మ.. గుండె విప్పి అడిగాడు. మరితానో ''కంబారకం సెయ్యలేను పొమ్మన్నాడు'' సొతంత్రంగా బతుకుతున్నాడు. ఇప్పుడు తన కొడుకో? తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు ఎంకడు.

''రేపు రామగోపాలం ఏం చేస్తాడో?'' అన్న ప్రశ్నే ఆ ఆనందం ముందు తలెత్తలేదు. కొడుకును అభినందిస్తూనే నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారింది.

వీధిలో అందరూ పరిగెడుతున్నారు.

కనకం మొగున్ని గాభరాగా లేపింది.

'' ఏటే... ఏటయిందే'' అడిగాడు ఎంకడు కళ్ళు పులుముకుంటూ.

కొడుకు సూరిగాడు అప్పటికే లుంగీ బిగించి చేపల సంచీ జబ్లెడపట్టుకున్నాడు.

'' ఏట్రా పరుగులూ నువ్వెక్కడికీ'' ఎంకడు అడుగుతూనే లేచి లుంగీ బిగించాడు

''మన సెరువులో సేపలు పట్టేత్తున్నారు. రాత్రి వర్షానికి సేపలు ఎగబొడుస్తున్నాయట. గట్టు కూడా కొట్టేసింది. అయ్యా నువ్వూ రారా'' అంటూనే పరిగెత్తాడు సూరిగాడు.

చాలా రోజుల తర్వాత చేపల పులుసు-నాలుక జివ్వున లాగింది. అంతే ఎంకడు వూజి (చేపల్ని మూసే గంప) సల (వల) పట్టుకుని పరుగుతీశాడు. ''నువ్వు ఇంటి కాడుండే నచ్చిమీ... జాకర్త..'' అంటూ తపేలా పట్టుకొని కనకం కూడా పరిగెత్తింది.

చెరువు కాడికెళ్లే సరికి ఊరంతా చెరువులోనే వుంది. జాతరలో లా వున్నారక్కడ మనుషులు. చెరువు గట్టు తెగిన దగ్గర వలలు అడ్డం పెట్టారు. నీరే పోతోంది తప్ప, ఒక్క చేప పైకి పోవడానికి అవకాశం లేదు. చిన్నా పెద్దా... ముసలీ ముతకా ఆడా మగా గోచిలు బిగించి మరీ చేపలు పట్టుకుంటున్నారు. వారికి ఆనందంగానూ ఆతృతగానూ వుంది.

సూరిగాడు, ఎంకడు పక్క పక్కనే పడుతుంటే వారిచ్చిన చేపలు తపేలాలో వేస్తోంది కనకం. అప్పుడే ఏ ఏ ఊర్లు పంపాలో ఆలోచిస్తోందామె.

ఎదురుగా రామగోపాలం, తండ్రి కొడుకుల్నిద్దరి వంకా చూశాడు.

ఇంతలో ఓ సవడ రామగోపాలం వేపు నుంచి పొడుచుకొచ్చి ఎంకడి ఊజిలో దొరికిపోయింది. 'సవడ.. సవడ' గెంతాడు సూరి. ఆనందంగా '' ఇంట్లెట్టేసి రాయే'' ఎంకడి మాటతో ఆ సవడను ఇంటికి తీసికెళ్లింది కనకం.

మళ్ళీ ఎంకడికీ గోపాలానికీ మధ్య ఏదో చేప వున్నట్లయింది. వూజులు అబరా గుబరాగా వేశారు. అయితే ఈసారి ఆ చేప రామగోపాలం వూజిలో చిక్కుకుంది. వూజిలో చెయ్యి పెడుతూనే 'అమ్మా' అని చెయ్యి పైకి తీశాడు. అరచేతి వేళ్ళ నిండా రక్తం... సన్నగా వస్తోంది.

'' ఏమయింది.?'' అడిగాడు ఎంకడు.

కాస్సేపు సమాధానమీయలేదు గోపాలం. మళ్ళీ ఏమనుకున్నాడో ఏమో '' ఎంకా పట్టేమీ మార్పు లాగున్నాది'' అన్నాడు.

ఎంకడు గోపాలం గోరి వూజిలో చెయ్యిపెట్టి అతి సులువుగా వొడుపుతో చేపను పట్టి పైకి తీసి ''మార్పు... ముదరిది'' అంటూ గోపాలం ఒడి సంచిలో వేశాడు. అంతలోనే 'అమ్మో' అరిచాడు గోపాలం.

'' ఏటయింది?'' ఆత్రంగా అడిగాడు ఎంకడు.

''మార్పు ముల్లు తొడకాడ గుచ్చుకున్నాదిరా'' గోపాలం గొంతులో బాధ వుంది. గోపాలం ఒడిలో నుండి ఆ చేపను తీసి మీసాల్లాంటి దాని ముల్లును విరిచేశాడు ఎంకడు. తర్వాత దాన్ని మళ్లీ ఆయన ఒడిలోనే పడేశాడు. గోపాలంగోరికి చేప దొరికిందన్న ఆనందం కంటే తొడ దగ్గర మంట ఎక్కువగా వుంది. చిన్నగా రక్తం వస్తున్నా మళ్ళీ ఆశగా చేపలు పట్టడానికి కుపక్రమించేడు గోపాలం.

''అయ్యా...'' ఏదో అనబోయి ఆగిపోయాడు సూరి.

అందరూ చాపలు పడుతున్నారు.

కాస్సేపు గడిచింది

''అమ్మో.... బాబో... నాయనో... మంట... రక్తం... రక్తం...'' అరుపులు గోపాలంగోరి నోటి నుండి. నలుగురూ గుమికూడారు. ఎంకడు.. . సూరికూడా. ఇందాక రక్తం వచ్చిన తొడకాడ జలగ గోపాలం గార్ని పట్టేసింది. మరింత రక్తం కారుతోంది. గోపాలం ఆ జలగను పట్టుకున్నాడు. ఒళ్ళు జలదరించింది. భయం వేసింది. ఎవరో ఆ జలగను పట్టుకొని బలంగా వెనక్కి లాగుతుంటే అది మరింత సాగుతోందే తప్ప విడవడం లేదు. పైగా మెత్తగా జారిపోతోంది. అప్పటికే తొడ దగ్గర చిన్న కన్నం పెట్టేసింది.

''అలాగే తొడలో కెలిపోగలదర్రా'' ఎవరో అన్నారు.

''అమ్మో... బాబూ... సచ్చాను'' గెంతు లేస్తున్నాడు గోపాలం. అది చూసి చిన్న పిల్లలు కొందరు పకపకా నవ్వుతున్నారు. మరి కొందరు భయంతో ఒడ్డెక్కారు.

''పొగాకుంటే కసాబిసా నమిలి తుప్పున దాని మీద వుమ్మండి రా'' ఎంకడి బాగారి జగిలిగోడు అన్నాడు. వెంటనే బొడ్డున ముచ్చి కాగితంలో దోపుకున్న పొగాకు కసాబిసా నమిలాడు. ఆ నమిలిన పొగాకు వుమ్మి ముద్దను గోపాలంగోరి తొడమీద వూసాడు. కానీ ఆ వుమ్మి పక్కన పడితే చేతితో తీసుకొని జలగ పట్టిన దగ్గర వేశాడు గోపాలం. జలగ ఇంకా వదిలినట్టు లేదు. ఎంకడు మరింత పొగాకు వుమ్మి ముద్దను కేంద్రించి తుప్పున నాలుగయిద్దపాలు వూసేసరికి జలగ వదిలేసింది.

గోపాలంలో అంతవరకూ వున్న బాధంతా కొట్టుకు పోయింది. వర్షమొచ్చి కుళ్ళును కడిగేసినట్టు మనసంతో నిర్మలమై పోయింది. జలగతో పాటు జాడ్యం వదిలేసినట్లుంది. కానీ తలెత్తుకోలేకపోతున్నాడు.

''మీరొడ్డున కూకోండి. సూరీ-మనకి సేపలు సేనగాని, ఆయన గోరికి నాలుగు పట్టి ఒడెయ్యరా'' ఎంకడు మామూలుగానే అన్నాడు. సూరి తను పట్టిన చేపలన్నీ గోపాలంగారి ఒడి సంచిలో వేస్తున్నాడు. కొద్ది సేపులోనే ఒడి నిండిపోయి భారమయింది. అంతకు మించి ఏదో చెప్పలేని అనుభూతితో గోపాలం మనసూ బరువెక్కింది.

*రచనా కాలం : మే ౧౯౯౦.*

*ముద్రణ : ఆంధ్రజ్యోతి వారపత్రిక ౫-౧౦-౧౯౯౦*

# వెలుగుదారి వెతుకుదారి



గోదారమ్మకు చివరకు కొడుకుతో బయలుదేరక తప్పింది కాదు.

ఊర్లో అమ్మలక్కలూ, ఇరుగూ పొరుగూ అంతా కేశవుడికే వంత పలికారు. గోదారమ్మ చెప్పాలనుకున్నది అర్థమయిందో లేదో కాని.. '' ఒక్కదానవూ ఇక్కడేనికి... ఆయొచ్చినా పైయొచ్చినా- ఎవరు సూస్తారని... మేమున్నాం గానీ. ఏదయిన ఈ ముసలి తనంలో కొడుకు కాడ కెళ్లిపోడమే మంచిది. మనవలతో ఊసుపోతాది. కొడుకు రానన్నాళ్ళూ రాలేదని ఏడ్చేదానివి. తీరా వస్తే ఆడితో ఎళ్ళనంటున్నావు. కోడలి పిల్ల మంచిదాయే కదా. సక్కన సూసుకుంతాది... వెళ్ళు... వెళ్ళు...' అంటూ చీర మార్చేసి వూరు బయల్దేరడానికి సిద్ధం చేసేసారు.

'' ఒక పూట తినీ... మరో పూట తినక మా గురించే ఆలోచిస్తూ అనారోగ్యంపాలు అవడమెందుకు... మాతోనే వుండు... మనుమలు కూడా నాయనమ్మను చూడాలంటున్నారు...'' కొడుకు కేశవుడి మాటలు.

గోదారమ్మకూ మనవల్ని చూడాలనీ, ముద్దులుతో తడిసి పోవాలని... ముసలి శరీరానికి ఉబలాటంగానే వుంది.. కొడుకూ కోడలూ కళ్ళముందు చిలకా గోరికంల్లా కాపురముంటుంటే రేపోమాపో చావాల్సిన దానికి అంతకు మించి ఆనందమేముంటుంది?

అది కాదు గోదారమ్మకు అడ్డు కట్టులేసింది.

గోదారమ్మ పుట్టింది... పెరిగింది.. పెళ్ళాడింది... పిల్లల్ని కన్నదీ ఆ పల్లెటూర్లోనే. పట్నాల్లో... దేశంలో ఎక్కడెక్కడో శాఖోపశాఖల్లా తన కుటుంబం విస్తిరించి వుండొచ్చుగాక...!... కాని ఆవూరు విడిచి పెట్టింది ఏనాడు లేదు. యాభై ఏళ్ళ కాపురమూ గడుపు కొచ్చింది అక్కడే... కట్టుకున్న పెనిమిటిని బుగ్గి చేసిందీ అక్కడే...

అందుకే తనూ ఆ మట్టి మీదే ఇంకిపోవాలనుకుంటోంది.

కాని ఇవేవీ చెప్పడం గోదారమ్మకు చేతకాదు.

అందుకే ఏది మాట్లాడాలో తెలియక... ''మనమెళ్ళిపోతే... ఈ ఇంతడు ఇంట్లో... ఇన్నాళ్ళూ దీపమెలిగిన ఇంట్లో... ఇక దీపముండదు.. ఈ ఇల్లు సొసేనం అయిపోతాది. ఇంటికి తాళాలు పడిపోతాయి....'' దాదాపు ఏడ్చేసింది గోదారమ్మ.

''...నువ్వు లేపోతే... దీపమేనికుండదే... మనపల్లెటూర్లోన అద్దులు రాకపోయినా ఎవులు కుండమన్న ఇల్లు శుబ్రం సేసుకొని వుండకపోరు...'' సముదాయించిందొక మిత్తరాలు.

అసలు గోదారమ్మ కొడుక్కి ఇల్లు అమ్మేయాలనే వుంది. కాని తాతముత్తాతల ఆస్తి... ఆల జ్ఞాపకమని అమ్మటానికి ససేమిరా అంగీకరించలేదు గోదారమ్మ.

కేశవుడు తన ప్రయత్నాన్ని విరమించుకోక తప్పింది కాదు.

గోదారమ్మ కొడుకు వెంట బయలుదేరిందే కాని... అడుగులు ముందుకు పడుతున్నా... హృదయం వెనక్కి లాగుతూనే వుంది.. ఊరికోనేరు గుడిగోపురం, పావురాలు, పాలపిట్టలు, కోకిళ్ళు, కాకులూ... గేదెలు.. ఆలమందలూ.. మేకలూ గొఱ్ఱెలు... అన్నిటినీ వదిలి పోవడం కష్టంగానే వుంది.

అమ్మోరికి చేతులెత్తి మొక్కింది.

'' ఇన్నాళ్ళూ నీ సలవలోనే వున్నాను. కాని ఈవేళ ఇలాగ...'' చెప్పలేని భావాన్ని ఛేదిస్తూ కొడుకు పిలుపుతో అయిష్టంగానే అమ్మోరి ముందు నుంచి కదిలింది.

వచ్చీ పోయేవాళ్ళు పలకరిస్తున్నారు.

''మళ్ళొస్తావా... అక్కడే వుండిపోతారేటే...'' అంటూ అందరిదీ ఒకటే ప్రశ్న. 'అప్ప, సెల్లి, అత్త, పిన్ని, కోడలు, ఈరకత్తె, అమ్మమ్మ, నానమ్మ...'' అందరూ ఏదో సంబంధమున్నట్లు సంబోధనలే... నిజమే! ఊరంతా కుటుంబ మయిపోయింది. ఊరు చిన్నదయినా... ఒకే పేగు కాకపోయినా... ఒకే రక్తంగా వున్నోళ్ళ నందరినీ వదిలి వెళ్లడం చేత కావడం లేదు. అచేతనంగానే కొడుకు వెంట వెళ్ళి బస్సు ఎక్కింది. వెంట వచ్చిన చాలా మంది బస్సు కదిలేదాక అలానే నిల్చుండిపోయారు. కళ్ళ నీళ్ళు పెట్టుకున్నారు.

కళ్లు కలకలయినట్టు-కళ్ళు మ్రరి దుబ్బుల్లా అయి ఎఱుపుతో వాచిపోయి బరువెక్కాయి.

బస్సులో చాలాసేపు ప్రయాణించి దిగి ఆరాత్రికే మరో రైలు ఎక్కారు. పయనమయింది మొదలు కొడుకుతో ఒక్కమాట కాదు కదా పెదవయినా విప్పలేదు గోదారమ్మ.

కొడుకు ఒకటిరెండుసార్లు మాట్లాడాలని ప్రయత్నించి ఏమనుకున్నాడో ఊరుకున్నాడు.

అప్పటికి సమయం రాత్రి పదిగంటలవొచ్చు.

''అమ్మా... అమ్మా... భోజనం చెయ్యి...'' అంటూ కేరియర్ విప్పి ఓ కప్పుతో తల్లికి అందించాడు కేశవ. పట్టుకుందే కాని ఒక్కమెతుకూ ముట్టలేదు... అప్పటికే కొడుకు తినేసి చెయ్యి కడుగుకొని వచ్చి ''తిను... ఆ..'' మరోసారి కదిపాడు.

''తినబుద్దేయడం లేదురా... '' కప్పుతో భోజనాన్ని పక్కకు తోసేసింది గోదారి. కేశవుడు తినమని ఒత్తిడి చేశాడు. కాని ఫలితం లేకపోయింది.

కాలంతో పోటీ పడలేని రైలు పరిగెత్తలేక అలసిపోయి స్టేషను స్టేషనుకూ ఆగుతోంది.

అర్ధరాత్రి అవడంతో ఇంచుమించు అందరూ నిద్దట్లోకి జారుకున్నారు. కొడుకు కేశవుడు కూడా. కొడుకు తలని తీసుకొని ఒడిలో నిడుకుంది. కొడుకు ముఖంలో గోదారికి కట్టుకున్నోడు కనిపించేడు. కాలగతిలో నలిగిపోయిన జ్ఞాపకాలు మనసుని తీపిగా కుళ్ళబొడిచేస్తున్నాయి.

మనసు ఏదేదో ఆలోచిస్తోంది....

ఒక్క క్షణం వీడలేని మగడు... శాశ్వతంగా దూరమయినప్పుడు శోకించింది. కాని వెంట వెళ్ళలేక పోయింది.

రేపు తనూ పోతుంది.

ఏడుస్తారు!

కన్నీళ్ళు జారవిడుస్తారు!

జ్ఞాపకాలు మిగిలిపోతాయి. మట్టిలో కలిసేదాక అవి వెంట బడతాయి. మనిషి మాత్రం వాటి నుండి దూరంగా పారిపోలేడు. అలా పారిపోతే... ఆ జ్ఞాపకాలే లేకపోతే జీవితమే విషమయిపోతుందేమో!?

గోదారమ్మ కిటికీలో నుంచి బయటకు చూస్తోంది.

చీకటి... గాడాంధకారమయిన చీకటి... వెలుగు అక్కడక్కడా... అదే జీవితమేమో... దారిపొడుగును చీల్చుకుంటూ రైలు రొద...

భూమి విశాలమైందనిపించింది.

దీని మీద ఎంతమంది ప్రజ జీవిస్తున్నారో...!?

వాళ్ళ మధ్య బంధాలు... బాంధవ్యాలు ఎంతగా పెనవేసు కున్నాయో... పేగుతో చుట్టబెట్టుకున్న రక్తసంబంధాలు... మరెన్నెన్ని అనుబంధాలు.. అప్యాయతలు... ప్రేమలూ..

వీటన్నిటినీ వదిలి ఎప్పుడో ఒకప్పుడు మనిషి మరణిస్తాడు.. ప్రాణం గుట్టుక్కుమంటుంది.

చాలా సున్నితంగా బంధాలను త్రెంచుకొని ప్రాణం ఎలా వెళ్ళిపోతుందో...!? ప్రశ్నించుకుంది గోదారి.

తెలతెల వారుతుండగా తెలివొచ్చింది కేశవుడికి

''అ... అమ్మా..... పడుకోలేదా... '' ఆత్రంగా అడిగాడు కొడుకు.

''పడుకున్నాన్లేరా. .'' అన్న గోదారి మాట అబద్ధమని ఆ తల్లీ కొడుకులిద్దరికీ తెలుసు..

ఇంతలో దిగాల్సిన స్టేషనులో బండి ఆగడంతో గబగబా సామాన్లు అన్నీ పట్టుకొని తల్లికి ఊతమిస్తూ రైలు దిగాడు కేశవుడు. అక్కడ నుండి ఆటోలో ఇల్లు చేరేసరికి తెల్లవారింది.

''నాయనమ్మా...నాయనమ్మా....'' అంటూ మనుమలు గోదారమ్మని చుట్టుముట్టేసారు. వారి సందడికి. ....సరదాకీ... మనసులోని మసక కొన్ని క్షణాల్లోనే కొట్టుకుపోయి ఉత్సాహంతో వుక్కిరి బిక్కిరయిపోయింది. కోడలు 'అత్తయ్యా...' అంటూ అప్యాయంగా దగ్గరకొచ్చి కాళ్ళ దగ్గర కూర్చుండిపోయింది.

పిల్లల ప్రశ్నలకు ఊరునుండి ఏరుదాక మొత్తం చెప్పుకొచ్చింది గోదారమ్మ. కోడలు ఆరోగ్యమెలా వుందని అడిగితే.. ''నా మాటకేమమ్మ రేపో- మాపో పోవలసిన దాన్ను... ఆపరేషను గట్రా సేయించుకున్నావు గదా, నీవు జాకర్తగా వుండాల. గట్టి పనులు సేయకూడదు. అంతాక్కాపోతే కేశవుడికి సెప్పు.... ఇంటి పనికి తప్పేటుంటాది....? మీ మామ నన్ను నీలు కూడా మొయ్యనిచ్చోడు కాదు. తనే కావిడేసోడు ..'' చెప్పుకుపోతున్న తల్లిని చూస్తూ కేశవ కొంత కుదుటపడ్డాడు.

కోడలు స్నానానికి వేడినీళ్ళు పెడితే గోదారమ్మ గబగబా రెండునీళ్ళు పోసుకొని వంటలో సాయపడబోయింది. కాని కోడలు వద్దనడంతో ఆడపిల్లకి జడలు వేస్తో- మిగతా మొగరాయిళ్ళ మనుమలిద్దరూ అది చూసి పక్కున నవ్వారు. కొడుకూ కోడలూ నవ్వడంతో అర్థంకాని గోదారి ''నేనో పల్లెటూరి బైతుని... మీ నాయనైతే పట్నపోడు...'' మనసు ఏమూలో చివుక్కుమనడంతో అనేసింది.

ఇంకా ఆగని నవ్వులకు మరింత ముసలి మనసు కుచించుకుపోయి ''మీ నాయన్నా

కొడుకేని ముందు... ఆ తరువాతే మీ అయ్య... పట్నపోడు...'' అంది.

''స్కూల్‌కు టైమవుతోందర్రా...'' కేశవుడు పిల్లలకి గుర్తు చేశాడు.

నెమ్మదిగా కూడబలుక్కొని మనుమలు ముగ్గురూ గోదారితో-

''నాయనమ్మా ఈవేళ నువ్వొచ్చావు కదా, నీతో సరదాగా ఈరోజు వుండి పోతామే... బడికెళ్ళం... నాన్నకు చెప్పు...'' అన్నారు

'' ఎందుకు వెళ్ళర్రా... నాన్నమ్మ ఇక్కడే వుంటుంది ఇకనుండి. మీరు ముందు బయలు దేరండి....'' కాస్తంత గట్టిగానే అరిచాడు కేశవుడు.

'' ఏనికిరా కేశవా ఆకేకలు... పూట బడి మానేస్తే బతుకులాగిపోవు...'' ఆప్యాయంగా పిల్లల్ని నిమురుతూ అంది గోదారి.

''... అది కాదత్తయ్యా... ఈరోజు వెళ్లకపోతే స్కూల్లో నోట్సులు పాఠాలు అయిపోతాయి. వీళ్ళు వెనుకబడిపోతారు... అందుకేవెళ్ళనీ... వెళ్ళండ్రా... వెళ్ళమ్మా...''

కోడలు పిల్లలకి బేగులిచ్చి పంపించింది. చిన్నదయితే వెళ్లేటప్పుడు ఏడుస్తూనే వుంది.

గోదారమ్మ గొణుక్కోవడం వినకుండానే డ్యూటీకి టైమైందని కేశవ కంపెనీకివెళ్ళిపోయాడు.

కోడలు వంటగదిలో పడిపోయింది.

''... అయినా... పుట్టిబుద్దెరిగి సూసినాను... ఊర్లంతా పిల్లలు సదువుకోడానికి ఎళ్తానంటే..... ఈల్లేదు... కోతకి రారా... మరి మోతకి రారా... అయ్యకీ పనోళ్లకి తిండిచ్చేసి రారా... కళ్ళంలో కాపుండరా...ధాన్యం మిల్లాడించారా.. అంటూ పనులు పురమాయిస్తే... బడిలోకెళ్తామని బలపాలు పట్టుకు ఏడ్చేవోరు... ఒక్క రోజెళ్ళమంటే వూరికి గండయిపోతున్నారు.. సదువులు మరెవరికెరిక లేదు...'' స్వగతంగానే దీర్ఘం తీసుకుంది ఒంటరిగా కూర్చొని.

కాసేపు అయాక కూర్చోబుద్దెయ్యక ఇంటిలో నుండి వరండా దాటి బయటకు వచ్చింది. ఇరుగు పొరుగు వాళ్ళు ఇళ్ళలో నుండి పైకి రావడం లేదు. వచ్చిన్నుండి అదే గమనిస్తోంది గోదారి. ' ఇవేమి ఇళ్ళా, జైళ్లా...' పైకే అనేసుకుంది.

అదే సమయంలో అటుకేసి వయసుమళ్ళిన ఇద్దరాడవాళ్లు పోతూ గోదారి కేసి చూసేసరికి... చూపు చూపు క్షణకాలం కలుసుకోగానే... అలవాటుగా ... అనవాయితీగా పలకరింపుగా నవ్వింది గోదారి

ఆ ఇద్దరాడవాళ్ళు గోదారి దగ్గరగా రావడం చూసి ' ఏమమ్మా' అంది. ''క్యా .

బోల్తా.. ఎందుకలాగ నవ్వుతావ్..., పల్లిగలిస్తావ్?. '' వచ్చిన ఇద్దరూ అరుస్తూ మీదపడినంత పనిచేశారు. గోదారికి మొదటర్థం కాలేదు. తర్వాత వాళ్లు అపార్థం చేసుకున్నారని అర్థమయింది.

ఇంతలో కోడలు వచ్చి విషయం తెలుసుకొని సర్ది పంపించేసింది వాళ్ళని.

గోదారే అడిగింది.

''పిల్లా... నానేటన్నానని... పలకరింపులే తప్పయిపోనాయా....మనూరుల్లంట ఎంతిదీ... తెలియనోళ్ళు ...మొగమెరగనోళ్ళొచ్చినా... ఏమినాయనా ఎప్పుడొచ్చావు.. బాగున్నావా...' అని పలకరిస్తాము. ఇదేం మనుషులు...''

'' ఇక్కడి మనుషులింతే... తెలిసిన వారితోనే మాట్లాడరు... తెలియని వారితోనా ఇంకా ... ఁ...'' అంటూ ఇంట్లోకి వెళ్లి పనిలో పడింది కోడలు.

గోదారమ్మకు లోకం విచిత్రంగా కనపడింది.

వంటయినాక మధ్యాహ్నం భోజనం చేసింది గోదారి. 'పిల్లలకు కేరీజు కట్టేసాను... వాళ్ళు అక్కడే తింటార' ని చెప్పింది కోడలు. కొడుకు అక్కడే క్యాంటీన్‌లోనే తినేస్తాడట.

గోదారి కోడలుతో మాటామంతీ ఆడుతూనే వుంది. ఈలోగా కోడలు పిల్ల భోజనం చేసి... చదవడానికి పుస్తకం తీయడంతో ఆగిపోయింది. కాస్సేపు చదివి కోడలయితే పడుకుంది గానీ గోదారికి మధ్యాహ్నం పడుకోవడం అలవాటు లేదు. తినేసి అరుగుల మీద అమ్మలక్కలంతా జేరి ఊరూసులు కష్టసుఖాలు మాట్లాడుకుండీవోళ్లు.

ఒక్కరోజుక భరించలేకపోయింది గోదారి.

అదే విషయం కోడలుతో అంటే...'' ఆ... పోనీలే మన రెండిళ్ళ అవతల మన తెలుగోళ్ళ బామ్మే వుంది... నీలానే వూసులాడే వాళ్ళు కావలనేది. రేపు పరిచయం చేస్తాలే'' అందామె. కోడలి మాటలు కొంత సంతోషాన్ని కలిగించాయి.

ఆరోజు రాత్రి గోదారమ్మ పక్కనే మనుమలు చేరి కథలు చెప్పమని కచ్చాపెట్టేసి మరీ పడుకుండిపోయారు. కొడుకూ కోడలూ కూడా వేరే గదిలో పడుకుండిపోయారు. అర్థరాత్రి అవుతున్నా కన్రెప్పలు మూసుకున్నా నిద్రరావడం లేదు.

ఊరు గుర్తొచ్చింది. ఎప్పుడూ ఎత్తిపొడిసే అంకమ్మ ఆవేళప్పుడు గుర్తుకు రావడంతో తిట్టుకుంది.

తరువాత ఊరిచుట్టూ... ఆ వూరి మనుషులు చుట్టూ మనసు తిరిగి తిరిగి వేకువ రాకముందే నిద్రపట్టేసింది గోదారికి.

పిల్లలు తెల్లారగట్ల లేచి చదువుతుంటే మెలుకువ వచ్చి తనూ లేచిపోయింది. కోడలయితే పడుకోమంది కాని వినలేదు. కోడలు పిల్లల్ని చదివిస్తుంటే తను వెళ్ళి వీధి

అరుగు కడిగి గడప తుడుస్తుంటే కోడలు వద్దని వారించింది.

పట్టువదల్లేదు గోదారి. తుడవడం పూర్తయ్యాక ''కళ్ళాపు చల్లడానికి పేడ'' ఏదమ్మా అడిగింది.

''పేడ ఇక్కడ దొరకదు...''

''పేడ దొరక్కపోతే కళ్ళాపెలాగ ఏస్తారే....'' ప్రశ్నించింది అనుమానంగా గోదారి.

''కళ్ళాపులు వెయ్యరు...''

''... ఏటి కళ్ళాపులు ఎయ్యరా...'' ఆశ్చర్యంగా నొసలు చిట్లించింది.

అప్పుడే లేచిన కేశవ బ్రష్ మీద పేస్టు పెట్టుకొని వస్తూ విషయం విని నవ్వి ''... అమ్మా... నీ చాదస్తం గాని ఇది సిటీ.. పట్నం... '' అన్నాడు.

''కళ్ళాపేసి ముగ్గులెయ్యడం చాదస్తమా... ఇంటి కెంతందమూ ... ఈగలూ దోమలు గ(ట్రారావు...'' అంటూనే వత్తినీళ్ళు వత్తుగా పోసి 'కళ్ళాపు జల్లాను'' అనుకుంది గోదారి. ముగ్గుపిండడిగితే లేదంది కోడలు.

''భలేగున్నాది గాని.... నువ్వు గాని ముగ్గులెయ్యడం మరిసిపోనావేటి? పోని ఆ వరిపిండియినాతే...'' గోదారి మాటల్తో కోడలు వరిపిండి గిన్నెలో వేసి ఇచ్చింది.

ముగ్గేస్తూనే గోదారి ఆలోచిస్తోంది.... ''మనుషులు తెల్లమిగిలిపోయినారు గాని అసలు వరి పిండితోనే మొదట ముగ్గులు వేసేవోరు. బియ్యం రేట్లెక్కువయిపోయి రాయి పిండేసి జీవుల నోట్ల మట్టిగొడుతున్నారు. అసలు వరిపిండితో ముగ్గులేస్తే కోళ్ళో.. కుక్కలో తింటాయనాట. అలాగే ఇంట్లో ధాన్యపు ఎన్నులు ఏందుకు గుత్తులుగా కడతారు? పిచ్చుకలు...చిలుకలు ఎరుకుంతాయని. వాటి కాహారమెట్టడమని మాట. పెద్దోళ్ళయితే కళ్ళాల కెళ్ళి నూకలు జల్లీవోరు... అదంతా ఏనికి. వంట చేస్తే తొలికుండ ముద్దన్నం, కూర అంత పొయ్యి చుట్టూరా తిప్పి... అగ్నిదేవుడుకని అవతలకిసిరేస్తే చీమలూ, కాకులూ... అన్నీ- ఏరుకొనీవి... అలాగే మడపళ్లెట్టడం...' అన్నీ భూమ్మీద జీవుల్లోకెల్లా ఉత్కృష్టమయిన జీవి మానవుడు: ఆహారం పెట్టి ఆదుకోడం...

నేడేది...?

ఆ ఇళ్ళు ఏవి..???

ఆమనుషులేరి...????

ఆజీవులేమయిపోయాయి...??

మనుమరాలి పిలుపుతో ఈ లోకానికి వచ్చింది గోదారి.

''ముగ్గులు నేర్పించవా నాయనమ్మా....'' మనుమరాలు అడిగింది.

''సంతోషం తల్లీ నీకయినా నేర్చుకోవాలని ముచ్చట పుట్టింది. నేర్పుతాన్లే...''

అని పైకి అందే కాని...'' నేర్సుకోని ఏటి సుఖవమ్మా.. ఈ పట్నంలో ఏ ఇంటి ముందు ముగ్గున్నాదనీ, పుస్తకాల్లోన... పలకల్లోన ఏసుకొని మురిసిపోడానిగ్గానీ... ఏలా?...'' అనిపైకి అనలేకపోయింది.

చిట్టి చేతుల్తో మనుమరాలు పిండి వలక బోస్తుంటే 'అలా కాదిలా అని'... ఎలావేయాలో వేసి చూపించింది.

ఇంటి ముందు ఇరవైనాలుగు చుక్కల ముగ్గంటూ చాలా పెద్ద ముగ్గేవేసింది. ఆముగ్గు చూడ్డానికని ఈలోగా సూర్యుడొచ్చేసాడు.

కాంపౌండులో ఏ మూల దొరికిందో గోదారి కళ్ళకు తులసి మొక్క... దాన్ని తీసుకొచ్చి పెరడులో పాతిపెట్టింది. తులసి వల్ల వుపయోగాల్ని వల్లెవేసింది.

కొడుకూ కోడలూ చిన్నపిల్లల్లానే విన్నారు.

గోదారి పూజలు... పునస్కారాలు పూర్తయ్యేసరికి గంటపట్టింది. కొడుకూ కోడలూ తమ పనుల్లో పడిపోయారు.

ఇంతలో చిన్న మనుమరాలు బుడి బుడి అడుగులతో వచ్చి ''అమ్మా.. ఎవరో.. మనింటికంట... ఒచ్చారు..'' అంది తల్లి కొంగు గుంజిలాగుతూ. ఆ మాట వింటూనే కోడలు పిల్ల పరుగులాంటి నడకతో వెళ్ళింది. వెనకాలే కేశవ. మిగిలిన పిల్లలు. ఇంటి ముందు జనం.. ఆరా తీస్తే... ముగ్గు చూస్తూ నిలబడ్డారని తెలిసింది.

కేశవ అదోరకంగా భార్య వంక చూశాడు. ఆమె చిన్నగా నవ్వింది.

''ముగ్గుసూడ్డాకా...''' గర్వంగా అంది గోదారి.

''... అయితే అమ్మా.... నాన్నమ్మ ముగ్గు ఎగ్జిబిషనులో వేయించాలి...'' అన్నాడొక మనుమడు.

'' ఇంత పెద్ద ముగ్గేసి గిన్నీసు బుక్ ఎవరెక్కారు?... ఇప్పుడు నాన్నమ్మ ఎక్కుతుంది. '' మరొక మనమడు.

మనుమలంటున్నవి పూర్తిగా అర్థం కాకపోయినా ఉప్పొంగిపోయింది గోదారి.

''అంతిదిగా సూడకపోతే ఇళ్లముందు ముగ్గెట్టుకోరాదా'' తనలో అనుకుంటూనే పైకి అనేసింది గోదారి.

ఆరోజు పిల్లలు, కేశవ వెళ్ళిపోయాక కోడలు ఇంటికి రెండు తాళాలు వేసింది గోదారమ్మకు మరో బామ్మతో పరిచయానికి తీసుకువెళ్దామని.

''తాళ మెయ్యడమేనికి ఏదో ఊరెళ్లుతున్నట్టు... ఈవీధిలోనే కాదా..'' అనుమానంగా కోడల్ని అడిగింది గోదారి.

''.... అత్తయ్యా.. ఇది మన ఊరు కాదు.. పట్టపగలు పది తాళాలు వేసినా

పగులగొట్టుకొని మరీ దోచుకుపోతారు. అందుకే ఇంట్లో వున్నా చాలా మంది లోపలి నుండి తాళం వేసుకుంటారు...'' కోడలి మాటలు గోదారికి విడ్డూరంగా, వింతగా తోచాయి. తమ ఊరు ఏనుగంత ఎత్తులో వుంటే ఈ పట్నం ఈగంత చిన్నదిగా కనపించింది.

గోదారి కోడలి వెంట నడుస్తూ పరిచయం చేస్తానని చెప్పిన ఇల్లు చేరుకుంది.

కోడలు కాలింగ్ బెల్లు నొక్కగానే ఆ ఇంట్లో నుండి ఓ పదేళ్ళ పిల్లాడు వచ్చి లోపలి నుండి వేసి వున్న తాళం తీయడం చూసిన గోదారికి పరిస్థితి చాలామటుకు అర్థమైంది. ఆమెకు ఇళ్ళు జైళ్లు అనిపించాయి.

ఆ ఇంటావిడ రావడంతో వదినా మా అత్తయ్యగారు. ఈవిడకు మన వాతావరణం.. అన్నీ... పల్లెటూరి నుండి రావడంతో - కొత్తగా వున్నాయి. కష్టసుఖాలు మాట్లాడేమనుషుల్లేరని... ఇదవుతుంటే మీ అమ్మగారున్నారని... ఇద్దరు ముసలాళ్ళకి ఊసుపోతుందని...'' విషయమంతా చెప్పింది కోడలు.

గోదారికి నమస్కారం చేసి ' ఉండండి టీ తెస్తాను...' అంటూ వెళ్ళి క్షణాల్లో టీ తీసుకొచ్చి ఇచ్చిందా ఇంటావిడ.

వద్దంటూనే తాగక తప్పలేదు అత్తా కోడళ్ళు.

'' ఎవరమ్మా.... ఎవరు...'' కళ్ళకు చేయి అడ్డం పెడుతూ అంది అప్పుడే ఇంట్లో నుండి వచ్చిన ఓ ముసలావిడ. ఆమెకు చూపు సరిగా ఆననట్టుగా వుంది.

గోదారి గురించి ఆ ముసలావిడితో చెప్పి ''అత్తయ్యా వస్తాను... వస్తానండి ఇంట్లో పనులున్నాయి...'' అంటూ కోడలు వెళ్ళిపోయింది. ఆ ఇంటావిడ పెరడులోకి వెళ్ళిపోతే ఆ ముసలాళ్ళిద్దరూ ఆ అరుగుమీదనే కూర్చుండిపోయారు.

అంతకంటే మాటల్లో పడిపోయారు.

మాటలకు దొరకడంతో ఇద్దరికీ ఎక్కడలేని సత్తువా వచ్చేసినట్టుంది. దాంతో పుట్టు పూర్వోత్తరాల నుండి పెళ్ళి పెటాకులు.. సంసారాలు కబుర్లు దాటుకుంటూ చావు వరకూ వెళ్ళారు. ఇద్దరూ కలసి ఎన్నో జ్ఞాపకాలను తవ్వుకున్నారు. వాళ్ళ కనురెప్పలు తడిచిపోయాయి. గుండెలు భారమై... చెప్పుకున్నాక తేలికై హృదయాలు కుదుటపడ్డాయి.

''మనద్దిరమిక మిత్తనోరుం'' - అంటూ నేస్తరికాలు కూడా కట్టుకున్నారు.

కేశవుడొచ్చి పిలచి ఇంటికి తీసుకెళ్ళేదాక చీకటి పడ్డట్టు గోదారికి తెలియరాలేదు.

ఇప్పుడు గోదారికి ఆనందంగానూ తృప్తిగాను వుంది.

మనుమల్ని ముద్దులాడింది. గోరుముద్దలు తినిపించింది. అలా తినిపిస్తుంటే

గోదారికి తన ఊరు గుర్తుకొచ్చింది. పెరట్లోని లచ్చుడి కొడుకు సొంటెడు.. సితాలు కూతురు సిన్నమ్మి.. కళ్ళముందు మెదిలారు. తనతో తిండికి కూర్చొని పోటీ పడి తినిపిస్తేనే తినేవారు. ఎంతో ముద్దొచ్చేవారు. కూరే వుండాలని లేదు పిండొడిమిచ్చినా, అప్పడం కాల్చిచ్చినా గులాములు అల్లరి సేసోరు కాదు. ఆ గుంటలు ఏటి సేస్తున్నారో... మతిలేసుకొనే వుండుంతారు' అనుకుంది.

రాత్రి పడుకుంటూండగా తెల్లవారి లేచిన దగ్గర్నుండి జరిగినదంతా కళ్ళ ముందు మరోసారి కదిలింది గోదారికి.

ఆలోచిస్తున్న మనసును అచేతనం చేస్తూ అలసిన కనులు మూసుకుపోయాయి.

ఊర్లోకి వరద నీరొచ్చేసింది... ఏర్లూ వాగులూ గట్లు తెగి ఊరు చెరువయ్యింది... పిల్లా పిచ్చుక అంతా పరిగెడుతున్నారు. అన్నీ వదిలి కుటుంబ సమేతంగా కొండమీది కెళ్ళిపోయారు. గోదారవ్మ నడవలేక నడుస్తోంది. ఒక్కర్తీ.. ఒంటిగా వెనకబడిపోయింది.... చచ్చినా బతికినా ఈ మట్టి మీదే.. అరెరే నా ఇల్లు కూలిపోతోంది... ''అవెమ్మ'' అరచిలేచి కూర్చుండిపోయింది గోదారి. నిద్ర వదిలేసినట్లుంది. వళ్ళంతా చెమట పట్టింది.

కొడుకూ కోడలూ లేచిపోయి వచ్చి మంచి నీళ్ళు తాగబెట్టి 'పీడకలా' అడిగారు. '' ఏమిలేదర్రా...'' అనేసింది. కాని ఊరేమయిందో మనసుకు బెంగగా అనిపించింది. ఊరి మీద ప్రేమ... అభిమానం... మరింతెక్కువయ్యాయి. ఒక్కసారి వెళ్ళి ఊర్లో వాలిపోవాలనిపించింది. ఊరిని... ఇంటిని... అందర్ని జాలిగా అక్కున జేర్చుకొని తడిమెయ్యాలనిపించింది.

చాలా సేపటి వరకు నిద్ర పట్టలేదు గోదారికి.

తెల్లవారిలేస్తూనే ముంగిట ముగ్గులూ అన్నీ చూసి, తనతో తెచ్చుకున్న కుంకుడు కాయలు చితక్కొట్టి నీట్లో నానబెట్టింది. శనివారం అన్చెప్పి, వద్దన్నా కుంకుడు కాయితోనే మనుమలకి తలంటి పోసింది. పైగా నలుగు బెట్టింది. స్నానాలయినాక పవిట చెంగుతో తుడిచి సాంబ్రాణి గుగ్గిలం పొగ తలకీ వంటికీ పట్టించింది.

చిన్నది కుంకుడుకాయ కళ్ళలో పడిందని 'మంట' అంటూ ఎర్రని కళ్ళతో ఏడ్చేసరికి చాలా బాధపడిపోయింది. గోదారి తనని తానే తిట్టుకోవడం మరింత జాలనిపించి ఊరుకున్నారా మనుమలు.

గోదారి ఇంట్లో తనకోసం చేసి పెట్టిన బూర్లెను చెంగు చాటున పెట్టుకొని ముసలి నేస్తానికి అందించి వచ్చింది.

ఆరోజు సాయంత్రం కేశవ అందర్నీ సినిమాకి ప్రయాణం కమ్మన్నాడు. గోదారి

రానంది. కాని పిల్లలు ఒప్పుకోకపోవడంతో బయలుదేరింది.

రోడ్డు మీద ఆటో వెళ్తూ వుంటే, ఆటోలో కూర్చున్నా గోదారికి కారులో కూర్చునంత సంబరంగా వుంది. మేడలు... మిద్దెలు.. ఫ్యాక్టరీలు.. ఎన్నెన్నో వాహనాలు. ఇసుక పోస్తే రాలనంత జనం... అన్నీ చూస్తుంటే ఏదోగా వుంది. వింతగా అనిపించింది. దేశం ఎక్కడికో వెళ్లిపోతున్నట్లుగా వుంది.

ఇంతలో ఆటో ఆగిపోయింది.

తామెక్కిన ఆటోయే కాదు. చాలా వాహనాలు నిలబడిపోయాయి. ట్రాఫిక్ స్తంభించిపోయింది.

యాక్సిడెంటు జరిగింది.

ఎవరో పదేళ్ళ అబ్బాయిని లారీ తొక్కుకుపోయింది మనిషి తుక్కుతుక్కయిపోయాడు. రక్తం మాత్రం చాలా దూరం వరకు తుళ్ళింది. ఆబండి డ్రైవర్ని కొడుతున్నారు.

అప్పుడే పోలీసులొచ్చారు. అంతా నిశ్శబ్దమయింది. పోలీసులు కొలతలు తీసుకుంటున్నారు.

స్తంభించిపోయిన ట్రాఫిక్ వెనకాల నుండి వాహనాల హారన్‌ల మోత, ఒకటే అరుపు...

గోదారమ్మకు దూరంగా దృశ్యం కనపడుతోంది.

జనాన్ని పోలీసులు చెదరగొడుతున్నారు.

''సినిమాకి టైమయిపోతోంది.... టిక్కట్లు అయిపోతాయేమో..'' కేశవుడు గింజులాడిపోతున్నాడు. ఆటో వాడు దొరికిన సందులోంచి వీలున్నంత ముందుకు వచ్చేస్తున్నాడు.

లారీని రోడ్డు పక్కను పెట్టించారు.

శవాన్ని కూడా చాపలో వేసి పక్కకు లాగి గుడ్డ కప్పారు.

ట్రాఫిక్ కదిలింది.

ఆటో కూడా. ఆటోలోంచి గోదారి చూపులు రక్తపు మడుగు మీదకు ప్రసరించేయి. కళ్ళు తిరిగినట్టయింది. మనసంతా ఆ దృశ్యం కలచి వేస్తోంది.

''టికట్లు దొరుకుతాయంటారా...?'' కోడలి అనుమానం.

''... ఏమో... ఆటోపోనియ్...వేగం...'' కేశవుడి ఆతృత.

సినిమాహాలు ముందు ఆటో ఆగింది. ఆటోవాలాకు డబ్బులిచ్చి టిక్కెట్టు బుకింగు దగ్గరకు వెళ్ళకముందే ''హౌస్‌ఫుల్'' బోర్డు.

కేశవ చాలా నిరుత్సాహ పడిపోయాడు

'రాకరాక వస్తే హు..' బాధపడిపోయింది కోడలు. 'నాన్నా'... పిల్లలు అనుమానంగా ఏదో అడగబోయేరు.

' ఐదు పది...' మాట విన్నాడు.

బ్లాకులో కొనేసి మరీ అమ్మినవాణ్ణీ, హాలు వాణ్ణీ మనుసులోనే తిట్టుకొని జేబులు ఖాళీ చేసుకుని హాలులోకి దారితీసాడు కేశవ. అతని వెనకాలే పిల్లల్ని పట్టుకొని, గోదారిచెయ్యి పట్టుకొని కోడలు నడిచింది.

సీట్లలో కూలబడ్డారు.

అప్పటికే సినిమా నడుస్తూ వుంది.

'' ఎంతసేపయింది బిగినయి...'' కేశవుడి ప్రశ్న.

''అరగంట...'' ప్రక్కసీటు.

''పోనీలెండి...''శాంత పరచింది. కేశవుడ్ని అతని భార్య

గోదారికి కళ్ళముందు సినిమా రీళ్ళు కనబడటంలేదు. ఇందాకటి శవమే సుళ్ళు తిరుగుతోంది. రక్తం మడుగు పారుతూ వచ్చి కాళ్ళకు తాకినట్లయింది. నిజంగానే తడిగా తగిలింది కాళ్ళకు. గతుక్కుమంది. తడిమి చూసుకుంది... ఎఱ్ఱగానే వుంది... గుండె వేగంగా కొట్టుకుంది...

''కిల్లీ నమిలి ఊసేసినట్టున్నారు...'' కోడలు గోదారమ్మ వేపు చూసి చెప్పింది. మళ్ళీ సినిమాలో పడింది.

చాలా సేపటికి గాని సినిమాలోకి వెళ్ళలేక పోయింది గోదారి.

తలలు పగుల కొట్టుకోవడాలు.. చెరచడాలు... మధ్య మధ్యలో అమ్మోరు పట్టినట్టు గెంతడాలు...విసుగేసింది గోదారికి. అర్ధనగ్నంగా వుండే ఆడాళ్ళని చూస్తే చిరాకొచ్చింది. ''ఇదేం పోయేకాలం... సిర పక్కన సుట్టుకొని కొప్పున పూలెట్టుకొని భుజా ల నిండుగా పైట కప్పుకుంటె ఎంత ఒబ్బిడి.... ఎంత అందంగున్ను...' అనుకుంది. ఆగడాలు చెలాయిస్తున్న విలన్‌ని చూసి ఉక్రోషంతో పైకే తిట్టింది గోదారి.

కేశవుడు చిరాకు పడ్డాడు.

సినిమా అయిపోయింది.

ఇళ్లు చేరుకొని భోజనాలయ్యాక సినిమా గురించే చర్చిస్తున్నారు కొడుకూ, కోడలూ. పిల్లలు ఫైటింగులు గురించి మాట్లాడుకుంటున్నారు.

గోదారి మాత్రం మౌనంగా వుండిపోయింది.

ఆరాత్రి నిద్దట్లో పిల్లాడే మెదిలాడు. శవం కదులుతూ లేచి నిలబడినట్లయింది.

వాడి తల్లి ఏడుపును ఆపి రొమ్ముకు అదుముకున్నట్లయింది.

ఊహలోంచి ఇవతల పడింది...

ఆ పిల్లాడి కోసం ఇంట్లో ఎంతగా ఎదురు చూస్తుంటారో... అయ్యరాలేదని? 'ఇంకేమయ్యి.. అంతా సరి...' ఏడ్చుకుంది గోదారి.

రాత్రంతా రంపపు కోతలానే గడచింది గోదారికి. తెల్లవారింది. అన్నీ మామూలే. అంతా వెళ్ళిపోయారు. కోడలూ తనే మిగిలింది.

కోడలు వంట చేస్తుంటే నేస్తరాలి దగ్గరికి వెళ్ళాలనుకుంది గోదారి.

ఇంతలో కోడలు కడుపు నొప్పిగా వుందని చెప్పింది. కంగారు పడుతూనే ఉప్పునీరు కలిపిచ్చింది గోదారి. లాభం లేకపోయింది.

వంట గదిలోకి వెళ్ళి పోపుల సామానంతా వెతికి మరీ పట్టుకొచ్చి కోడలి నోటిలో వాము వేసి 'కసిబిసీ నమిలెయ్యమ్మా...' చెప్పింది గోదారి. కోడలు అలానే చేసింది. ఫలితం లేకపోయింది.

పళ్ళు కరచుకొని కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ నులుసుకు పోవడంతో గోదారికి చమటలు పట్టేసాయి. కాళ్ళూ చేతులూ ఆడటం లేదు. గొంతు పిడచగట్టుకుపోయి వంట్లో చిన్నగా వణుకు ప్రారంభమయింది.

'' ఏటి సెయ్యాల్లో దేవుడో...'' గొంతులో దుఃఖం ఉబుకుతోంది. కనుకొలకుల్లో నీళ్ళు చేరుతున్నాయి.

గోదారి వీధి వరకు నడిచింది. మళ్ళీ అరుగుమీదకు వచ్చి ఇంట్లోకి నడచి వీధిలోకి వచ్చి... ఇలా కాలు కాలిన పిల్లిలా తిరుగుతోంది. ఏమి చేయాలో పాలుపోవడం లేదు... '' ఇరుగు... పొరుగూ ఎవ్వరూ రారే.. ఇదేం ముష్టి మనుషులు.. ఈల నాగరీకం బుగ్గయిపోను... పిలిస్తే వస్తారా... ఏమో... రాకపోతే...అమ్మో...'' స్వగతంగా అనుకున్న మాటలు పెదవుల్లోంచే పెల్లుకుబుతున్నాయి.

కోడలి దగ్గరకు వెళ్ళింది... ''అమ్మా... మా నేస్తం వాళ్ళింటికెళ్తా... ఆల్నీ పిలుస్తా...'' చెప్పి పరుగు తీసింది గోదారి.

ఆత్రంగా చెప్పింది విని... ''అయ్యో... మా ఇంట్లో కూడా మగమనుషులు లేరాయె. ఎలాగ... మా అబ్బాయిని పంపిస్తా...'' అంటూ నేస్తం కూతురు తన కొడుకును పిలిచింది. విషయం చెప్పి ''రిక్షానో.. ఆటోనో... పిలుచుకు రారా. మీరెళ్ళండమ్మా... వాడు మీ ఇంటికే తీసుకొస్తాడు...'' అని చెప్పిందావిడ.

కృతజ్ఞతా పూర్వకంగా చూసి మనసులోనే నమస్కారమిడి గోదారి ఇంటికి పరుగు తీసింది. కోడలుకు విసురుతూ ఉపచర్యలు చేస్తూ ఆపసోపాలు పడింది. ఈలోగా

రిక్షా రావడంతో ఇంటికి తాళం వేసి కోడల్ని రిక్షాలో నిడుకొని హాస్పిట్లకి తీసుకువెళ్ళింది.

డ్కాక్టరు ముందు చేంతాడులా 'క్యూ' వున్నా అర్జెంటు కేసని చూసాడు. ఇంజక్షన్లు రెండిచ్చి, టాబిలెట్లు రాసిచ్చాడు. గంటలో ఇంటికి చేరుకున్నారు.కోడలికి బాగుండడంతో సంతోషపడి రిక్షా తెచ్చినబ్బాయికి మిఠాయిలిచ్చి, వంగి వాడి బుర్రమీద ముద్దు పెట్టుకుంది. వాడి చూపులో కూడా ఆప్యాయత వుంది.

''బడికి వెళ్ళలేదా...'' గోదారే అడిగింది.

'లేదు' అన్నట్లుగా తలూపాడు వాడు.

''నీ పేరమ్మ...'' మళ్లీ ప్రశ్నించింది గోదారి.

గుడ్లు మిటకరిస్తూ చూసాడే కాని జవాబు చెప్పలేదు. అంతలోనే వీధిలోకి పారిపోయాడు వాడు.

తరువాత కోడలి ద్వారా వాడు మూగాడని తెలిసి ఎంతో బాధపడింది గోదారి. అంతకన్నా ఎక్కువే దేముడ్ని తిట్టిపోసింది.

కోడలి బలవంతం మీద ఒక ముద్ద తిన్నాననిపించుకుంది గోదారి.

సాయంత్రానికి కేశవ, పిల్లలు వారి వెనుకే తిప్పడు వచ్చాడు.

'' ఔన్ర.. తిప్పా... నీవెప్పుడొచ్చేనావురాపట్నం, బాగున్నావా...'' అని పలకరిస్తూనే, కోడలికి బాగోలేకపోవడం అంతా కేశవుడితో చెప్పింది.

కేశవుడుభార్య పడుకున్న మంచం దగ్గరకు వెళ్ళి ఆమె తల నిమిరి విషయం తెలుసుకున్నాడు. పిల్లలు ఆదుర్దాగా మంచమెక్కి తల్లి పక్కలో కూర్చున్నారు.

''ఫరవాలేదులేరా, డాకటేరు ఇంజీసనిచ్చినాడు... ఇంద మందుల సీటి. మందు లొట్టికిరా..'' గోదారి మాటతో కేశవుడు చీటీ పట్టుకొని బయటకు నడిచాడు.

''తిప్పా... కూకోర... నిలబడిపోనావు...అవున్నీకిల్లు ఎలాగ తెలిసిందిరా...'' అడిగింది గోదారి.

'' ఏముందే అప్పా, మా అయ్యకున్న రెండెకరాలు మా నాలుగున్నరన్నదమ్ములం సర్దుకుంతే అరెకరా ఏసి వచ్చింది. ఆటిమీదేటి బియ్యం పొంగుతాయి? ఎప్పుడూ గోసికి కురసే బతుకయిపోయిందని కూలికెళ్ళాలన్నా మనుర్లో ఏటి డబ్బులొస్తాయని ఈ పట్నం వచ్చి మేస్త్రీ కాడ కూడినా. సున్నం... సిమ్మెంటు పడక సేతులూ కాళ్ళూ సిల్లులు బడిపోనాయి. ఇంకే పని దొరకాలేదు. ఆపని పూరా వుండదు.. బజార్ల మీ కేశవగుపడితే ఎంట పారొచ్చినా...'' చెప్పాడు తిప్పడు.

'' ఏమి పట్నంరా. హు...కంత గంజినీరు తాక్కొని డొక్కలకాలెట్టుకొని వుంతె సుబ్రం.... సుకం... ఇక్కడ మనుషులేరి..? అక్కడిలాగ ఒకడి కష్టం... ఒకడికొద్దు...

ఒకడి సాయం మరొకడికి లేదు. ఆ పూటకి లేకపోయినా....సెయ్యి సాయము అదవాలేకపోయినా మాట సాయముంతాది మనూరుళ్ళంట. అది సేనర మనసుగూటం పడ్డాకి...'' నిరుత్సాహంగా.... నిస్తేజంగా అంది గోదారి.

ఇంతలో కేశవుడొచ్చి ఇంట్లో టాబిలెట్లు ఇచ్చి ''తిప్పా, మరేటి విషయం? పని అంత వేగం దొరకదు. దొరికితే కబురెడతాను...'' అన్నాడు.

కొన్ని క్షణాల నిశ్శబ్దం తరువాత-

''మరి పని సూడకండయ్యా... నాను మనూరే ఏకంగా ఎలిపోతాను. ఈపాటి బతుకు అక్కడా బతగ్గలను. ఇక్కడ సస్తూ బతకడం కంతే అక్కడ బతికి సావడం మేలు. తోవ మార్సుకున్నాను...''

''అది కాదురా...'' ఏదో చెప్పబోయాడు కేశవ.

''పిల్లలూ... పెళ్ళం... అందర్నొదిలి ఏట్రా నీకిగతి తిప్పా...పోనేటి నాలుగు పైసలు సంపాదిస్తన్నావా... ఇంటికి పంపడానికి... మరేల అలాటప్పుడు నీ ఇష్టపెకారం ఇంటికి పో...'' గోదారి తీర్పు ఇచ్చేసింది.

తిప్పడు వెళ్లిపోతానంటె - ఆరాత్రి కడుపునిండా భోజనం పెట్టి పదిరూపాయలు కొడుకు దగ్గర తీసుకొని ఇచ్చింది గోదారి. తిప్పడు గోదారికి, కేశవుడికి నమస్కారం పెట్టి ''మీ ఋణం తీర్సుకోలేనిది'' అంటూ వెళ్ళిపోయాడు.

రెండ్రోజులు గడిచాయి.

కోడలు పూర్తిగా కోలుకుంది.

ఆరోజు పండగరోజు...

' ఇంట్లో పిండివంటలు తప్పితే సందడి లేదు. అక్కడ వూర్లో లాగ సంబరాలు లేవు. సరదా లేదు. అక్కడ ఊరెంత వుప్పొంగి పోతుంటుందో...'' తను పండుగకు అక్కడ లేక పోయినందులకు ఎంతో బాధపడిపోయింది గోదారి. రెక్కలుంటే మాత్రం వెళ్ళి వాలిపోయేదే...

కొడుకు కూడా అడిగాడు '' ఏవమ్మా... అలావున్నావ్...''. వాడికి చెప్పినా అర్థంకాదు.. చెప్పు కోలేదు.

ఇంతలో గోదారి గుండెకు గండి పడ్డట్టు వార్త!

గోదారి నేస్తరాలు చచ్చిపోయింది. గోదారి ఏడుస్తూ పరుగు తీసింది. శవం మీద పడి భోరున ఏడ్చింది. సొంతమయిన వాళ్లెవరూ ఏడవడం లేదు. '' ఎలానూ ముసలైపోయింది. వయసుడిగి పోయింది. ఆమె భర్త కూడా ఎప్పుడో చనిపోయేడు. పోయినా ఈ లోకాన్ని వీడి ముక్తురాలైనందుకు సంతోషించాలే గాని... బాధెందుకు...

ఆమె బాధ తీడేరిపోయాయి'' అనే భావనే అందర్లోనూ.

గోదారి ఒక్కర్తే పిచ్చిది. మానవ సంబంధాలు శాశ్వతం కావాలనుకొనే వెర్రిబాగులది. తెలివితక్కువది. చావు పుటకలు సహజమని తెలియదేమో! నిబ్బరమో రాతి గుండెలదో ఆ వాక్కు.

స్నాన మాడించి శవాన్ని కాటికి మోసుకు పోతుంటే చాలా వరకూ వెంట పడ్డ గోదార్ని వెనక్కు తీసుకువచ్చారు. నేస్తురాలి మనవడు గోదార్ని చూసి మరీ వెక్కివెక్కి ఏడ్చాడు.

నేస్తురాల్ని బుగ్గి చేసేసారు.

కేశవుడి గోదారిని ఇంటికి తీసుకుపోయాడు.

'' ఎవర్తో చస్తే.. వెర్రిముండలా నీ ఏడుపేంటే... సిగ్గూ ఎగ్గూ లేకుండా వీధిల పడి...' కొడుకు ప్రశ్న గోదారి శరీరాన్ని ముక్కముక్కలుగా కోసి కారం అద్దింది. సమాధాన మీయలేదు. తినమంటే తినలేదు. అలా అని కొడుకుమీద కోపం లేదు. అసలు పట్నం పైత్యం మీదే ఆవిడ రోషమూ, ఆవేశమూ, బాధా... అన్నీను..

ఇంట్లో అందరూ భోం చేస్తున్నారు. మనుమలు పిలిచి లాభం లేక ఊరుకున్నారు. కోడలు చెప్పినా ప్రయోజనం లేదు.

గోదారి ఒంటరిగా కూర్చుంది. ఆలోచిస్తోంది. మనుషుల మనసులేకమయిపోయాయి. చావు బ్రతుకుల్లో వున్నా... చచ్చినా... అనవసరం. ఎవడి బ్రతుకు వాడు బ్రతకడమే అవసరం!

'మనిషిపోతే తనూర్లో ఐతే ఊరు తిరగబడేది... దుఃఖంతో నిండిపోయేది. బుగ్గి చేసిందాక బువ్వ ముట్టరు. పురమెత్తడం... ఏట్లో కలపడం... చివరిగా మనిషిపోతే వీడ్కోలివ్వడం కళ్ళముందు కదలాడింది... ఆజనం వేరు... ఆబతుకులు వేరు.. ప్రేమలు.. అనురాగాలు.. అప్యాయతలూ... వేరు ... వాళ్ళ మధ్య రెండునాళ్ళు గడిపినా చాలు... ఈ మానవ రాక్షసుల మధ్య బతకాలంటే బండలాంటి గుండె కావాలి. అది తనకు లేదు. తను ఇమడలేదు. ఇంకిపోలేదు....

అందుకే అమృతాన్ని పంచే ఆత్మీయుల దగ్గరికి వెళ్ళిపోవాలి. కన్నీళ్లను పంచుకొనే కన్నవారి దగ్గరికి... కన్న భూమి దగ్గరికి... పుట్టిన మట్టి మీద గిట్టిపోడానికి వెళ్లిపోవాలి.

'నేను నా ఊరెళ్ళిపోవాలి' అనుకుంది. గోదారి.

అనుకున్నదే తడవు మనసు పట్నం దాటుకొని పల్లె పొలిమేర్లలోకి వెళ్లిపోయింది.

*రచనా కాలం: సెప్టెంబర్ 1990,*

*మే: 1992 రచన సచిత్ర మాస పత్రిక ( ఉగాది ప్రత్యేక సంచిక)*

# వానపాములు



పొయ్యిలోని జీడికర్రలు మిట్టల్లా పొర్లుతున్నాయి. అవి పులపచ్చిగా వుండడంతో ఎత్తురుకోవడం లేదు, పైగా పొగ ఇల్లంతా కమ్ముకుపోతోంది. ఇంటి చూరుకి మసి సున్నమేస్తున్నట్టు - నల్లగా కాటుక పూసినట్లయి వెదురు దుంగలు, అడ్డు పట్టైలు ఆనవాలు దొరకవు. ఇంటి నలుమూలలా అల్లుకున్న సాలెపట్టులు గోడకు అంటుకు పోయి గబ్బిలాల్లా వున్నాయి.

సాయమ్మ పొయ్యిముందర ముఖం పెట్టి గుండెల్లోంచి మరీ ఊపిరి బిగబట్టి లాగి ఊదుతూంది. అలా వూదడం వల్ల పొయ్యి వెలగలేదు గాని గొంతు ఆర్చుకుపోతూ వుంది. వల్లంతా పట్టిన చెమటను నేత చీర పీల్చుకుంటోంది. ఆడ్డాల్లోని బిడ్డ ఏడుపు అందుకుంది. అదేమి పట్టించుకోకుండా మళ్ళీ ప్రయత్నించబోయి పొగ నోటిలోకి, ముక్కులోకి చొరబడి పొలమారుతూనే దగ్గువచ్చింది. బిడ్డకు ఊపిరాడడం లేదోమో గుక్క పెట్టేసింది.

''..వోరే పెంటా.. అన్రావోరి పెంటా... ఎక్కడ దిబ్బయిపోతున్నావురా...'' సాయమ్మ కేకతో బోసిగా ఐదేళ్ల పిల్లాడు పరుగున వచ్చి '' ఏమే'' అన్నాడు. వాడి వండినిండా బురదా, బుగ్గీ అంటుకొని వుంది. ఆట మధ్యలో వచ్చేసాడేమో!

'' ... ఇదరీడ్ని తీసికెళ్ళి ఆడించుమీ. .'' సాయమ్మ బిడ్డని అందించింది.

''అమ్మా'' ఏదో అనబోయాడు పెంటడు పిల్ల నందుకుంటూ.

''ముందవతలికి ఒట్టికెళ్ళురా గులామా... ఇలాగ సాదిస్తన్నారేమి...'' తల్లి సాయమ్మ మాటతో కిక్కురుమనకుండా పెంటడు తన కడుపుమీద చెల్లిని పెట్టుకొని ఈడ్చుకు పోబోయాడు. ఇంతలో ద్వారంతగిలి దబ్బున పడిపోయాడు వెనక్కి. పెంటడి తలయితే చిదిగి బొడిపి కట్టింది. అయినా కిక్కురు మనలేదు. 'అమ్మికి తగల్లేదు కదా' అనుకున్నాడు. ఆ పిల్ల వాడి మీద పడడంతో దానికి దెబ్బ తగల్లేదు కాని ఏడుపు మరింత ఎక్కువ చేసింది.

అమ్మ వచ్చి తన వీపు ఎక్కడ చీరేస్తోందోనని భయంతో లేచి మళ్ళీ గబగబా చెల్లిని కడుపుమీద పెట్టుకొని లాక్కుపోయాడు. ఆ పిల్ల మాత్రం ఈండ్రబడుతోంది.

''తిన్నిదంతా ఏ ఏట్ల కలిపేస్తన్నాడో... ఈడి బుర్ర పడిపోనూ...'' తనే కన్నా, వయసయినా ఆలోచించకుండా తన సొదతో తిట్టింది సాయమ్మ.

తల్లి మాటలు వినిపించుకోకుండా వీధిలోకి వెళ్ళిపోయాడు పెంటడు.

ఎన్నేళ్ల ఓపికో కాని పొయ్యి ఎత్తిరించే ప్రయత్నమే చేస్తోంది సాయమ్మ. పక్కనే కిరసనూనె బుడ్డీ. దాన్ని అందుకొని పొయ్యిలో కొంత పోసి అగ్గిపుల్ల గీయాలనుకుంది. కాని ప్రాణమొప్పలేదు. '' ఆ సమురుంటె రాత్రల్లా కాకపోయినా... సిన్నపిల్ల తొంగున్న దాక పనికొస్తాది. లేకపోతే నానా అల్లరి సేసీదా...?'' అనుకుంటూ ఆ ప్రయత్నం విరమించుకుంది.

సాయమ్మ పొయ్యిలోని కర్రలు కిందా మీదా వేసి తిరగేస్తూ వూదుతుంటే కర్ర తగిలి బుడ్డీ తిరగబడి కిరసనూనె పొయ్యిలోకి జారుకుంది. '' ఓలమ్మో... తిరగబడిపోనాది బుడ్డీ సమురు...'' నొచ్చుకుంది. ఇంతలో పొయ్యిలోని పొగ రైలు పొగలా గుప్పుమంది. అప్పుడు సాయమ్మ అగ్గిపుల్ల తీసి అంటించింది. పొయ్యి ఎత్తురుకొని ధనధనమని కాలింది. కర్రలు అంటుకున్నాయి. పిడక రెండు ముక్కలు చేసి పొయ్యిలోకి దోపింది. మంట కొంచె నిలిచి కాలుతోంది.

''నాయమ్మ... అలాక్కాలే...' సాయమ్మ స్వగతంగా పైకే అనుకుంది. పొయ్యిమీది పెద్ద గూనలో ధాన్యం వుడుకుతున్న చప్పుడు 'ఝూ' మని వినిపిస్తోంది. గూన మీది సిమెంటు రేకు సరిచేసింది.

సాయమ్మ గుండెలు తడిచిపోతున్నాయి. రవిక లేని కోకలో పాలు ఇంకిపోతున్నాయి. పిల్లది పాలు కుడిచి మధ్యలో పొగతో వూపిరాడక ఏడుపెట్టుకొని తాగలేదు. అందువల్ల పాలు సలుపు పెడుతున్నాయి. తన రెండు అరచేతుల్తో గుండెల్ని రుద్దుకొంది. వీధిలోకి వెళ్ళి పిల్లని తీసుకొని పాలివ్వాలనుకుంది.

అప్పుడే సాయమ్మ మొగుడు ఎరకడు వచ్చాడు. వస్తూనే '' ఎండ పోతంది. బేగిలేయే.. పనితెమిల్సినావా.. పది గంటలు దాకా పొయ్యిమీదే కుండలుంతే పనెప్పుడవుతాది?'' అన్నాడు.

''నాకు నాలుగు చేతుల్లేవు... ఎగిరిపోడాకి రెక్కల్లేవు.. అవును గాని ఆ

షావుకారిబాబు, ఆ ఏకాశిరైతులాలు ఏటన్నారు.. ?'' ప్రశ్నించింది సాయమ్మ.

'' ఏటంంతారు... ఈ సారికి ఇచ్చినాం గానీ, ఇకన అరువు లివ్వమన్నారు. డబ్బిచ్చే తీసికెళ్లమన్నారు....'' చెప్పాడు ఎరకడు.

'' ఏవి? ఇన్నాల్లూ అల్ల దాన్నేం ఆలకి తీర్సనేదా? తీర్సకపోయినట్టు అవేం మాటలు. ఆల దాన్నేలు తెచ్చి మన గాదిల్లంట పోసుకొని తినీడాకా...? రేపు మిల్లాడించి సపిలీ అయ్యాక ఇచ్చీవేంటి? అలాగ అడగ లేక పోనానా...'' సాయమ్మ మాటలో రోషముంది.

''నానామాటే అన్నాన్లేయేం... డబ్బులిస్తావన్నోడికి మానీసి నీకు అరువు లివ్వాలేట్రా... ఆ మర్యాదేదో నువ్వే వుంచుకో... నువ్వు దాన్నిం ఒట్టుకెల్లు అన్నారు. నానేటి మాట్లాడుంతానే...'' ఎరకడు విషయం చెప్పేసరికి సాయమ్మ నోరూ మూతబడిపోయింది.

మూత పెట్టిన మూత రేకు గూన మీద నుండి ఆవిరికి జారిపడింది. '' ఆయ వస్తంది సూడిమీ...'' పేరుకోబోయిన నిశ్శబ్దాన్ని చీల్చాడు ఎరకడు. సాయమ్మ కొంగు నడుముకు చుట్టి గూనకు చెవ్వునించి ''వుడికి పోనాది...'' అంది.

ఇద్దరూ కలసి గూన దించి వుడికిన ధాన్యాన్ని నేలపైకి వంపారు. ఆవిరి ఆకాశంలా లేచి, వాళ్ళముఖాలమీదకు కొట్టింది. నీటి ఆవిరి వాళ్ళిద్దరి ముఖాలమీద బొట్లుగా తేలింది.

''అన్ని కుండలూ దించీసి నట్టేనా...'' ఎరకడు అడిగితే అయిపోయినట్టు తలాడించింది సాయమ్మ.

''... అయితే మంట పోతంది పొయ్యార్పీ...'' మళ్ళీ అన్నాడు ఎరకడు.

''వంటో...? ఈ కుండలు దిగతోటికి ఇయాలయింది.... పిల్లలకి తొరిపినన్నం రాత్రిదుంటె అదే ఒకరవ్వెట్టినాను... మద్దేనంకీ మళ్లా బోజనాలూ...?'' అంటూ సాయమ్మ పొయ్యిమీదికి ఎసరెక్కించి బియ్యం కడిగి పోసింది.

''... ఈ నెల ఆ కొండ్రోడాలికి ఏపగించమని సెప్పినాను.. సోళు నాల్తాములు తీసుకుంతె ఓ రెండోరాలు గండు గడుస్తాది...'' ఆలోచనగా చెప్పింది సాయమ్మ. ఆ ఆలోచనల్లో పడి బిడ్డకు పాలివ్వడమే మర్చిపోయింది. బ్రతుకు భారంలోపడిన ఆమెకిప్పుడు రొమ్ములు సలుపెట్టడం మానేసాయి. గుండె అలజడితో గొలపోడుస్తోంది.

ఎరకడు అదే ఆలోచనలో పడ్డాడు.

ఎర్రటి మంటలకు ఎసరు మరుగుతున్నట్టు వాళ్ళ కష్టాలకి గుండెలు మరిగి మరిగి పోతూనే వున్నాయి.

ఎరకడు ఇద్దడుకున్న నలుగురు కొడుకుల్లో ఒకడు. ఇద్దడు తాను వెళ్ళిపోతూ తన పేరున వదిలిపోయిన రెండున్నర ఎకరాల భూమికి తల్లి జబ్బుతో అర ఎకరా హారతైపోగా మిగిలిన రెండెకరాలకి నాలుగోవంతు అరెకరా వచ్చింది. తన తండ్రి మిగిల్చిన

తాత ముత్తాల ఆస్తి... తర తరాలుగా వస్తున్న ఆస్తి... అరెకరా నిలుపుకోవాలనే ఎరకడూ ప్రయత్నించాడు. కాని అదీ కుదరలేదు. సగం ఆకలయినా తీర్చలేని అరెకరా కోసం ఎద్దులూ పోతులూ... బండీ బక్క... నాగలి నక్కూ- అవి అమర్చుకోవడం ఆకాశమంత ఎత్తయి పోయింది. అందుకోలేక పోయాడు. అలా అని అంబారాని (కౌలు) కి ఇచ్చెయ్యలేకపోయాడు.

అందుకే అరెకరా అమ్మేసి వ్యాపారం చేయాలనుకున్నాడు. అది ఎరకడికి వచ్చిన ఆలోచనా కాదు. మేనమామ తన కూతురుని ఇచ్చాడు కాబట్టి తన బాగు కోసం చెప్పితే అమలు చేశాడు

ఆ వ్యాపారమే.. ధాన్యం కొని బాగుచేసి, వుడకబెట్టి... ఎండబెట్టి మిల్లాడించి బియ్యం చేసి అమ్మడం..

అదే జీవన భృతయ్యింది.

బియ్యం పొంగు పొయ్యిలో పడిపోయి ఆరిపోవడం 'ఛుయ్...' మన్న చప్పుడుతో ఇద్దరూ ఈ లోకంలోకి వచ్చారు.

సాయమ్మ మళ్ళీ పొయ్యి వెలగబెట్టి అన్నం వండింది. ''కూరేటి లేదు...'' సాయమ్మే అంది.

'' ఇయ్యాలయి పోయింది... ఇంకేమి కూరొండుతావు గాని... వుల్లిపాయో, వడిమో నంజుకుంతె ఈ పూటకు గడిసిపోద్ది...'' ఎరకడి మాటతో పొయ్యి ఆర్పేసింది సాయమ్మ.

పెంటడు ఒక్కడూ ఇంట్లో కొచ్చి ''... అమ్మి రాడంలే...'' అన్నాడు.

సాయమ్మ లేచి '' ఎక్కడుందిరో!'' అంటూ వీధిలోకి వెళ్ళి మట్టిలో పొర్లుతున్న పిల్లని ఎత్తుకువచ్చింది. పిల్లది తన కళ్ళలోకి చూసేసరికి - కరిగిపోయి ''నాయమ్మే... ఏది ఏది పాలు తాగీ...'' అంటూ రొమ్ముని పసి పెదాలకు అందించి ''బుచ్చిముండది... అల పండుది...'' ముద్దులా డింది.

''అమ్మా... ఆకలే..'' పెంటడి మాట పట్టించు కోలేదు ఎవ్వరూ.

'' ఆకలేస్తందంతే... ఒరయ్యా..'' తండ్రి పంచి పట్టుకు లాగాడు పెంటడు.

''వుండ్రా... వుడూకయుంది...'' అంటూ ఎరకడు అన్నం వార్పు ఎత్తి చల్లార్చుతుంటే... ''వు వూ... వూ...'' అంటూ గాలితో వుమ్ముని వదిలి చల్లార్చే ప్రయత్నం చేశాడు పెంట డు.

సాయమ్మ పాలు పెట్టేసాక, రెండు కంచాల్లో అన్నం వడ్డించింది. ఒక కంచం ఎరకడి ముందుకు తోసింది. మరో కంచం పెంటడి ముందు కలిపిమరీ పెట్టింది.

''అయ్యతో తింటానే...'' అన్నాడు పెంటడు.

''... అవతల బోల్డంత పనుంది... నువ్వు రేపియ్యాల దాక తింతే పనులు తొంగుంతాయి... అందుకే నీకా కంచంల ఏసినామ తిను... అల్లర పెట్టకు... వడిమ

ఇంద...'' అంటూ సాయమ్మ వడిం అందించింది కొడుక్కి.

పెంటడు వడిం అందుకొని మారు మాటాడకుండా తనకు వేసిన కంచంలోనే తింటూ - సంవత్సరము అయినా నిండని చెల్లికి తినిపిస్తుంటే, బోసి నోరుతో ఆ పిల్ల ఒక్కో మెతుకూ కల్లు మూసుకు చప్పరిస్తోంది. వాడి మట్టి చేతులకున్న మురికి అన్నంలో కలిసి చేతులు తెల్లబడుతున్నాయి. వాడు రెండు చేతులూ పెట్టి అన్నం పిసకడం ప్రారంభించాడు.

ఎరకడు గెంజి ఎత్తిబెట్టుకొని తాగి, చేతులు తడి ఆరక ముందే గంపలోకి ధాన్యం ఎత్తి తీసుకువెళ్లాడు.

ఈ లోగా సాయమ్మ వీధంతా సడుం పడిపోయేలా, చీపురు అరిగి పోయేలా తుడిచింది. తుడిచిన వీధంతా చివరిదాకా ధాన్యం తెచ్చి పోసాడు ఎరకడు.

అప్పుడే వచ్చాడు అసిరిగాడు.

'' ఒరే... అసిరీ నాలుగు తట్టలు తెచ్చిపొయ్యరా... ఎందంట తిరగతన్నావురా...'' కొడుకుని చూడడం తోనే అడిగాడు ఎరకడు.

తండ్రిమాట పట్టించుకోకుండా ''అమ్మా... రాయే తిండెట్టు..'' అన్నాడు అసిరిగాడు.

'' ఇటు పిలిస్తే... అటు పలకతన్నావు.. నీ కేం పోత్రమా... తిరిగేసొచ్చినావు పని సేస్తే తప్పా...'' ఎరకడిమాట అసిరిగాడి చెవులకు అసలెక్కలేదు.

''అమ్మా .'' అసిరిగాడి కేక గర్జనలా వుంది.

సాయమ్మ ఇంట్లోకి వెళ్ళబోయింది. ఎరకడు భార్యను ఆపుచేసి ''... నువ్వుండే, రెండు తట్లు మోస్తేనే తిండెట్టు... నిన్నే..'' అన్న మాటలకు సాయమ్మ వెనక్కి తగ్గింది.

''నా నొడ్డించుకోలేనేటి...'' ఇంట్లోకి చొరబడబోయాడు అసిరిగాడు.

అంతే.. ఎరకడు అసిరిగాడి జుట్టు వంచి దబాదబా వెన్నులో నాలుగు గుద్దులేసాడు. సాయమ్మ వారించబోయింది. ''నువ్వేటి? ఆడు బొత్తిగా పద్దుకుమాలినోడయిపోతుంతే ...'' ఎరకడి కోపం ఎరుపెక్కింది.

అసిరిగాడు ఏడుస్తూ కూలబడి పోయాడు.. వాడి వెన్నుమీద అరచేతి వేళ్ళు అచ్చుపడ్డాయి. అసిరిగాడికి పన్నెండూ- పదికి మధ్యలో వయసు వుండొచ్చు.. పనీ పాట ఇష్టం వుండదు... ఆటలాడుకోవడం... 'ధనవంతుల పిల్లల్లా కాలేకపోయానే' అని బాధపడిపోవడం వాడి తీరు.

వీధిలో చప్పుడికి పెంటడే కంచం పట్టుకుని మరీ.. ఎంగిలి దులుపుకోకుండా వచ్చి చూసాడు. విషయము అర్థమైనట్లుంది వాడి బుర్రకి. తన చేతిలోని కంచాన్ని అసిరిగాడి ముందుకు తోసి తాను చిన్న తోపేలాతో ధాన్యం మొయ్యడం ప్రారంభించాడు.

''అగ్న... గుంటా.. నోరన్నా కడుక్కోవేటిరా..'' వీధిలో ఓయమ్మ కేక వాడి పనికి ఆటంకం కాలేదు.

పెంటడు రెండు తపాలాలూ పోసాడో లేదో

- మూడోసారి పామంచం దిగుతుండగా, తూలి పడి ఆపుకోలేకపోయాడు. అంతే ... ధాన్యమంతా గుమ్మం నిండా కల్లాపులా పరుచుకున్నాయి.

'' గులాము.. ఒక పనికి రెండు పనులు..''

సాయమ్మ మాట వినిపించడమే చాలు తపేలా అన్నీ వదిలేసి కాలు సత్తువ కొద్ది పరిగెత్తాడు పెంటడు.

అది చూసిన సాయమ్మకు కోపం పోయి నవ్వొచ్చింది... ''జాకర్తరా పడిపోతావ్..'' హెచ్చరించింది.

వీధిలోని ధాన్యపు చిన్న చిన్న పోగులన్నీ కాలితో నెరిమింది సాయమ్మ, ఎరకడూ సాయపడ్డాడు.

'' ఎండ బాగా ఎక్కుతంది... నీవు కంత తినేసి పా(రాయే...'' ఎరకడు సాయమ్మని కేకేసాడు.

సాయమ్మ పెంటడు పారబోసిన ధాన్యపు గింజలు ఒక్కొక్కటి ఏరి తెచ్చి, చేటలో వేసి ఎరకడికి అందించి ఇంట్లోకి వెళ్ళింది. ఏడుస్తున్న పిల్లని ఊయాట్లో వేసి జోకొట్టి నిదురపుచ్చింది. కంచం ముందు కూర్చొనేసరికి పెద్ద పిల్లలిద్దరూ వస్తే వాళ్ళకు వడ్డించింది. వాళ్ళు తిని వెళ్ళాక కుండలో మిగిలిన గుప్పెడు మెతుకులు వడ్డించుకొని ఆత్రంగా తినబోయి అరుగువేపు చూసింది.

అసిరిగాడు చూస్తున్నాడు...

''రారయ్యా...తినురా..'' అంటూ చెయ్యి పట్టుకు ఇంట్లోకి తీసుకువచ్చి కంచం ముందు పెట్టింది.

''ఏనికా తిరుగులు... మీ అయ్య సెప్పినట్టు ఇంతే కాదా... నేనేమన్నానంతే మారటితల్లి అద(రా.. అంతారు గానీ...'' సాయమ్మ అనేసి వీధిలోకి వచ్చింది. ఆకలిగా వుంటే వార్చిన గెంజిలో వుప్పు కలుపుకొని కడుపు నింపుకుంది.

కోమిటోల సిగిడీ మీద కూర్చొని ఎరకడు వచ్చీ పోయినోళ్ళతో ఏదో మాట్లాడుతూ క(ర పట్టుకొని ధాన్యం కాపు కాస్తున్నాడు.

సాయమ్మ మళ్ళీ ధాన్యం నెరుపుతూనే ఓ గింజ చిదిపి నోట్లో వేసుకొని పదును చూసింది.

''ఇంకంత సేపుండాల'' అనుకుంది.

సూర్యుడు గొడేవోళ్ళ (నెయ్యిలు వేసేవారు)

పొయ్యిలాగ సెగలు కుక్కుతుంటే నేలంతా పెనంలా కాలిపోతోంది.

సాయమ్మ కాళ్ళు మాడిపోతున్నాయి. వంగి ధాన్యం నెరుపుతుంటే వీపు కాలిపోతోంది. 'అబ్బా ఏమెండమ్మ' స్వగతంగా అనుకుంది.

ఇంతలో ఓ పిల్లాడు చ(క్రం తిప్పుకుంటూ ధాన్యం లెల్లి తుళ్ళించుకుంటూ

వెళ్ళిపోయే సరికి సాయమ్మకి వల్లు మండింది. పైకే తిట్టింది.

'' ఊరుకోవా... చిన్న పిల్లలు...'' పొరుగింటమ్మ చూస్తూ అంది.

''పిల్లముద్దని బాగ్యం ముద్దా...? ఏటా అగడాలు... నా నడుం ఏరలేక, సెయ్యలేక నారయిపోతుంతే ...'' సాయమ్మ మాటలు పూర్తిగాకుండానే అవతలావిడ మూతి మూడు వంకర్లు తిప్పి వెళ్ళిపోయింది.

అప్పుడు ఎదురింటి పోలిగాడు పెద్ద గొంతుతో... ''రోజా ఈదిల దాన్నేలు ఎండేసి ఈది కళ్ళం సేస్తన్నారు... సెస్.. ఈదిలెవుడుండక్కర్లేదా...'' అనుకుంటూ వెళ్లిపోయాడు.

సాయమ్మ గొంతు ఎత్తేదే కాని ఎరకడిని చూసి ఆగిపోయింది.

''దాన్నిం దగ్గరకు కూడెట్టు... మరొక్క పొలుపు తగిలితే సరి, ఈలోగ అడ్డగ పట్టేమీ.,.. రాళుంతయి..'' ఎరకడి మాటతో ధాన్యం దగ్గరచేసి పరిచింది. ఎరకడు చేట, జల్లెడ అందించాడు.

సాయమ్మ ఎండలో కూర్చొని ముసుగు కప్పుకొని, కొంగు దోపుకొని ధాన్యం జల్లించడం మొదలు పెట్టింది.

ఎండకీ, ధాన్యం పొకరకి (దుమ్మూ, ధూళికి) దగ్గుతూనే పని చేస్తోంది సాయమ్మ. చెమట ధారలా ఆమె వంటంట కారుతోంది.

ఎరకడు ఎండకు తట్టుకోలేక అరుగెక్కాడు.

'' ఈ సుబద్ర గుంట ఊరెళ్ళి ఇంకా రాలేదు గావాల... అడ్డడో... తవ్వెడో ఇస్తామని ఆ సూరీడప్పని పిలిచినా బాగున్ను. కాని సాయమ్మ ఒప్పుకుంతాదో.... లేదో... ఇన్నోటూ ఒక్కర్తీ సెయ్యలేదు... సేస్తే ఇవ్వదు... తవ్వడూ... తవ్వడూ లెక్కన మిగలేసినా తూమడూ... దామడూ మనకే దక్కుతాయంతాది కదా...'' తనలో తనే అనుకున్నాడు ఎరకడు.

మళ్ళీ పెంటడు వచ్చి చేటలో ధాన్యం పోసి చెరగటానికి ప్రయత్నిస్తుంటే ధాన్యమన్నీ తుళ్ళిపోతున్నాయి. సచ్చిగా ఉడికిన ధాన్యం ఎరుపు గోధుమ రంగు నుండి ఎండకు ఎండి - బూడిద రంగులోకి మారడం వాడి దృష్టిలో పడింది. నల్లగా మారి చెమట పట్టేస్తూ వున్నాడు పెంటడు.

''నీడ పట్టునుండురా పెంటా, ఎండలొద్దంటే ఇనక కాకిలాగయిపోతన్నావు'' సాయమ్మ మాటకే కాదు, ఎరకడి కేకకూ వాడికి లచ్చిం లేదు.

''కాకిలా...''

''కాకిలాగేటి... మసిబొగ్గులాగయిపోతున్నారు ఇల్లంతా... ఎండ్లోట పని... ఫ్చ్..'' అనుకుంటూ సాయమ్మ వేపు చూసాడు ఎరకడు .

సాయమ్మ స్థానంలో సత్తెమ్మ కనిపించింది ఎరకడికి.

ఎరకడు కళ్ళు పులుముకున్నాడు.

కళ్ళు కరకరలాడాయి. కన్నీళ్ళు బొట్లు బొట్లుగా రాలాయి. కళ్ళు కరాళ్‌మంటుంటే గుండె వెనక దాగిన కఠోర నిజం కళ్ళ ముందు మళ్లీ మెదిలింది.

వ్యాపారం చేయమన్న మేనమామ కూతురే సత్తెమ్మ!

సత్తెమ్మ ఎరకడి మొదటి పెళ్ళాం. సత్తెమ్మ తెల్లగా వజ్రంలా మెరసిపోయేది. అది చూసి ఎరకడు మురిసిపోయాడు.

సత్తెమ్మ ఒక్కర్తీ ఇద్దరు మగోళ్ళ పని చేసేసేది. అలాంటి నక్కా ముక్కాలాంటి మనిషి నుజ్జు-నజ్జయి ఏలబడిపోనాదాఖరికి, సత్తెమ్మ మొదట్లో మామూలుగా దగ్గేది. ధాన్యం పనివల్ల గదా.. అనుకున్నారు. ఈపనికి ఆ దగ్గు మరీ ఎక్కువయింది. డాక్టర్ని చూపిస్తే అదేమి.. క్షయరోగమన్నారు. ఇప్పుడు మందులున్నాయి పరవాలేదు-అన్నారు. మందులు రాసిచ్చేరు. టానిక్‌లు రాసిచ్చేరు. రోజూ వాడమని చెప్పారు. 'బతకడమే ఇరుకయిపోయి - కటీమిటీ అవుతుంతే... ఇందలొకటా' అని ఒక నెలకి తెచ్చిన మందులు ఆరు మాసాల దాకా అవలేదు వున్నా యనీది. ఎంతో బలవంతం చేస్తే ఆపూటకే. ఎన్ని పూటలని ఎరకడు చెపుతాడు? అయినప్పటికీ ఎరకటి మాట కానిచ్చేది కాదు.'ఇంటి కష్టమంతా సగం నాకిందే పెట్టేస్తే మనకి పుట్టిన నలుగురు పిల్లలూ రేపు ఏమవుతారా' నీది. దగ్గు తెరలు తెరలుగా వచ్చి బిల్లలు బిల్లలుగా రక్తం పడినప్పటికీ కూడా ఎవరికీ చెప్పలేదు. అలా అని పని వద్దన్నా మానీది కాదు... దాంతో రోగం ఎక్కువయింది. సత్తెమ్మ దక్కకుండా పోయింది.

'భగవంతుడు తీసుకెళ్ళి పోయాడు' అని ఎరకడు సరిపెట్టుకోలేక పోయాడు. తన దౌర్భాగ్యమయిన జీవితమే ఆమెను చుట్టుకొని కాటేసిందని నమ్ముతాడు.

సత్తెమ్మ పోయాక ఆ వ్యాపారం మానేద్దామనుకున్నాడు. అయినోళ్ళు... తెలిసిన వాళ్ళూ అందరూ ఎరకిడికి నచ్చజెప్పారు. ' ఇల్లు కాలిపోయిందని ఊరే వదిలేస్తామా?' అన్నారు. 'భగవంతుడి రాత' అన్నారు. తలరాతన్నారు. ఏది ఏమన్నా సరే, నలుగురు పిల్లలతో నట్టేట్లో నావలాగ వుండి పోయిన ఎరకడికి తోడు తప్పనిసరిగా వుండాలన్నారు. సాయమ్మ అప్పుడు ఎరకడితో కాపురానికొచ్చింది. సాయమ్మ ఇద్దరు పిల్లలని కనింది. ఒక కొడుకూ, ఒక కూతురు. మొత్తం ఎరకడికి ఆరుగురు సంతానం అయ్యారు. 'పంచ పాండవుల తోడ ఒక్క చెల్లెలు' మురిసిపోతుంది సాయమ్మ. సర్దుకు రాగలిగే సాయమ్మ తోడు దొరికినందుకు ఎరకడూ మనిషి కాగలిగేడు.

తరువాత ఎరకడే పిల్లల ఆపరేషను చేయించుకున్నాడు. కుట్లు ఆరక ముందే కుడితిలో పడ్డ ఎలకలా పనులూ పాటలూ చెయ్యక తప్పిందికాదు.. అందుకే ఎప్పుడూ ఆరోగ్యంగా వుండలేదు. పైగా కుట్లు ఆరక పుండయిపోయింది. సగం వాడిన మందులతో తగ్గిందనుకున్నా 'పులపచ్చిగా వుంద'ని తనలో తనే స్తిమిత పడతాడు.

ఎరకడి పెద్దకొడుక్కి పద్దెనిమిదేళ్ళు రాకుండానే లారీకి క్లీనరయ్యాడు. రెండో కొడుకు అదే లారీ మీద వెళ్ళి రాళ్ళు కొడతాడు. వాడికి పదిహేనేళ్ళు. మూడో వాడు

తండ్రి పనిలోకెళ్ళమన్నాడని చదవించలేదని అలిగి ఇల్లు వదిలి పోయాడు. నాలుగోవాడే అసిరిగాడు. మూడోవాడు దక్కకుండా పోయాడని అసిరిగాడ్ని చదువుకోమంటే రెండు మైళ్ళు నడిచి, ఏరుదాటి పొన్నూరు బడికి వెళ్తాననే వెళ్లేవాడు. ఏకోపాధ్యాయ పాఠశాలది. ఉంటుందనీ, వూడుతుందని వూగిసలాడే బడికి మేష్టారు వస్తే బడి వుండేది. రాకపోతే సెలవు. ఏరు పొంగితే సెలవు. వర్షమొస్తే సెలవు. ఆవూరిపెళ్ళిళ్ళకి, సావులకి, సవర్తలకీ భోజనాలు బడిలోనే కాబట్టి మేళం వాగితే సెలవు. దాంతో తిరగడం తప్పించి అక్షరాలు వొరిగేవి కావు. చదువు తప్పి తోటి పిల్లలతో గూడి తరగడం.. కలవారి లాగే తనూ వుండాలనుకోవడం అసిరిగాడికి అలవాటయింది. దాంతో తిరుగుళ్ళు... సినిమాలవీ చూస్తాడు.. ఇంటి పట్టు నుండడు. అసిరిగాడి నుండి ఎరకడి బాధ. 'చదువు గిదివూ మాని ఇంట్లో సాయపడు... పని సేస్కో' తేల్చేసాడు ఎరకడు.

పెంటడు వాడి చెల్లెలూ చిన్నోళ్లింకా.

సాయమ్మ నీళ్ళు తాగుతుంటే ఎరకడు జల్లెడ అందుకున్నాడు. వద్దని వారించిన సాయమ్మ మాట నెగ్గలేదు.

''నువ్ కంతు సేపు కూకో...'' అంటూ ఎరకడే జల్లించాడు.

సాయమ్మ అడ్డగ పట్టింది.

పొద్దుగూకే వేళకి ధాన్యం బాగు చేయడం పూర్తయింది.

ఇద్దరూ కలిసి పెంటడ్ని ఇంటిదగ్గర కాపలాపెట్టి, ఉయ్యాలలోని పిల్లని దించి ఆడించమని ఒప్పజెప్పి, మిల్లుకు ధాన్యం మోయడం మొదలు పెట్టారు. వీధిలో మూటలునెత్తిన ఎత్తడానికి, మిల్లు దగ్గర దించడానికి చాలా కష్టమై పోయింది. ఒక్కరోజైతే ఎవరైనా సాయం చేస్తారు. రోజూ అంటె ఎవరు మాత్రం సాయపడతారు. పోనీ మూట నెమ్మదిగా దించుదామన్నా - మూట జారి గోనె చిరిగిపోతే అయిదు రూపాయల నష్టం... ఇన్ని దిగుళ్ళూ- భయాల్తో ఎరకడు నెత్తిన మూట ఎత్తి ఆమె మరో చెయ్యి సాయంతో భుజంమీద తనోమూట పెట్టుకున్నాడు.

' ఒక్కప్పుడు బస్తాడు ధాన్యమేటి..? బస్తాడు బియ్యమే ఒక్కడూ భుజాన విసురుకొని పోయేవాడు..'' తలపుకు వచ్చిన సాయమ్మ నడుస్తూనే నిట్టూర్చింది. ఇంతలో ఆమె తలమీద సువ్వుగుడ్డ జారిపోయి మెడ నరాలు జివ్వుమన్నాయి. తాడవ మండుతోంది. అయినా ప్రాణం పోరాడుతోంది. మధ్యలో దించితే ఎత్తేవారుండరు. అందుకే మిల్లు వరకూ భారంగా అడుగులేసి మూట పడేసింది. గోని సంచి చిరిగిపోవడంతో ఇందాకటి కంటె బాధ ఎక్కువయింది. శరీరంలో బాధకంటె మనసులో బాధ తట్టుకోలేనిది.

''వీధిలో దీపాలు వెలిగాయిరా ఎరకా, నువ్వింకా మోస్తనే వుంటె మిల్లు మూసేసి పోతాను మీ..'' మిల్లు యజమాని తవిట్నాయుడు అన్నాడు దర్పంగా.

'... అదేటి బాబూ. ఒక్క గడియాగితే, రెండుదపాలు మీమిద్దరం తిరిగితే

సరి... ఓపిక పట్టండి...'' ఉత్తి పుణ్యానికి ఆడినట్టు ఎరకడు బ్రతిమాలేడు.

'' ఎరకా, బండి పోతులు కొనరాదట్రా... మోత తప్పుద్ది..'' నాయుడి మాట.

'' ఏళాకోళాలేనికి నాయుడు బావూ .. మామే పశువులమయితే. . మాకింద మళ్ళీ పశువులా...'' సాయమ్మ బాధగా అంది.

తవిట్నాయుడికి అందులో ఏ హాస్యం గోచరించిందో కాని పడి పడి నవ్వాడు.

ఇద్దరూ తలలు దించుకు నిలబడ్డారు.

''...నాకు బాధలేదు... పనోడూ, మిల్లు డ్రైవరూ ఎళ్లిపోతారు. .'' మళ్ళీ అన్నాడు తవిట్నాయుడు.

''తూవడో.. దావడో ఆడినప్పుడల్లా ఇచ్చుకుంతన్నాం.. మళ్ళా పండగంతే, పబ్బమంతే కట్నాలు ఇచ్చుకుంటున్నాం రైతుల్నాగ .. దయతలపాలగాని . బులిపింపు ఏనికి?... నాకో పైసా మిగుల్తాది... పిల్లలతో గెంజి తాగుదామని ఈ పుర్రాకులల్లా పడతన్నాను గాని మరి ఏనికి?... మీకు తెలద్ది కాదు..'' ఎరకడు ఆర్తిగా అన్నాడు.

'' ఎళ్ళండి... ఎళ్ళి బేగి రండి.... కరెంటు పోగలదు...'' నాయుడి మాటతో ఇద్దరూ మళ్ళీ పరుగు తీసారు.

సాయమ్మతో పాటు ఎరకడికీ అలికిగానే వుంది. ఆకలిగానే వుంది, అలవాటుపడ్డ ప్రాణాలయినా 'జాపోసి' పోతున్నాయి.

''నాయుడు గుళాము మాటల్లెట్టేసి లేటు సేసీనాడు. మరీ సీకటి బడిపోయింది. ఇంటికాడ సిన్న పిల్లలిద్దరూ... ఏటో...'' బితుకుగా అంది సాయమ్మ.

''... కోడి పిల్లలు మూసినారో లేదో..?'' ఎరకడు అనుమానంగా అన్నాడు.

'' ఎవలు మూస్తారు...?'' ప్రశ్నించింది, సాయమ్మ.

మాటలాడుకోవడం వల్ల పరుగు నెమ్మదించిందని తలుచుకొని మాట్లాడాలని వున్నాసరే పెదాలకు సంకెళ్లు వేసుకున్నారు.

కాని గుండెలో గూడు కట్టుకుంటున్న భయం ఆ సంకెళ్ళని తెంచేసింది. ''మిల్లు కాడ కాపలా ఎవలూ లేరు... మనుసులూ పోనీ ఎవులూ లేరు..'' సాయమ్మ మాటనే ఎరకడి కళ్ళూ తెలుపుతున్నాయి. మిల్లోళ్లు ఎక్కడే ధాన్యం తీసేస్తారోనని ఇద్దరి భయమూను. ఒకసారిలాగే పది తూములు పదిపుట్లుకి బొక్కొచ్చాయి. అడిగితే ''కొలవడమే బొక్కయుండాల, మీరు కొన్నప్పుడు... అనుమానమెవల మీద..'' మిల్లు యజమాని మాటతో నోళ్ళు మూసుకొన్నారు.

ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

పెంటడు కోళ్ళు పట్టబోయి పడిపోయాడట... వాడి ముడుకులూ... ముక్కూ అన్ని చెక్కుకుపోయాయి. బాధతో ఏడుపు బిగబట్టి పిల్లను ఆడిస్తూ అమ్మా నాన్నలను చూడడంతోనే ఏడ్చేసాడు.

సాయమ్మ కొడుకుని ఓదార్చింది. పిల్ల పాల కోసం అడ్డాల్లోకొచ్చి తడుముతుంటే

రొమ్మిమ్మవ్వబోయి, నాయుడి మాట గుర్తొచ్చి - ఎరకడి కేకకు లేచి- పిల్ల ఏడుపు వినిపించుకోకుండా- గబ గబా నెత్తిన బస్తా ఎత్తుకు బయలు దేరింది.

ఇంట్లో దీపం లేక వల్లకాడులా చీకటిగా వుంటే- పెంటడికి ఇంట్లోకి వెళ్ళడానికి భయమేసింది. చెల్లిని తీసుకొని వీధిలాంతర్ల దగ్గరే ఆడుతూ కూర్చున్నాడు.

ఆలోచనలతో వున్న సాయమ్మ' ఎరకడు కరెంటుపోవడంతో కాళ్ళు ఒక్క క్షణం ఆగిపోయాయి. అంతలోనే తేరుకొని చీకట్లోనే అడుగులు వేస్తున్నారు.

''అమ్మా...'' అరుస్తూ సాయమ్మ మూట ఎత్తేసింది. కాలికి ఏదో గుచ్చుకొని చురుక్కునమడంతో వొంగొని కాలిని తడుముకుంది. అంతలోనే కూర్చుండి పోయి కాలిని తడుముకుంది. మేకు దిగబడినట్లుంది.

'' ఓరయ్య...'' బాధను బిగబట్టుకొని సాయమ్మ పిలవబోయింది.

కాని ఎరకడు పెళ్ళాన్ని గమనించకుండా మిల్లు చేరుకొని మూటపడేసి వెనుదిరిగి చూసాడు. 'మెల్లగ వస్తంది గావాల...' అనుకుంటూ అక్కడ కూర్చుండిపోయి తువ్వాలుతో ముఖం తుడుచుకున్నాడు. గొంతు పిడచగట్టుకు పోయింది. తాగడానికి నీళ్ళు - అడగాలనుకున్నాడు నాయుడిని. కాని నాయుడి భార్య గుర్తొచ్చి ఆగిపోయాడు. అవిడయితే.. '' ఇయ్యాలప్పుడు ఇవ్వకూడద''ంటుంది. 'లక్షివారం' అంటుంది. ''గలాసలు, చెంబులు మీరెత్తిపెట్టుకొని దాగినా.. అవన్నీ ఇప్పుడు ఎవుడు తోమగలరు... నాకు శక్తీ లేదు...'' అంటుంది.

అందుకే నీళ్లడగడం వృధా అనుకున్నాడు.

దానికి తోడు కరెంటూ లేదు.

'' ఏటిదింకా రాలేదు...? సాయమ్మా...'' అనుకుంటూ మళ్ళీ మిల్లులోంచి వెనక్కి వచ్చాడు. దారిలో సాయమ్మ అవుపించింది. సాయమ్మను ఆ పరిస్థితుల్లో చూడడంతోనే ఎరకడు బెంబేలెత్తిపోయాడు.

'' ఏటయిందే...'' అంటూనే కాలివంక చూసాడు. దబ్బలం లాంటి మేకు పాదంలెల్లి చొరపడి పైకే వచ్చేసి వుంది. చీకట్లో తడుముతూ తెలుసుకున్నాడు. చేతులకు తడిగా తగిలింది. రక్తం...

అగ్గిపుల్ల వెలుగులో చూసాడు. అంతలోనే అగ్గిపుల్ల ఆరిపోయింది.

చీకటి మళ్ళీ గూడుకట్టుకుంటోంది.

అప్పుడే కరెంటు రావడంతో... అవతలి వీధి చివరి దీపం వెలుగు - వీళ్లుండే దారిపై సన్నగా పడుతోంది.

ఇంతలో అటుగా పోతున్న బారికప్పడు ఎరకడ్ని, సాయమ్మను చూస్తూ దగ్గరకొచ్చాడు. '' ఏటి సేత్తామురా బారికి...'' ఎరకడు అడిగేడు.

'' ఆస్పెట్లికి ఎత్తే వందలుండాల... అయినా ఇయ్యాలపుడెల్లినా పారుగూర్లో డాకటేరు వుంతాడేటి. మూసేసి ఆయినూరెల్లిపోడూ...''.

''అయితేటంతావురా..'' మళ్ళీ అడిగాడు ఎరకడు. ఎరకడికి కాళ్ళూ చేతులు ఆడడం లేదు. బిక్కు బిక్కుగా చూసాడు. ''పరవాలేదు..'' అంటూ అప్పుడు ఎరకడు వీపుమీది తువ్వాలు చించి పక్కన పెట్టాడు. తర్వాత 'కళ్ళు మూసుకోయమ్మ...' అంటూ మేకు చివరను తన చేతితో పట్టుకొని, ' ఎరకా కాలు కదల్నివ్వకూ ..'' అంటూ చటుక్కున లాగేసాడు.

''అమ్మా... ఆ..'' అరుపుతో ఏడుపందుకుంది. సాయమ్మ. రక్తం చిత్తున, తుళ్ళుతుంటే సుమ్మగుడ్డ తీసి దానికి నిప్పంటించి... కాలుతున్న గుడ్డ పొగ ముద్దని గాయం మీద అంటించేడు అప్పుడు. అలా అంటిస్తున్న ప్రతిసారి ... ''అమ్మా... బాబో...'' అంటూనే వుంది సాయమ్మ. రక్తం చిమ్మటం - పొగ పట్టడం వల్ల కాస్తంత తగ్గింది. దానిమీద చించిన తువ్వాలు గుడ్డ కట్టాడు. ''రేపు ఆకొక రవ్వ తెచ్చిస్తాను కట్టండి... పెయ్యి కనపడ్డం లేదు ఎతకతన్నాను. మరి వస్తాను. బయం లేదమ్మి...'' అంటూ వెళ్ళిపోయాడు బారికప్పిగాడు.

''నీవింటికెళ్ళు... నేనే ఏదో పని సూసుకొని వస్తాను..'' బలవంతం మీద ఎరకడు పెళ్లాన్ని ఇంటికి పంపించేశాడు. అక్కడ నుండి గబగబా మిల్లుకి పరిగెత్తాడు.. ఎరకడిని చూడ్డంతోనే ''...కరెంటు పోయినా, వచ్చిన తర్వాతయినా వెంటనే నీవొస్తే మిల్లాడిద్దామనుకున్నాను. నువ్వేమో రాలే... రేపు పెందలే రా, అందరికన్నా ముందు నీవే ఆడేస్తాం ఎళ్లు...'' అంటూ బయటకు నడుస్తున్న నాయుడు వెంట నడిచాడు ఎరకడు. చెప్పాలనుకున్నది వెంటనే చెప్పలేకపోయాడు. చెప్పేసరికి మిల్లుకి తాళం పడింది. అప్పటికే మిల్లు పనోళ్ళూ వెళ్ళిపోయారు. ఎరకడు అసహనంగా నిస్తేజంగా ఇంటివేపు నడిచాడు.

ఇంటికి రావడంతోనే పెళ్ళాం ఏటయ్యిందని అడిగింది. ''రేపు పెందేళే ఆడుతారట...'' అంటూ విషయం చెప్పాడు.

ఎరకమ్మ దీపం ముట్టించి పెట్టింది. చంటిపాప ఏడుస్తోంది. పెంటడికి ఏమయిందో మట్టినేల మీదే గోనయినా వేసుకోకుండా పడుకుండి పోయాడు.

పొయ్యి ముట్టించడంలో, వంటలో సాయమ్మకు సాయపడ్డాడు ఎరకడు. వంటయ్యేసరికి చాలా వేళయింది. అప్పటికే పొద్దంతా చేసిన పనికి వళ్ళు సురుసుర లాడుతుంటే చల్లని నీళ్ళే స్నానాలు చేశారు. ఎంత జాగ్రత్తగా పోసుకున్నా సాయమ్మ కాలు తడిచిపోయింది. ఎరకడు చెప్పిన జాగ్రత్తలు ఎగిరిపోయాయి.

తరువాత అందరు పిల్లలూ వచ్చాక, పెంటడ్ని లేపింది. అందరికీ వడ్డించితే తినేసి అరుగుమీద పడుకోడానికి వెళ్లారు. పెంటడు మాత్రం తినలేదు. తినిపించమన్న వాడి పేచీ నెరవేర్చక తప్పింది కాదు.

అందరి భోజనాలయిపోయినా అసిరిగాడు రాలేదు. సాయమ్మ ఎదురు చూసింది. ఎరకడి కేకతో అందరితో పాటు తనూ పడుకుంది.

సాయమ్మ అంత అలసిన శరీరంతోనూ నిద్రలోకి జోగిపోకుండా ' ఈ కాల్నుండి రేపట్నుండి పనులెలాగవుతాయో...? మిల్లాడించి తీసుకు వచ్చాక తవుడు సెరగాల, నూకలు తియ్యాల. సిట్రు తవుడు, మెత్తని తవుడూ చెరిగాకనే అమ్మాల... మిల్లోడికి మాత్రం అమ్మకూడదు. వాడు గోనికి అంకేంమడతేస్తాడు.. ' ఎన్నెన్నో ఆలోచిస్తూంది.

ఎరకడు కూడా అదే పరిస్థితిలో వున్నాడు ''...రేపు ఏగరం లెగిసి మిల్లుకు ఎల్లాల .. ఈలుంతె మిల్లు పనోల్ని, డ్రైవర్ని లేపుకు రావాల.. లేదంతే మిగతా జనం '' ఎక్కువ కదా, ఆకర్న ఆడుదురు ముందల మావాడే అంతే.. మావాడే... అని గోలసేత్తారు. నాయుడికి కోపం వత్తాది. రేపు రమ్మంటాడు.. అమ్మో...'' ఎరకడికి భయమేసింది.

''ధాన్యం తీసీరు కదా. .'' ఇద్దరి వెన్నులోనూ భయం. ఆవలించుకొస్తున్న ఆలోచనల్ని కౌగిలించుకు పడుకున్నారేతప్ప... ఒకర్నొకరు కౌగిలించుకోలేదు. ముద్దులు పెట్టుకోలేదు... ఊసులాడుకోలేదు... బాసలు చేసుకోలేదు.. మొగుడూ పెళ్లాలమన్న గుర్తూ రాలేదు.

సూరీడుకి తెలివే వచ్చిందో.. పాప పుణ్యాలకు సాక్షితానే - అని గుర్తే వచ్చిందో తూరుపు కొండల మాటున తొంగి చూడక ముందే- ఎరకడు తెలతెల వారక ముందే మిల్లుకి, అక్కడ నుండి మిల్లు పనోళ్లు, డ్రైవరింటికి వెళ్ళి లేపాడు.

''మిల్లు గల ఓనరు కంతే.. నీవే నాయుడివై పోతున్నావే.. మా పీక మీదికి పదొస్తాను...నీవు తొంగోవు... ఎవల్నీ తొంగోనివ్వవు..'' విసుకున్నాడు మిల్లు డ్రైవరు.

ఎరకడు బ్రతిమలాడుకున్నాడు.

అప్పటికి తెల్లవారడంతో డ్రైవరు లేచి ఎరకడి వెంట నడిచి నాయుడు గారింటికి వెళ్ళి తాళాలు తీసుకొని మిల్లుకు చేరుకున్నారు. '' ఇంత పెందళే ఇన్నోటు ఆడాలంతే... సెకసెక పని సెయ్యాలంతే టియ్య తెప్పించు'' డ్రైవర్ మాటతో ఎరకడే వెళ్ళి టీ తెచ్చిమరీ ఇచ్చాడు. తను తాగాలనుకున్నా తాగలేదు. మిల్లాడించడానికి డబ్బులు చూసుకొన్నాడు. లెక్క పెట్టుకొని ఏదో అంచనాలు వేసుకున్నాడు. ఇంతలో పని గుంటలతో పాటు నాయుడూ వచ్చాడు.

మిల్లుకి మొక్కినాక తిరగడం ప్రారంభించింది. ధాన్యం లెక్కలు గట్టి గల్లాలో వంపుతుంటే డబ్బాకో 'రాయి' వేసి రాళ్ళని లెక్కపెట్టి -లెక్కలు గట్టి 'యాభై నాల్రూపాయలు...' అన్నాడు నాయుడు..

''అదేటి బావూ.. అంతెక్కువ...?'' నోరు వెళ్ళబెట్టాడు ఎరకడు.

''ఏటంతే.. నేనేటి సేప్పేదిరా... రేట్లు పెరిగినాయి. దాన్నం, బియ్యం రేటు పెరగడం వగ్గీ, కరెంటు సేర్జీలు పెరిగినాయి... కరింటు బిల్లు కడతోటికి కళ్ళుతిరగతన్నాయి. ఇంతదీనిమీద నాకు... డీజలు... వుడ్డి ఆయిలూ అన్నీ పెరిగినాయి... ఎవులికయినా అడుగు.. లోకం తోటి గాని నీవొక్కడి తోటి కాదురా...'' సుదీర్ఘంగా చెప్పాడు నాయుడు.

ఎరకడు కిక్కురుమనలేక పోయాడు. తన దగ్గరున్న ముప్పయి రూపాయలు నాయుడి చేతిలో పెట్టి, మిగిలిన ఇరవై నాలుక్కీ తవుడు తీసుకోమన్నాడు.

''తవుడు డబ్బా నాలుగు రూపాయలు... నాకారు డబ్బాల తవుడొస్తాదిరొరే..'' అన్న నాయుడి మాట విని తుళుక్కు పడ్డాడు ఎరకడు.

''అదేటి బావూ... అన్నీ పెరిగి, తవుడు రేట్లు పెరక్కపోవడం నేయమేనా...'' ఎరకడు అడిగాడు.

''వొరొరే.. పిచ్చి మొదద్దా.. తవుడు నువ్వా.. నేను తినముర్రా, పశువులు తింతాయి అందుకే ఆటి రేటు పెరగలేదు..'' నవ్వుతూ అన్నాడు నాయుడు.

'మరి కరెంటు తిని, డీజిలూ... ఆయిలూ తాగుతామేటి? మరవెలాగేటి పెరిగాయి?'' అని ఎరకడు అడగబోయి ఆగిపోయాడు. అడిగితే మళ్ళీ తననెక్కడ తెలివితక్కువ్వాడి కింద జమ కడతాడోనని వూరికుండి పోయాడు.

అప్పుడే సాయమ్మ కుంటు కుంటూ వచ్చింది.

''నీవేనికే వచ్చేనావు..'' ఎరకడు అడిగాడు.

''బియ్యం గట్రా మోసినప్పుడు కాపలా వుండక పోతే... బుర్రలు పడిపోను నలుగురూ నాలుగు పిడికిల్లు తీస్తే సేన..'' ఆ ఆలోచనా భయాన్ని వెళ్ళగక్కడానికి నాయుడు ముందుండడంతో ఎరకడికి సమాధాన మీయలేకపోయింది సాయమ్మ.

ఎరకడు పెళ్ళాన్ని ఏదో అనబోయి దృష్టి మిల్లు మిషనువేపు పడి ఏమీ అనలేదు. మిల్లు 'ఝూ...ఘీ'' కలయికతో శబ్దం చేస్తోంది. మధ్యలో బెల్టు చట్రం నుండి జారిపోయి మిల్లు ఆగిపోయింది. ఆగిపోవడంతో ధాన్యం ఎక్కడ ఆగిపోతాయోనని సాయమ్మ కలవరపడింది.

స్విచ్ ఆపి, బెల్టు మళ్లీ ఎక్కించి - చట్రం తిప్పి

-స్విచ్ వేయడంతో బెల్టు కనిపించకుండా తిరిగింది. ధాన్యం బియ్యం కలిసి పడుతుంటే చేటలో తీసి మళ్ళీ గల్లాలో పోసాడు డ్రైవరు. దాని మధ్యలో వున్న బల్లల్ని సుత్తితో కొట్టాడు. శబ్దం మారింది. బియ్యమిప్పుడు పలుచగా కాకుండా మామూలుగా పడుతున్నాయి.

ఎరకడు చీపురు పట్టుకొని మిషను చుట్టూ పడిన గింజల్ని ఊడ్చాడు. దూరంగా తుళ్ళిన గింజల్ని సాయమ్మ ఒక్కొక్కటి ఏరింది. అంతలోనే తవుడు చిట్టుగదికి వెళ్ళి చూసొచ్చారు. మెత్తటి తవుడు వేరేగా పడుతుంటే గోనెతో పట్టారు. కాని మిల్లుకి బోలెడన్ని బొక్కలున్నాయి. తవుడు వెళ్లే గొట్టానికి కన్నం వుండడం కాక, ఇంకో గదికి వెళ్లకుండా చెక్కబల్ల అడ్డుపెట్టడంతో ఆ ఖాళీల గుండా బోలెడంత తవుడు వస్తూ పోగవుతోంది. పైగా చిట్టుగది కిటికీల నుండి తవుడు వచ్చి నేల మీద ఇసుక పొరలా పేరుకు పోయింది. దాన్ని నాయుడు ముట్టనివ్వడు. సాయమ్మకి ప్రాణమొప్పక ఆ తవుడ్ని తీయబోయింది.

''నీకేటి కొత్తే.. ఈరోజూ...? పాలపెయ్యి తింతాది... వున్నలేయే.. మరీ ఏనికా

పీసుతనం?'' నాయుడు ఎగిరి పడ్డాడు.

ఎరకడికీ అడగాలనే వుంది. కాని అడిగితే అసలుకే ఎసరెట్టేస్తాడని బియ్యమే తీసేస్తాడని భయం వేసి తన పీక తనే నొక్కుకున్నాడు.

బియ్యం కూడా మిషను వెనకాల పడుతున్నాయి. అవి తిరిగి రావు. 'పైగా లోపల అరుందట. దానిలో బియ్యం తెలీకుండా ఇడికుంటాడట' అందరనుకున్న మాటే సాయమ్మ మెదడూ తొలిచేయడంతో తట్టుకో లేక పోయింది. అంతే అడిగేసింది. ''... అన్నాయం... సేనా అన్నేయం.. ఎవుడికి తెలదని.. మిల్లుకున్న బొక్కలు.. '' సాయమ్మ సాగదీసింది.

''లోకంలోట నువ్వే మిల్లాడిస్తాన్నావేటి..? ఎందుకు మీకిష్టం లేపోతే మిల్లాపేస్తాను.. ఎళ్ళి ఏపక్కూర్ల ఆడించుకుంతారో ఆడించుకోండి. మరి నాదగ్గిరేల..?'' తీసుకుపొమ్మన్నా తీసుకుపోలేరని నాయుడు ధైర్యంతో అన్నాడు.

''వున్నార్లే ఆడించడంకి అగ్గి దిగుతుంతే, ఇంక పక్కూరా'' అని మనసులోనే అనుకొని ''ఆడోలు.. ఆడోలు నోటికి అడ్డేటి..? అవేవి పట్టించుకోకండి..'' సర్దాడు భార్యవేపు కోపంగా చూస్తూ.

నాయుడి ముఖం రుసురుసలాడుతూనే వుంది.

మిల్లు పనోళ్ళు తమ డొక్కులు, డ్రైవరి డొక్కు, మరో పెద్ద డొక్కు తెచ్చి ఎరకడి ముందు పెట్టారు. సాయమ్మ అరచేతులతో వేయబోయింది. డ్రైవరు అడ్డుకొని చేతికి పావుడొక్కిచ్చి ''మూడు కొలిసి అందల, రెండిందల ఒక్కొక్కటేసేసి, ఆ సివర్న నాదాంట్లో రెండు డొక్కులు పడియ్యి...'' అన్నాడు.

''కూలివ్వడం లేదా..' అని స్వగతంగా పైకే అనుకున్న సాయమ్మ నాయుడు చెప్పిన ప్రకారం వేయక తప్పింది కాదు. 'మిల్లెజవానింకా డొక్కొకటి ముస్టోడులాగ ముందరెట్టేస్తే..' తనలో తనే అనుకుంది. పంపకాలయినాక రావలసిన ఇరవై నాలుగు రూపాయలకి తవుడు కొలిసేయండి...'' నాయుడు కేకేసాడు.

ఎరకడు తవుడు కొలుస్తుంటే... ''అందల నూక లుంతాయి. ఇంటికి అట్టికెల్లి సెరిగినాక ఇద్దంలే... తూమడో.. అరడ్లో నూకలొస్తాయి.... జావసేసు కున్నా అవుతాది. రెండు పూటలు తాగొచ్చును...'' అడ్డుపడుతూ అంది సాయమ్మ.

ఎరకడు మరేమి మాట్లాడలేదు.

' ఇంటికెల్లి సెరిగి మెత్తనిదీ... సిట్రుదీ కలిపే పంపిస్తాంలే..' నాయుడితో అంది సాయమ్మ, 'అలాగేనమ్మ... నీమాటే కదా..'' గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు నాయుడు.

సాయమ్మ కాపలా వుంటే బియ్యం, తవుడు మూటలన్నీ సాయంత్రం దాకా మోసాడు ఎరకడు. మధ్యలో అరగంట ఆగిగెంజి మెతుకులు తాగి, భార్యకూ కేరీజుతో కొంత తిండి పట్టుకొస్తే మిల్లులోనే తింది సాయమ్మ. సాయంత్రానికి సరంజామా అంతా

ఇంటికి చేరినా నడుము నారయిపోయింది. ఆపరేషన్ కుట్లు దగ్గర దురదెక్కువయి పోయి పడిన దుమ్మూ్మధూళికి అది రేగుతోంది. సాయమ్మయితే అలబొద్దన్నం తిని, పెంటడు అంబలి కావాలని ఏడిస్తే పొరుగోళ్ళ కడిగి అంబలిచ్చి తను తవుడు చెరగడంతో పడింది. నూకలు అరడ్లకు పైనే బయటపడడంతో బాధని మర్చిపోయింది. కాని కాలిగాయానికున్న కట్టు జారిపోయి తవుడు కూరుకుపోయివున్నా పట్టించుకోలేదు.

ఎరకడు తవుడు మిల్లుకిచ్చి, మిగతాది ఏకాశి రైతుగోరికి ఇచ్చేసి వచ్చాడు.

దీపాలు ముట్టించే వేళ దాటేసరికి వంటా, స్నానం సాయమ్మ ముగించింది. ఎరకడు నీళ్ళు పోసుకొని వచ్చాడు. బియ్యం బస్తాలమీద పెంటడు పొర్లుతూనే వున్నాడు.

పనయ్యి ఇలా కూర్చుందామనుకుంటుండగా పోలయ్య అసిరిగాడ్ని ఈడ్చుకుంటూ తగువుకి వచ్చాడు.

'' మాయమ్మ తాన్నం సేస్తా కోకమార్చుకోడాకి గైనం నుయ్యి గట్టుమీద పెడితే పట్టుకుపోయాడు. అందలున్ని డబ్బులు పాతికా కర్చుసేస్సినాడు. పొరుగూరు సిలిమీసూస్సి, పులావులు మేస్తుంతే నాకు దొరికినాడు. కావలంతే సాచ్చీకం మనూరి గుంటల్ని అడగండి... పిల్లల్ని కాస్తే సరిపోదు... పెంచాల.. ఊరిమీద వదిలీకూడదు.. ఆడు దొంగపన్లు ఇప్పుడికి రెండు దపాలు సేసినాడు.. ఏటంతారు... మీరు సూత్తారా.. నన్ను సూడమంతారా...?'' పోలయ్య అంటూనే అసిరిగాడ్ని ముందుకు తోసాడు.

అసలే చికాకుగా వున్న ఎరకడికి పెనం మీద నీటి చుక్కేస్తే పేలిపోయినట్టు పిచ్చెక్కువయిపోయింది. కోపంతో వూగిపోతూ అసిరిగాడ్ని అందిన చోటల్లా తన్ని తన్ని కుళ్ళబొడిచేసాడు. అసిరిగాడు ఏడుస్తూ.. కాళ్లా వేళ్లా బడ్డా ఫలితం లేకపోయింది. ఎరకడిని ఎందరడ్డుకున్నా ఆగలేదు. ఆకోపంలో అడ్డుకున్న సాయమ్మ చెంపకూడా పగిలిపోయింది. పెంటడు ఏడుపందుకున్నాడు.

మూగిపోయిన జనాన్ని కేకలేస్తూ ఎవరో పంపించేశారు.

' ఆకలితో వుంటే తెలిసొస్తాదిరా...' అంటూ కొడుకుని కొట్టుగదిలో పడేసి, ''తీస్తే తన మీద ఒట్టే 'నని మరీ కంగించాడు. తరువాత్తేరుకొని 'పోలయ్యా...నీకి వ్వాల్సిన పాతికా రేపో ఎల్లుండో సేసి ఇస్తాను....'' అభ్యర్ధనగా ఎరకడు పలకడంతో పోలయ్య వెళ్ళిపోయాడు.

ఆ రోజు రాత్రి ఎవరికీ అన్నాలు సయించలేదు. అసిరిగాడికి అన్నమూ అందలేదు.

తెల్లవారింది.

ఎరకడు బియ్యం కొలిచాడు. లెక్కలు గట్టాడు. ''పుట్టీడు దాన్నంకి వుప్పుడు బియ్యమయ్యుండీ పందుం పడలేదు.. ఎనిమిది కుంచాల రొండడ్లు..'' సాలోచనగా అన్నాడు.

''పిట్టలూ... పశువులూ... మిల్లు పిశాచాలు తింతే ఇంకెక్కడ పుట్టుకొస్తాయి..'' సమాధాన మిచ్చింది సాయమ్మ.

పది పుట్ల ధాన్యం దగ్గర సచ్చీసెడీ నందుకు 'నూటా యాభై' రూపాయలు దాక మిగులు లెక్కకందింది. ఇంకా పొయ్యిలోని కర్రలూ... కంపా... లెక్క వేయలేదు. అంతలోని గుర్తొచ్చి చూసుకొంటే పాతిక తగ్గి నూట పాతిక అయింది.

కష్టం... వల్లూ ఇల్లూ గుల్లయిపోవడానికి విలువ వేసుకోలేదు.

''అసిరీ..'' అంటూ తలుపు తీసి సాయమ్మ చూసింది. అసిరిగాడు లేడు. కిటికీ దండీలూ లేవు.

సాయమ్మ పరుగున వచ్చి విషయం భర్తకు చెప్పింది.

''పోనీ, ఎటోపోనీ.. సచ్చినా తిండెట్టకు... దరిద్రం కొడుకు పుట్టలేదనుకుంతాం..'' అంటున్న ఎరకడి మాటలకు సమాధానమివ్వబోయింది సాయమ్మ. కాని పిల్ల ఏడుపుతో వీధిలోకి పరుగుతీసింది.

బియ్యం కోసం సంచులూ, తపేలాలతో వీధిలోవాళ్ళు వస్తున్నారు. అరువులు అడుగుతున్నారు. తాము ధాన్యం కొన్నప్పుడు ఇచ్చిన సమాధానమే వీళ్ళు బియ్యం తీసుకువెళుతున్నప్పుడు అంటున్నారు. అందుకే ఏమీ అనలేక ' ఈసారికి తీసికెళ్ళండి.. నాల్రోజుల్లో నేనవతల ఇవ్వాలి. మరి మీరు బేగి ఇచ్చీయండి' అని మాత్రమే అనగలిగాడు ఎరకడు.

అటు చూస్తే పెద్ద అప్పులు.. ఇటు చూస్తే అంతా చిన్న మొత్తాల్లో రావలసి వుంది. అదంతా కూడగట్టి, లెక్కకట్టి ఇయ్యాల.. అబ్బా... తల వేడెక్కిపోయింది ఎరకడికి.

ఇంట్లోని బియ్యమన్నీ వీధిలోకి వెళ్ళిపోయాయి. ఇంట్లో తిండికి కొనుక్కోవాల్సి వచ్చింది.

పది రోజులు గడిచాక అరువు ధాన్యం ఇచ్చిన వారు చెల్లించమని వచ్చారు. ఎరకడు డబ్బు ఇవ్వలేక పోయాడు. సర్ది చెప్పాలని చూసాడు. '' ఈ సారా ఏముఖమెట్టుకొని వస్తావో సూత్తాం'... అంటూ వెళ్లిపోయారంతా.

ఎరకడు అరువు డబ్బులు అడగడానికి ఇల్లిల్లూ తిరిగాడు. ఆతీసికెళ్ళిన వాళ్ళూ కాలాడితే కడుపాడిన వాళ్ళే.. అని మొదట్లో అనుకున్నా తరువాత తనమీద ఒత్తిడికి తట్టుకోలేక కటువుగానే అడిగాడు.

కొంత సొమ్ము వసూలయితే దాన్ని రేపివ్వచ్చులే అని పెట్టెలో పెట్టాడు. ఆరాత్రి ఆలోచనల మధ్య సత్తెమ్మ తన చిన్న కొడుకు అసిరిగాడ్ని ఎత్తుకొని కనిపించింది. '' 'ఈడ్ని గొప్పోడిని సెయ్యాల... కడుపు నిండా తిండెట్టాల'' ఆమె మాట వినిపించింది. ఎరకడి కళ్ళలో నీళ్ళూరాయి. 'సరయిన తిండెట్టలేకే కదా, ఆడ్ని పనిలోకి పంపాడు... ఆడు పనిలోకి ఎల్లనన్నాడనే కదా తిండెట్టలేదు. ఆ తిండెట్టలేదనే ఆడు కిందురుకున్నాడు గాని... ఆకలికి,.. అందర్నీ సూసి అవి కొనుక్కు తినాలనే ఆడలాంటిపనులు సేసినాడు. కోరిన తిండెడితే ఆడెందుకలాగయిపోతాడు?.. లేదు... నానే సెత్తివెూలినోడ్ని.. దరిద్రుడ్ని... పిల్లలను పెంచలేనోడ్ని...' ఎంత గానో ఏడ్చుకున్నాడు.. '' ఆసిరిగాడొస్తే

తిండెట్టాల... ఆడు - కోరినట్టు మంచి బట్టలు ఒక్కదపా అయినా తియ్యాల గదా. తీస్తాను. నాను కావలసి నవి పెడితే ఆడే సెప్పినమాట ఇంతాడు... కాని నానవన్ని ఇందరు పిల్లలుతో, సంసారంతో పెట్టగలనా?..'' ప్రశ్నలూ - సమాధానాలు, నిట్టూర్పులు - ఓదార్పుల నడుమ తెల్లవారింది.

అప్పులోళ్లకి అందాకయినా కొంత ఇవ్వవచ్చని పెట్టె తెరిచాడు ఎరకడు. పెట్టిన దానికి పది రూపాయలు తక్కువొచ్చాయి. పెళ్లాన్నడిగాడు. పిల్లల్ని అడిగాడు, తెలీదన్నారు. తరువాత ఏ రాత్రో అసిరిగాడే ఈ పని చేసాడని పిల్లల ద్వారా తెలిసింది. ఎరకడికి ఆ పరిస్థితుల్లో పది రూపాయలూ పదొందల్లా కనిపించింది. అసిరిగాడ్ని నరికి పోగులు పెట్టాలనిపించింది. రాత్రి ఆలోచనలేవీ అడ్డుపడలేదు.

అంతలోనే ఆకాశం పేలిపోయిన వార్త... కోరీ లారీలో రాత్రికి ఇంటికని తిరిగి వస్తున్న పెద్దపిల్ల లిద్దరూ లారీ తిరగబడిపోవడంతో దెబ్బలు తగిలి ఆస్పత్రిలో వున్నారంటే వెళ్ళి చూసొచ్చారు మొగుడూ పెళ్ళాలిద్దరూ.

లారీ వోళ్ళే డబ్బులు ఆలకింద ఖర్చు పెడుతున్నారన్న ఆనందం కంటే వారినుండి ఈనెల రావాల్సిన డబ్బులు రావని... పని లేక ఇవ్వరని తెలిసి ఆ ఆధారమూ తెగిపోయినట్టయింది

సాయమ్మ కాలు బోదకాలులా పొంగుతూనే వుంది.

నొప్పితో కాలు తోడేస్తోందన్న బాధ కంటే పెద్ద 'వ్యధ' కాలేదా కాలు సమస్య సాయమ్మకి. ''డాక్టర్లకి సూపిస్తే కాలెక్కడ తీసేమంటారోనని ఆస్పెట్లు' అంటే ఆమడ దూరమయిపోయేది. పైగా చేతిలో గవ్వల్లేక బలవంతపెట్టలేదు ఎరకడు.

కాలముతో పాటు రుతువు మారింది.

వర్షాకాలం...

రెండేళ్ళుగా ఇళ్ళు నేయించకపోవడంతో సొప్పనానిపోయి, కుళ్ళిపోయి దోనిగట్టి ఇంట్లో కారుతోంది. తపేలాలు, చెంబులు, గ్లాసులు కారినచోటల్లా పెడుతున్నారు. పెంటడు వాటితో ఇల్లు బురద చేస్తూ బాగా ఆడుకొంటున్నాడు.

చేతి పిల్లకి జలుబూ, జ్వరం చేసి 'గురకా.. గురకా' మంటోంది శ్వాస.

పెద్దవాళ్ళిద్దరికీ కాస్తంత గాయాలు మాసిపోయి పనిలోకి మళ్ళీ వెళ్ళడం ప్రారంభించారు.

అసిరిగాడు పూర్తిగా తండ్రి దృష్టిలో పడడం మానేసి కనిపించ కుండా తిరుగుతూ ఏ రాత్రివేళల్లోనో కుండల్లో చొరపడి రోజంతటి ఆకలిని దొంగచాటుగా తీర్చుకుంటున్నాడు.

సాయమ్మ ఇన్నాళ్ళు కాళ్ళే కదపలేక పోయేది. ఇప్పుడు మొత్తం శరీరమే కదపలేక పోతోంది. ఆ కాలు లోపల కుళ్ళిపోతున్నది కాక శరీరంలోని నరాలన్నింటినీ పీక్కు-తింటోంది. కుళ్ళుకుంపు కూడా రావడం మొదలయ్యింది.

---

పెంటడు వీధిలో పరిగెడుతూ జారిపడి, పరిగెడుతున్న పోతుల కింద పడిపోయి చెయ్యి విరగ కొట్టుకొన్నాడు. ఇంత చలాకీగా వున్నోడు ఏడుస్తూ మూల కూర్చోవడం తప్పితే మన్ను ముద్దయ్యాడు.

అన్నిటికీ మధ్య ఎరకడు నలిగిపోతున్నాడు. సగం సొమ్మే తీర్చినందుకు ఈసారి ధాన్యం ఇవ్వం పొమ్మన్నారు షావుకార్లు, ఏకాశిరైతులు. పైగా ఇప్పుడు ఊళ్ళ లోకి 'ఫుడ్ కార్పొరేషనోళ్లు, సొసైటీవోళ్లు' వచ్చి నగదు ధరావత్తు చెల్లించి మరీ పట్టుకు పోతుండడంతో ఎరకడి చెయ్యి ఇరుకులో పడింది. చెయ్యేకాదు బతుకే ఇరుకైపోయింది.

కష్టాలన్ని కలిసొచ్చినట్టు నిరుడు కొని పాతర వేసిన ధాన్యం - పాతర తీసి చూసేసరికి గడ్డికట్టలు, గోతాములతో పాటూ ధాన్యమూ కుళ్ళిపోయాయి. అది చూసి కళ్ళంట నెత్తురు పడింది ఎరకడికి. అయినా సత్తువ తెచ్చుకొని 'పోయినకాడకు పొల్లు, వున్న కాడికి గట్టి' అనుకొని ఆ ధాన్యం మరిద్దర్ని కూలికిపెట్టి బాగు చేయించి బస్తాలు కట్టి ఇంట్లో వేయించాడు.

నేల చెమ్మగిల్లడం వల్ల జబునికి... ముక్కిన ధాన్యం మరింత పాడయిపోతుంటె పారెయ్యలేక ఎండబెట్టిన ప్రతీసారి ఒక్కడూ కొంచెమేసి ధాన్యం ఎండబెట్టడం మొదలు పెట్టాడు. ఇప్పుడు ఒంటి చెయ్యి. సాయమ్మ మంచానికి అతుక్కుపోయి మంచి నీళ్ళ సాయమే కరువైంది. ఊర్లోవున్న బాగార్లు బలిసి వుంటే బాగున్నావా - అని వద్దురేమో... వేలాడబడిపోతున్న వాడి దగ్గరకు వస్తే తమ మీదే చేరగిలబడిపోతాడనేమో, వంగి చూసి తొంగోలడం లేదు.

ఎరకడు మూటకు మూటా ఆడించి తెస్తోంటే ఇంట్లో గండు గడుస్తోంది. మిగిలిన ఇద్దుం... నల్తుం వుంటె ఎవులయినా వస్తే ఇచ్చేయడం, పొయ్యిమీదికి, కిందకి చూడ్డం... నారయిపోయిన నాలుక మీద కూ(ర్రవ్వడం.. ఇంతే... దాంతో ఇంట్లో గింజలూ తగ్గిపోతూ వస్తున్నాయి. పైగా మట్టిగోడలకి, వర్షాలకి, పందికొక్కులు కన్నాలు పెట్టేసి బస్తాల్లో ధాన్యం... బియ్యం తిని బగురుబిల్లుల్లా బలిసిపోతున్నాయి.

ఎరకడి వ్యాపారం అర్ధాంతరంగా ఆగిపోయింది. ఏం చేస్తే ముందుకెళ్ళడమా - ఆలోచిస్తూ వున్నాడు. పెళ్లాం వేపు చూసాడు.. మెడలో దారప్పోగే.. చెవిలో రోల్డుగోల్డు రింగులు. ఎప్పుడు కొన్నవో అప్పటికే రంగు వెలిసిపోయున్నాయి. మొదట్లో సాయమ్మ సంసారానికొచ్చినప్పుడు వ్యాపారంలో చెయ్యి ఇరుకున పడినపుడు వున్న జువకాలు అమ్మేద్దామనుకుంటూనే అమ్మలేదు. అటు తర్వాత దాని అవసరం ఎన్నోసార్లు పడింది. అయినా అమ్మలేదు. తనకా పెట్టలేదు. అలానే అన్ని సమయాల్లోనూ కాపాడుకుంటూ వచ్చారు. ఒకసారి పొరిగింటి మిత్తనోరి కోడలు ఊరెల్తానని అడిగితే ఆ జువకాలు ఇచ్చారు. ఊరెళ్లిన పిల్ల వారమయినా ఇంటికి రాలేదు. మిత్తనోరంతా ఏటి రాలేదాని కబురు పంపితే బయలుదేరి మీ ఇంటికి వచ్చేసిందే - అని అట్నుంచి కబురొచ్చింది. అప్పుడు గాబరా పడ్డారు. వెతికించారు. చిన్నగెడ్డ పక్కనున్న బోడి నూతిలో ఆపిల్ల శవం కనిపించింది.

ఊరెళ్ళిన కోడలు పిల్లా, దాని మొగుడూ దెబ్బలాడుకున్నారట. దాని మొగుడు అందర్లోనూ గుండ్చేసి బాదేసినాడట. అది భరించలేక ఆ కోడలు పిల్ల నూతిలో దూకి చచ్చిపోయింది. చచ్చిపోయిన పిల్ల చచ్చింది కాక, తమనీ చంపింది. జువకాలతో దూకి చచ్చిపోయింది. పోలీసులొచ్చారు. పోస్టుమార్టం చేసారు... శవమొచ్చింది... ఎటొచ్చీ రెండు తులాల బంగారం జువకాలు మాత్రం తిరిగి రాలేదు. అడుగుదామనే సాయమ్మ, ఎరకడు అనుకున్నారు. 'కాని ''పోలీసులతో లంపాటకం.. మీకే కేసు సుట్టబెట్టేస్తారు'' అని ఇరుగూ పొరుగూ అనడంతో పల్లకయిపోయారు.

గతాన్ని నిట్టూర్పుతో పాతేసాడు ఎరకడు.

' ఏదో సెయ్యాలి... లేపోతే పిల్లా జెల్లా ఆకలితో సచ్చిపోతారు...' అని ఆలోచించి ఆలోచించి వున్న రెండు బస్తాల బియ్యమూ అమ్మేసాడు. బాగా ముక్కి పోయి అన్నం పచ్చగా వుండడంతో ధర కూడా రాలేదు. అయినా తప్పలేదు. వచ్చిన అయిదొందల రూపాయలూ ధాన్యం సెల్లుబాటయిపోయి దొరక్క పోగలవని ముందుగానే పెద్ద రైతుకి ఇచ్చేసాడు. లేదంటే సొసైటీ వోళ్లకే ఇచ్చేస్తానన్నాడా రైతు. తీరా డబ్బులు చేతినపడిన తరువాత ''... ఇదిగో వర్షాలు ఆగనీ... ఎండలొస్తే పాతర్లు తీసినా సుఖంగాని ఇప్పుడు తీసి ఏమి సుఖం.. నువ్వూ నేను మట్టితినాల...'' అని రెండు మాటల్తో ఎరకడి నోరు మూయించేశాడు. ఎరకడికి ఏం చేయాలో తోచలేదు.

ఆవారం గడిచేసరికి ఇంట్లో ఆరడ్ల బియ్యమే మిగిలాయి. ఈవాళ, రేపుతో ఆవయిపోతే ఏటితిని బతకడమో అర్థం కాలేదు ఎరకడికి, సాయమ్మ అదే విషయం మంచంమీద నుండి మూల్గుతోంది తనొంట్లో రక్తం లేకపోయినా పిల్లదానికి కడుపు నింపాలని జీవచ్ఛవంలా రొమ్ములందించింది. ఆ పిల్ల దవడలు పీకినా గొంతు తడవక పోవడంతో, వచ్చీరాని పళ్ళతో రొమ్ముని కొరికేసింది. పన్ను దిగబడి రక్తం చిమ్మింది. పిల్ల వీపు పేలిపోయి మంచం మీద నుంచి కింద పడింది. ఏడుస్తూ వుంటే పెంటడు కడుపుమీద వేసుకొని లొక్కోళ్ళలేక పోయాడు. చెల్లిని ముద్దుపెట్టుకొని, తన చెయ్యిని తల్లిని చూసుకుంటూ ఏడ్చేసాడు. సాయమ్మ కళ్ళూ నీళ్ళతో నిండాయి.

ఎరకడు పిచ్చెక్కినట్లుగా తిరుగుతూనే వున్నాడు. డబ్బిచ్చినాయన ఇంటి చుట్టూ ప్రదక్షణాలు చేస్తూ వున్నాడు. దానికి తోడు ఇంటిపనీ వంటపనీ చేస్తూనే వున్నాడు.

ఎరకడికి సాయమ్మతో మాట్లాడాలనిపించింది. '' సాయా ''.. పిలిచాడేకాని పలికిన సాయమ్మతో ఏమాటా అనలేదు. పెదవి తెరవనే లేదు. 'అసలే రోగంతో వుంది. దాని మనసేనికి కుళ్లబెట్టడము' అనుకున్నాడు. అక్కడ నుండి లేచిపోయి అరుగు మీద కూర్చొని ఆలోచనలో పడ్డాడు.

'' ఈ ఇల్లు కూలిపోతంది... ఈ ఇంటికి గోడలు పిల్లలే.. ఆలకే సెప్పాలి. పెద్దోలిద్దరికి సెపుతాను. జీతం డబ్బులు ముందు అడగమంతాను. ఈ నెల ఆల సంపాదనతో గడిస్తే ఈలోగ ఆయన దాన్నం ఇస్తాడు. మళ్ళీ నాను పనిసేసి

నిలబెట్టుకుంటాను. నా సాయను రచ్చించుకుంతాను...''

పెద్దపిల్లలిద్దరూ వచ్చారు.

''అయ్యల్లారా. .'' దగ్గరగా పిలిచాడు ఎరకడు.

'' ఏవిరయ్యా...'' అడిగారిద్దరూ.

''...మరేమో రేపటితోటి బియ్యం సరి.. పైగా మీయమ్మ సూస్తే ఇలాగ, మీ యజమానికి ఈనెల డబ్బులు ముందడగండ్రా... ఏటి...?'' అడిగాడు ఎరకడు.

కొడుకులిద్దరూ తల దించేసుకున్నారే కాని జవాబివ్వలేదు.

''... ఏటిరా.. మాట్లాడరేట్రా...'' ఎరకడు కుదిపేసాడు.

''...మరేమో... అన్నానేమూ డబ్బులు అందేసుకున్నాం... బట్టల్లేవని... నీవు తియ్యవని.. మేము బట్టలు తీసుకొని టైలేరు కిచ్చేసినాం... మరి బట్టల్లేవు... సింకి గుడ్డలేకదామానకున్నవి.... అందుకే...'' చిన్నోడు నేల చూపులు చూస్తూ చెప్పాడు.

'' ఇంటిలోన ఈతసాపే లేకపోతే మీకు పడుకోడానికి పట్టెమంచం కావాలి.. ఏమిరా? నాకు సెత్తిలేదు... గతిలేదు..! ఎళ్లండ్రా.. మీ బతుకులు మీరు బతకండ్రా... నా వంట్లో రక్తం లేదు..'' ఎరకడికి అంతా అయోమయంగా వుంది.

పెద్దోడు పెదవి విప్పబోయాడు.

''... ఎళ్ళండెహే... నాకేటి సెపొద్దు... బత్తెం తెచ్చినోడికే ఇంట్లో తిండి... ఆ... అంతే .. లేపోతే లేదు..'' కటువుగా అన్నాడు ఎరకడు. ఆ పిల్ల లిద్దరూ చీకట్లోపడి అంత వేళలోనూ వెళ్ళిపోతుంటే ఎరకడికి పిలాలనిపించలేదు.

మళ్ళీ ఆలోచనలు...

అయ్యని బిడ్డలకి తిండెట్టడం మానేసి, నాకెట్టమంటున్నానా తిండి...? మీ తిండి మీరు తినండని తోలేడమా ఇది... ఏటిది?...

ప్రశ్నకు సమాధానమూ దొరకలేదు.

కంటికి పిల్లలిద్దరూ కనిపించనూలేదు - పరుగున వీధి చివరిదాకా వెళ్ళాడు. నిరాశగా మళ్ళీ ఇంటికి తిరిగొచ్చాడు. కుండలో అన్నం చల్లబడివుంది. పిల్లకుక్కల్ని తరిమేసిన తల్లి కుక్కలా తనకుతనే కనిపించాడు.

సాయమ్మ కునుకు తీస్తోంది. పక్కనే పిల్ల కూడా. పెంటడు అరుగుమీదే తినకుండా పడుకుండిపోవడం ఎరకడు గమనించాలేదు. లేపి తిండెట్టాలేదు. తనూ తినలేదు.

తెల్లవారి లేచి చూస్తే కుండ ఖాళీగా వుంది. వారం రోజులు మాదిరి ఇదేగా జరుగుతంది. ''అసిరిగాడు ఇస్తిరాకులో అన్నం తిండం మేమూ సెరువు గట్టుమీద సూసినాం, నిన్న ఈసింత సెట్టుకింద తింటన్నాడు'' అందరూ అనుకోవడం విని కుండ ఎలా ఖాళీ అయిందీ అర్థమయింది ఎరకడికి. పగలంతా ఎంత పట్టుకుందామనుకున్నా పట్టుకు దొరకడం లేదు. రాత్రివేళప్పుడూ పిల్లిలా వచ్చి అన్నం ఎత్తుకుపోతున్నాడు.

ఆ రాత్రికి పెద్దపిల్లలిద్దరూ వస్తారనుకుంటే రాలేదు. చాలా రాత్రిదాక ఎరకడు

ఎదురు చూస్తూనే వున్నాడు. 'మళ్ళీ ఆల యజమాన్ని డబ్బులడగడానికి గాని రాత్రులు కూడాపనికని వుండిపోనారా?... లేకపోతే .. అలిగి రావడం మానేసారా?''

ఎంత ఆలోచించినా ఎరకడికి అంతుపట్టలేదు.

' ఎలాగయినా ఈ రేత్రి కాపుకాసి అసిరిగాడ్ని పట్టుకోవాల. నయానో, భయానో ఆడ్ని నొంగదీయాల. ఆడు సదువుకుంతానన్నా సదివి సెడిపోకని మరీ సెప్పి, ఆ.. టైలరు బాబు దగ్గర పనిలో ఎట్టాల... నువ్వు పని సేసుకున్నావంతే సక్కన నువ్వు అడిగినవన్నీ తీరస్తానని సెప్పాల... ఆడు ఇంటెగనక ఆడూ బాగుపడతాడు.. ఇంటికొక్కరవ్వ సెయ్యి సాయంవమూ అవుతాది. అసిరిగాడి వల్లంతా తడివి ఎన్ని రోజులయింది...? ఎలాగున్నాడో... సిక్కిపోనాడో ...'' అనుకుంటూ ఆకాశం వంక చూసాడు. అర్ధరాత్రయినట్లుంది. వీధిలోకి చూసాడు. ఎవరో తచ్చాడుతున్నట్లయింది... అసిరిగాడే.. ఆడే!' నిర్ధారించుకున్నాడు ఎరకడు.

వెంటనే ఎరకడు ఇంట్లోకి వెళ్ళిపోయి పెరటి ద్వారం తీసి తలుపు చేరవేసి కుండలోని అన్నం వేరే కంచంలో దాసేసి ఖాళీ కుండ మీద మూత పెట్టి మామూలుగా వుంచాడు. తర్వాత లోపలికి వెళ్ళి పడుకున్నట్లు నటిస్తూ చేరగిలబడ్డాడు. కాని నిజంగానే ఎరకడికి నిద్రపట్టేసింది.

అసిరిగాడు నిక్కరేగేసుకుంటూ, పెరటి తలుపు తోసుకుంటూ వచ్చి ఆత్రంగా అన్నంకుండ అందుకున్నాడు. తేలికగా వుండడంతో ఆశ్చర్యపడుతూనే తెరిచాడు. వాడి ఆశ ఆరిపోయింది. ప్రాణాన్ని నిలబెట్టే అమృతం ఎవరో తాగేసినట్లయి వాడికి ఎక్కడ లేని కోపమూ వచ్చింది తీర్చుకున్నాడు. కుండడమట్టిది కావడాన కాలీ కుండతో పెరట్లోకి వచ్చి తన కసినంతా కుండమీద పెంకులు పెంకులుగా పెరటి గుమ్మమంతా పరచుకోగా వాటిని కాలితో తన్నుకుంటూ చీకట్లో కలిసిపోయాడు.

తెల్లవారిపోయిందని మెలుకువ వచ్చిన ఎరకడికి రాత్రి చేయి జారవిడుచుకున్నందుకు బాధ పడుతూనే వంటగదిలోకి నడిచాడు. అన్నంకుండే లేదు. అక్కడి నుండి పెరట్లోకి నడిచేసరికి కుండ పెంకులు దర్శనమివ్వడంతో ఎరకడి వళ్ళు మండిపోయింది. బంగారంలాంటి కుంళా పాడుచేసినందుకు కోపం నషాళానికి ఎక్కింది. తట్టుకోలేక తిట్టాడు.

సాయమ్మ విన్నదేకాని మగడితో చెప్పాలనుకున్నది చెప్పలేక పోయింది. నీరసం నిలువెల్లా పరచుకుంది. పెదవివిప్పడమే ఆమెకు కష్టంగా వుంది.

ఆరోజు ఇంటిలో వంట చేయడానికి బియ్యం పూర్తిగా లేకపోవడం తలమీద పిడుగు పడినట్లయింది ఎరకడికి. అంతలోనే 'ఈ పిడుగు ఎవరో నెత్తిమీద నుండి దించినట్లయింది. ఎందుకంటే ఆ వీధిలో పెళ్ళి... భోజనాలున్నాయి. ఈ రోజుకు గడిచిపోతుంది' అనుకున్నాడు. పెళ్ళివాళ్ళుసాయం కోసం పిలిస్తే ఎరకడు వెళ్ళాడు. వంట్లో వడ్డించడాల్లో ఎరకడు సాయపడ్డాడు. భోజి అన్నం కడుపునిండా తిన్నాడు. బంతిలో

కూచున్న పెంటడికి చెప్పలేనంత సందడిగా వుంది.

వడ్డింపుల్లో తండ్రి వుండడం వల్ల అసిరిగాడు భోజనాలకు రావడానికి కుదరలేదు. అప్పటికే తోటి పిల్లలు 'మీ అయ్యున్నాడ్రా... కొట్టీగల్డు...' బెదిరించారు. రాత్రి కూడా భోజనం లేకపోవడం, మంచి పెళ్ళి భోజనం తప్పిపోవడం అసిరిగాడికి చాలా బాధగా వుంది. ఎండిపోయిన పెదాల్ని చప్పరించుకున్నాడు. ఆకలికి తట్టుకోలేక అటూ ఇటూ తిరిగాడు అసిరిగాడు 'మీ... అయ్యి రమ్మంటున్నాడ్రా'... అని ఎవరో అన్నా... - వెళ్లేవాడేకాని రాత్రి కుండ పగలగొట్టినందుకు కొట్టేస్తాడని భయమేసి పెళ్ళి రుచులతో నాలిక వూరుతున్నా వెళ్లలేక పోయాడు. 'పెళ్ళోలు అన్నం... సక్కిలు గట్రా ఇస్తారు... అయ్యాలు ఇంట్లో దాస్తారు. ఎలాగయినా ఆట్ని రాత్రికి పని పట్టాల..' అనుకున్నాడు అసిరిగాడు.

సూరీడిదంతా చూడలేక, అసిరిగాడ్ని ఆకలితో వుంచకూడదనేమో మరి కొండల మాటుకి దిగిపోయాడు.

అసిరిగాడనుకున్నట్టుగానే పెళ్ళోళ్ళు మిగిలిపోయిన అన్నం, కూర, గూనచారు, సక్కిలు ఇచ్చారు. వంటగదిలో ఆరుచుల్ని భద్రపరుస్తున్న ఎరకడికి అసిరిగాడు గుర్తుకొచ్చాడు. అంతలోనే ఆలోచన వస్తే అమలు పరిచేశాడు

అప్పటికే చీకటిపడింది.

ఎరకడిని ఎవరూ గమనించడం లేదు.

ఎరకడు వంటగదిలో పెళ్ళి భోజనం ఒక కంచంలో వడ్డించి సక్కిలుకూడా పెట్టాడు అటూ ఇటూ చూసి దాంట్లో పురుగుల మందు బాగా కలిపేసి చెయ్యి కడుక్కొని వచ్చి కంచం ముక్కి దగ్గర పెట్టగానే వాసన కొడుతూండడంతో సంతృప్తి పడ్డాడు.

''...రానీ... వచ్చి ... వాసన సూసి బుర్రబాదుకోని... తిండికి ఏటిలేక కడుపు మాడిపోయి... కళ్ళు తిరిగిపోయి.. కాళ్ళమీద పడిపోయి.. అయ్యా అని ఏడాల. ఈ దఫాతో మార్పు రావాల... 'సెప్పిన మాట ఇంటానని తిండెట్టమని' అడే దిగొస్తాడు. అప్పుడు బుద్ది సెప్పి మంచితిండెట్టాల... బుద్ధి తప్పకుండా ఈదసతో వస్తాది...''

అప్పటికే సమయం అర్ధరాత్రికి దగ్గర పడుతోంది. మంచి అన్నం కంచంతో ఇంటిలోపల పెట్టివచ్చి, పెరటి దిబ్బ మీద గోతాము పరుచుకొని పడుకున్నాడు ఎరకడు. పెళ్ళివాళ్ళ మైకాసెట్టు లోంచి పాటలు వినిపిస్తుంటే ఎరకడికి వేగంగానే నిద్రపట్టేసింది.

అసిరిగాడు వాడు అలవాటు పడ్డ టైముకు వస్తూ పెరట్లో తండ్రి పడుకొని వుండడంతో చూస్తూనే భయంతో వెనక్కి అడుగేసాడు. ఆకలి వాడ్ని ముందుకు తోసింది. కాని ఎరకడి పక్కలో కర్ర వాడి కంటికి పాములా కనిపించింది. వాడి భయం - ఆకలి భూతం ముందు భస్మీపటల మయ్యింది. ' ఎలా అయినా ఆకలి తీర్చుకోవాలని.. లోపలికి వెళ్తే.. అయ్యకు దొరికిపోతే . .' ఏమీ తోచక అలాగే కొద్దిసేపు నిలబడి దిక్కులు

చూసాడు.

అసిరిగాడి దృష్టిలో సన్ని, పక్కనే నల్లరాతితో చేసిన సన్నిగొడ్డ పడింది. చుట్టూ చూశాడు. ఎవ్వరూ లేరు.. నిశ్శబ్దం. నిర్మానుష్యం... చీకటి... వీటిని చీల్చుకుంటూ మైకులో పాట.. కడుపులో ఆకలి ఆట.. మెదడు దొలిచేస్తుండగా తట్టుకోలేక వెళ్ళి సన్నిగొడ్డ రెండు చేతులతో ఎత్తిపట్టుకున్నాడు. తరువాత చుట్టూ చూస్తూ నెమ్మదిగా అడుగులు వేస్తూ... ఆదమరచి నిద్రపోతున్న తండ్రి తలమీద పడేసాడు.

అంతే....

ఎరకడి కేక గాలిలో లేచి మైకులో వస్తున్న పాటలో కలిసిపోయింది. అసిరిగాడు వెనక్కి చూడకుండా వంటగదిలోకి పెరటి తలుపుతోసుకుంటూ దూరాడు. ఎదురుగా కంచంలో అన్నం... అమ్మలా రా రమ్మని పిలుస్తున్నట్లయింది.

ఆత్రంగా నోట్లో ముద్ద పెట్టుకొని ఆగిపోయాడు. పాట ఆగిపోయింది.

రెండు క్షణాలు అనంతమైన నిశ్శబ్దం...

మళ్ళీ పాట... రికార్డు తిరగేసి నట్టున్నారు.

అసిరిగాడిలో అనుమానం తలెత్తింది ...దిబ్బ మీదున్న తండ్రి కదలకుండా పడుకున్నట్లనిపించి... మళ్ళీ పరుగున వంటగదిలోకి వచ్చి ఆత్రంతో... గాబరాతో... ఆకలితో .. కంచంలోని అన్నమంతా నోరు పెద్దది చేస్తూ కడుపులో పడేసుకున్నాడు. మిగిలిన సక్కులు రెండు చూసి, ఆనందంతో వాటిని పట్టుకొని... ముద్దు పెట్టుకొని జేబులో దోపుకున్నాడు... పక్కనే వున్న నీళ్ళు గొంతులో వంపేసుకున్నాడు....

కూర్చున్న చోటు నుంచి లేవాలనుకున్నాడే గాని ఎంత ప్రయత్నించినా అసిరిగాడు లేవలేకపోయాడు. కనురెప్పలు కూడా ఎత్తలేక పోయాడు. అలానే వెనక్కి పడిపోయాడు. కరెంటు పోయి పాటలు ఆగిపోయినట్టున్నాయి. నిశ్శబ్దం నింగి నుంచి నేలకు జారిపడుతోంది. నిశ్శబ్దంలో శబ్దం చేయకూడదనేమో అసిరిగాడిలో శ్వాస శబ్దమూ లేదు!

ఆదిబ్బ దిగువ పల్లంలో వున్న వానపాములు... నేలకేసి తలలు బాదుకొంటున్నాయి. వాన పడినప్పుడు ఆనందంగా ఎగిరే వానపాములు, నీరింకిపోవడంతో... తేమ మట్టిలో వున్నంతవరకు తింటూనే బతికాయి. ఆ మట్టి కూడా పూర్తిగా ఎండిపోయే సరికి... నమ్మిన నేల బీటలు వారి, ఇనుము మాదిరి గడ్డ కట్టుకుపోయి బెడ్డలు బయలు దేరే సరికి అవి తలలు బాదుకుంటున్నాయి. అవలా తలలు బాదుకుంటూ చచ్చేయే కాని... ఒకదానికొకటి కొట్టుకుంటూ మాత్రం కాదు. పోగుగా వున్న ఆ వానపాములు మనం చూస్తే ఒక దాని కొకటి వురిశిక్ష విధించుకున్నట్లు కనిపిస్తాయంతే!

*రచనా కాలం : 7,8, జనవరి '91,*

*ముద్రణ : 1992 అంగీరస దీపావళి ప్రత్యేక సంచిక ఆంధ్రజ్యోతి*



# పిండొడిం

విశాఖపట్నంలో మెయిలు ఎక్కి పలాస స్టేషన్‌లో దిగానం, నాతో పాటు మా అన్నయ్యగారి పాప, బాబు ఇద్దరూ వున్నారు. చిన్న దాన్ని ఎత్తుకున్నాను. బాబు నా చెయ్యి పట్టుకొని నడుస్తున్నాడు. స్టేషన్ దాటాలని బ్రిడ్జీ మెట్లు ఎక్కుతున్నాను...

''అయ్యా....'' చాలా ఆప్యాయంగా పిలుపు వినిపించింది.

వెనుదిరిగి చూసాను.

'పిండొడిం!'

అయిదడుగులు ఎత్తున్నా గూని వలన మరో అడుగు తక్కువగానే కనిపించేడు. అదే ఖాకీ నిక్కరు. అదే ఎర్రచొక్కా వీపు మీద. పల్చటి జుట్టు.

నెత్తిమీది సూట్‌కేసు, చేతిలోని బేగులను దించి పరుగున మా దగ్గరకు వచ్చాడు. 'బాగున్నావా అయ్యా? మొన్నే నాన్నని అడిగాను... నడిపోడు రాలేదాని? రెండ్రోజులు వుంతావా అయ్యా?... అన్న పిల్లలు కదయ్యా' అంటూనే నా చేతిలోని బేగుని, పాపని అందుకున్నాడు. పాపని మెడమీద కూర్చోపెట్టుకున్నాడు.

'పిండొడిం' లో మార్పురాలేదు!

అదే ఆప్యాయత... అదే వాత్సల్యం... అదే మాట తీరు....

మనిషి మాత్రం పీనుగులా వున్నాడు. గతసారి అంటే నాలుగు నెలల క్రితం వచ్చినప్పటి కంటే చాలా చిక్కిపోయాడు. కళ్లు లోతుగా, అలసిపోయినట్టున్నాడు.

పిండొడిం లగేజి దించేసిన చోట నిలబడి కోపంతో దగ్గరికి వచ్చిన మనిషి 'ఏమిటయ్యు లగేజి మధ్యలో దించేసి...' అడగబోయాడు. అంత కంటే ముందు పిండొడిం... '' ఒరే నారిగ, ఈ బాబు లగేజట్టి కెళ్లరా... నాకు పనుంది...'' నారిగాడికి పని పురమాయించి మా వెంట బయలుదేరాడు.

''గొప్పవాడివే...'' లగేజి గల ఆయన గొణుక్కుంటూ నారిగాడి వెంట వెళ్లాడు.

''పిండొడిం, ఫరవాలేదులే ... నువ్వెళ్లు. లగేజి ఏం లేదు కదా...'' అన్నాను.

''పాప వున్నది కదా ఎత్తుకుంతాను... గుమ్మడిపండు కదమ్మా...'' నా మాట

పట్టించుకోకుండా పాపకళ్ళలోకి చూస్తూ అడిగి మరీ నడుస్తున్నాడు.

స్టేషన్ మాస్టర్, బుకింగ్ క్లర్కు, మరో ఇద్దరు ముగ్గురు బ్రిడ్జీ మీదే కనిపించి పలుకరించారు. బ్రిడ్జీ దిగి క్వార్టర్స్‌లోకి వెళ్తుంటే పాప ఎందుకనో ఏడ్చింది. పిండొడిం లాలించబోయాడు. పాప నాదగ్గరికి వచ్చేసింది. బాబురూప్ తనకీ గుర్రం పండు వేయమన్నాడు. నేను వద్దన్నాను. వాడు విన్లేదు. పిండొడిం కష్టం మీద ఈసారి బాబుని ఎత్తుకున్నాడు. రెండడుగులు తూలినా బలంగా అడుగు వేస్తున్నాడు. బలం లేకపోయినా అలవాటుకి 'సత్తువ' వున్నట్లనిపించింది.

క్వార్టరు చేరుకున్నాం.

పిండొడిమే అమ్మకీ, అవతలి లైనుకీ వినిపించేలా కేకవేసి మరీ మా రాకను చెప్పాడు. గేటు తీసాడు. గుర్రం పండు దించాడు. బేగులు లోపల పెట్టాడు. పాపని అమ్మకి అందించాడు.

నాకెందుకో పిండొడింని చూస్తుంటే చనిపోయిన మా తాతయ్య గుర్తుకు వచ్చాడు. అమ్మ నాతో మాట్లాడుతుంటే పిండొడిం ఆగలేదు. ఉద్యోగ మయ్యిందా? అడిగాడు. ఉద్యోగం రాలేదని తెలిసి గవర్నమెంటుని, తనకి తెలిసిన మంత్రుల్ని పేరుపెట్టి తిట్టాడు. ఉద్యోగం వస్తుందన్నాడు. నాకు ఉద్యోగం రాకపోతే ప్రపంచంలోనే ఉద్యోగం ఎవరికీ రాదన్నాడు.

మేం ఇంట్లోకి వచ్చి కూర్చుంటే పిండొడిం గడపలోనే నిలబడ్డాడు. లోపలకి రమ్మని నేను అన్నాను. 'పరవాలేదు, పనుంది. ఎళ్ళిపోతా'నన్నాడు. జేబులోంచి ఐదు రూపాయలు తీసి ఇచ్చాను. చిల్లర లేదన్నాడు. 'ఫరవాలేదు వుంచుకో' అన్నాను. వద్దన్నాడు. అమ్మ కేకవేసి, చనువుగా కళ్లెర్ర జేస్తే అప్పుడు జేబులో పెట్టుకున్నాడు. వెళ్తానన్నాడే గాని అరగంట దాక అక్కడ వుండిగాని కదల్లేక పోయాడు.

ఆ రాత్రి ఎందుకనో కళ్ళ నిండా పిండొడిమే కనపడ్డాడు.

పిండొడిం ఆలోచనలే నా చుట్టూరా తిరిగాయి.

రెండు నెలలకీ, మూడు నెలలకీ సొంతవూరు వచ్చినపుడల్లా పిండొడింని చూస్తూనే వున్నాను. అలా ఓపది, పదే హేనుళ్లుగ పిండొడిం తెలుసు. ఊహ తెలిసాక పిండొడిం తెలుసు. అంతకు ముందూ తెలుసు, అమ్మనాన్నలకు తెలుసు. సరిగా నాన్నగారి వయసుండొచ్చు. అంతకన్నా ఎక్కువే వుంటుందేమో... లేకపోతే అలా కనిపిస్తాడా?

తలుపు చప్పుడయింది.

అమ్మ వెళ్లి తలుపు తీసింది. నాన్న వచ్చినట్టున్నారు. ఫస్టు నైట్ డ్యూటీ అయిపోయిందన్న మాట. టైమ్ రాత్రి పన్నెండున్నర అవ్వొచ్చు!

నాన్న వచ్చాక ఇంట్లో లైటు వేశారు. నన్ను చూస్తూనే ''వీడెప్పుడొచ్చాడు?'' అడిగారు. అమ్మ చెప్పింది. నేను కళ్లు మూసుకున్నా మెలకువగానే వున్నాను.

నాన్న బట్టలు మార్చుకోకుండా అలానే కూర్చున్నారు. ఏమలా వున్నారని అమ్మ అడిగింది. నాన్న రెండు క్షణాలు నిట్టూర్చి ఊపిరి వదులుతూ చెప్పారు.

''పిండొడిం మూటలు మోస్తూ కళ్లు తిరిగి పడిపోయాడు. తలకి దెబ్బకూడా తగిలింది. నాలుగు కుట్లు వేశారు.''...

'' ఇప్పుడెలా వుంది?'' అమ్మ అడిగింది.

'' ఆ కుట్లు కలిసేంత వరకూ మూటలు మొయ్యకూడదు. డాక్టరు చెప్పిన మాటలే. మేమంతా పోరాం, వాడు వింటాడని నమ్మకం లేదు. ఆలనా పాలనా చూసే ఆడదిక్కు లేదు. ఆ అత్తముండ ఇంత జరిగినా తొంగి చూడలే. వాడి పెళ్లామే బ్రతికుంటే ఇలా జరక్కపోను...'' నాన్న అన్నారు.

''అదీ వీడి వల్లే చచ్చిందని నిందమోపారు. ఆ పిల్లడు రేపో మాపో లాగ వున్నాడు.. ఏమిటో ఒక్కో జన్మ ఎంత తెచ్చుకుంటుందో...'' అమ్మ నిట్టూర్చింది.

పిండొడిం గురించి ఆసమయంలో అమ్మని ఏదో అడగాలనిపించింది. కాని లైటారిపోయి వుంది. చాలా సేపటికి గాని నిద్ర పట్టలేదు. మెలకువ వచ్చి చూస్తే పొద్దెక్కి వుంది.

పెరట్లో అమ్మ ఊరుబిండి (తెలుకపిండి)తో పిండొడియాలు (పిండి వడియాలు) పళ్లెరంలో పెడుతోంది.

'' ఏ మిటమ్మా తెల్లవారే సరికి?.. ఈ పనులన్నీ చాలవా?. .'' అడిగాను.

''నీ కిష్టమనిరా! నీకు చల్లన్నం అలవాటు, తెల్లవారే సరికి ఏమి కూరవుంటుంది? అందుకు వడియాలు పెడుతున్నాను. అందులోనూ నీకు పిండొడిమంటే ప్రాణం...'' అమ్మ చెప్తోంది. కాని నాకు పిండొడిం అనగానే ముసలి 'పిండొడిం' గుర్తుకు వచ్చాడు.

''అమ్మా పిండొడింకి ఎలా వుంది?'' అడిగాను.

అమ్మ రాత్రి నే పడుకోలేదని గ్రహించింది. నాన్న చెప్పిన విషయాలే అమ్మ మళ్ళీ చెప్పింది. నాన్న అక్కడికే వెళ్లారని అంది.

'పిండొడిం' పేరేమిటి? అమ్మ నడిగాను.

అమ్మ గతాన్ని నా ముందుంచింది. అప్పుడెప్పుడో చిన్నప్పుడట, నాన్న, పిండొడిం అంతా ఒక తోటి గుంటలట. వీళ్ళందరి ఇళ్ళూ ఒక వాసలో వుండేవట. ఓసారి కొండివీధిలో మంటలేచి మన వాసా అంటుకుందట. మంట ఊరు చుడుతుంటే కుర్రాళ్లంతా దాన్ని ఆర్పడానికెళ్ళారట.

ముసలాళ్ళు చిన్న పిల్లల్ని తమతో తీసుకెళ్లారట. ఆడాళ్ళంతా సామాన్లు పెరకటం చేశారట. అదిగో అప్పుడు పారమ్మ డబ్బాల్ని, డొక్కుల్ని (అదే దాని సంసారం) తెస్తోందట... ఓ డబ్బా చేజారి కిందపడి, మూతపడి పిండి వడియాలు వలికి పోయాయట... అదిగో అప్పుడు 'పిండొడిం' తనకి 'పిండొడిం' ఇమ్మని ఒకటే ఏడుపట. అందరూ ఆస్తులు పోయి, బూడిదయి ఏడుస్తుంటే పిండొడిం పిండొడియాల

కోసం ఏడ్చాడట, జ్వరం కూడా పెట్టుకున్నాడట. ఎవరో చేతిలో పిండొడిం పెడితే 'పిండొడిం' లేచి కూర్చున్నాడట. మంత్రించినట్టుగా జ్వరం పోయిందట... అందరూ ' ఓరి పిండొడిమూ... పిండొడిమూ' అని ఎగతాళి చేసి చేసి అదే వాడి పేరయిపోయింది!

'అసలు పేరు మీ నాన్నకే తెలీదు'.

''అమ్మా పిండొడింకి ఉద్యోగం రాలేదామ్మా...?''

''పిండొడింకి తండ్రితో పాటు బక్కలు కాయడం, తల్లితో పాటు కూలి కెళ్లడంతోనే సరి. కడుపు జరక్క పనిలోకే గాని బడిలోకి పంపలేదు. పిండొడిం పుట్టుకూలీ అయిపోయాడు.. నిత్యమూ పనులేటి దొరుకుతాయి? అందుకే రైల్వేలో లైసునీసు కూలీ అయ్యాడు. ఇన్నాళ్ల సర్వీసుకి గేంగ్ వేంనే అవాలి, గాని వీడెళ్తే సొంత పనుల్తొంగుంటాయని స్టేషన్ మేస్టర్ల నుండి ఎవ్వరూ ఎల్లనివ్వలేదు.... కానివ్వలేదు''

అమ్మ మాటలాపి మధ్యలో టీ తెచ్చి ఇచ్చింది.

మళ్లీ చెప్పింది...

''మీ నాన్నకు కూ్కడా చదువుకొనే దారి లేకపోయినా, ప్రయివేట్లు కెళ్లి ఎనిమిది పాసయినారు. అప్పుడు మీలాగ కాదు... పద్దెనిమిదేళ్లకే పని! పది చదివి వుంటే చాలు. ఉద్యోగం చిన్దో పెద్దదో దొరికేది. మొదాట మీ నాన్నకి గార్డుబోయి వుజ్జోగం వచ్చింది. అంటే గార్డు పెట్టెలు మొయ్యడం. ఆ వుజ్జోగం మీ నాన్న చెయ్యలేక పోతే పిండొడిమే పెట్టెలు మోసేవాడు. అప్పుడు పొట్టిగా లావుగా గుమ్మడి పండులాగా వుండే వాడులే, అయితే పావలో... అర్దో మీనాన్న వాడికి జీతమిచ్చుకునేవారు. వాడికదే కొండంత సంబరమయిపోయి 'అన్న ... అన్న...' అని మీ నాన్నని ఇప్పటికీ వదలడు.

''తరువాత మీ నాన్నకు ప్రమోషనొచ్చింది. గార్డుబోయి నుండి టి పి ఎం ఎ. తరువాత టి పి ఎం బి తరువాత.. ఇదిగో ఇప్పుడు స్వీచ్చుమేనే. మీ నాన్నకి పెద్ద చదువులేక గాని మీ నాన్న తోటోళ్ళు ఏయెస్సెమ్ములు, ఎస్సెమ్ములూ గార్డులయిపోయి అంతలేసి జీతాలు తెచ్చుకుంటున్నారు. వాళ్లందరికీ కూడా ఈ పిండొడివేం సాయపడేవాడు. అంత మంది డ్యూటీ వాడే చేసేవాడు'', అమ్మ చెపుతూనే వుంది.

నేను ఏదో ఆలోచనల వల్ల వెనకబడిపోయాను. అందరి ఉద్యోగాలు చేసి తనకో ఉద్యోగం లేని పిండొడింని చూస్తుంటే బాధనిపించింది. అంతకు మించి మా రక్తంలో వాడి చెమట బొట్టులు ఇమిడివున్నట్టనిపించింది. మా కుటుంబమే కాక అనేక కుటుంబాలు పిండొడింకి రుణపడి వున్నట్టనిపించింది.

ఇంతలో నీలమ్మ పిల్లాడ్ని ఎత్తుకొని వచ్చింది. తపేలా చూపించి గెంజి పొయ్యిమంది. గెంజి, పసగడుగు (బియ్యం కడిగిన నీళ్ళు), మినప పొట్టు అందులో వేసింది అమ్మ .

నీలమ్మ పిల్లాడ్ని నేలపై దించింది.

అమ్మ ప్లేటులో వుప్మా వేసి ఆ పిల్లాడికి పెట్టింది. కడుగు పోసేసి నీలమ్మ వచ్చేలోపు

ఆపిల్లాడు వుప్మా వూర్చేశాడు.

నీలమ్మ పిల్లాడు తిన్న ప్లేటును కడిగి పెడుతూ ''వీళ్ళయ్య వీళ్లమ్మని తినేసినాడు. ఈడు నన్ను తినేస్తాడు. ఈడి ఆకలి మండిపోను ఆకలి! ఏడు కుండలు వండి వడ్డించినా తినేస్తాడు గదా, దెయ్యం తిండి ఎవడు పెడతాడు? ఈడమ్మ మొగుడు. . ఆడు పెళ్లానికి మందు నీళ్ళు పొయ్యక, ఆకలితో ఇగిర్చి బలివిన సంపినాడ మరేటి...?'' గొంతు చించుకుంది.

''వాడ్నెందుకు తిడతావే...? చిన్న పిల్లడు... ఏమిటి తెలుస్తాది...? అవును గాని మీ అల్లుడికి తల పగలిందట, కుట్లు వేశారట... రైల్వే ఆసుపత్రిలో వున్నాడట.. ఒక దఫా చూసి రాలేక పోయావా?'' అమ్మ అడిగింది.

''నా కూతుర్ని ఆడు సంపినప్పుడే ఆడు సచ్చాడనుకున్నాను... ఇప్పుడాడు బతికితేటి? బుగ్గయిపోతేటి?''... నీలమ్మముఖం కందగడ్డలా వుంది. మాసిన బట్టతో పిల్లాడి మూతి తుడిసింది.

''అలగంటె ఎలగవుద్ది నీలమ్మ? ఎంత కాదనుకున్నా వాడు నీఅల్లుడు. అన్ని మాటలెందుగాన్ని నువ్విప్పుడు ఎవుల రక్తపు ముద్దని... కండని కొండ చేద్దామని అనుకుంటున్నావ్? ఈ పఁరాకులన్నీ (పాట్లు) పడుతున్నావు?'' అమ్మ సూటిగా అడిగింది.

నీలమ్మ రెండు నిమిషాలు ఏమీ మాట్లాడలేక పోయింది. తరువాత అంది. ''అందరూ నన్నే తప్పు పట్టండమ్మ... ఈ భూమ్మీద నా పాపమే ఎక్కువయి పోనాది. ఒక్క కూతుర్ని... నా కూతుర్ని నిలుపుకోలేక పోన్ను... నా కూతురు కాడికి నేనెప్పుడెల్తానో నా బాధలెప్పుడు ఈడేరుతాయో?''

నీలమ్మ ఏడ్చుకొని, పైట నోట్లో పెట్టుకొని పిల్లాడ్ని చంకలో వేసుకొని వెళ్లిపోయింది.

ఆమె వెళ్లాక చాలాసేపు నిశ్శబ్దాన్ని భరించాం.

తరువాత నేనే అమ్మ నడిగాను.

''అమ్మా.... పిండొడిం తన పెళ్లాన్ని చంపేసాడా?''

''అని లోకం అంటుంది. వాడి అత్త నీలమ్మ అంటుంది. పిండొడిం పెళ్లాం ఎర్ని పెళ్ళయిన పదిహేనేళ్లకి పిల్లడ్ని కంది. పురిట్లోనే దానికి పచ్చ కామెర్లు వచ్చాయి. దిసా (అశ్రద్ధ) చేస్సారు. ముదిరిపోయింది. అస్పెట్లకి తిప్పడానికి డబ్బుల్లేవన్నాడు పిండొడిం. అలాటోడివి ఎలా మనువు చేసుకున్నావు? దాని పీక పిసికి సంపే అంది నీలమ్మ, అసలు ఇలాంటివే వచ్చి పెళ్ళయినా చానాళ్ళు వరకు కూతుర్ని కాపురానికి పంపలేదు నీలమ్మ. పిల్లడు పుట్టిన తరువాత కష్టాలు ఆ గుంట డితోటి!...

''డబ్బులిస్తే తీసికెళ్తావా ఆస్పెట్లకి? నా దగ్గర డబ్బులూ లేవు నీవు ఆస్పెట్లకి తీసుకెళ్లా వద్దూ...' అంది ఎర్ని. అప్పటికీ పిండొడిం పెళ్ళాన్ని ఆస్పెట్లకి తిప్పాడు.

అప్పటికే ముదిరి పోయిందన్నారు డాక్టర్లు. వేళ్ళు, గోళ్ళు, ఒళ్ళు అంతా పసుపుగా అయిపోయింది. అక్కడికి వారం రోజుల్లో కళ్లు తేలేసేసింది... కూతురు పోయాక దాన్ని బుగ్గి చేస్తే ఆ బుగ్గి (బూడిద) తెచ్చి పిండొడిం తల మీద వంపింది నీలమ్మ. మనవడ్ని తనతో తీసుకొచ్చినా అల్లుడ్ని ఇంటికి రానిచ్చింది కాదు. వెళ్ళినా పిల్లాడ్ని ముట్టనిచ్చింది కాదు. గతి మాల్నోడితో గండమని దూరంగానే వుంచింది నీలమ్మ. అప్పటి నుంచి పిండొడింకి ప్లాటు ఫారమే ఇల్లూ, వాకిలీ, తల్లీ అయింది!''

అమ్మ అన్ని విషయాలు చెప్పాక అసంతృప్తి ఎక్కువయింది. ఇంకేమీ అమ్మని ప్రశ్నించలేదు.

ఆ మధ్యాహ్నం నాన్న వచ్చి భోజనాల సమయంలో పిండొడిం విషయం కదిపారు. నీలమ్మ ఆస్పత్రుల్లకి వెళ్లిందట. కొడుకు చేత తండ్రికి ముద్దులు పెట్టించిందట. డికాషనులో రైల్వే రొట్టె (కటింగు రొట్టె) ముంచి తినిపించిందట. ఈ రోజు సాయంత్రం డిశ్చార్జి చేస్తే తన ఇంటికి తీసుకెళ్తుందట.

నాకు చాలా ఆనందం కలిగింది. పిండొడిం బాధలన్నీ తీరిపోయినట్లు అనిపించింది. అసంతృప్తి భారం తగ్గుతున్నట్లుగా తోచింది.

ఆ మరుసటి రోజునే విశాఖపట్నం బయలు దేరాను. బయలుదేరే ముందు పిండొడింను చూశాను. ఎప్పటిలాగే వున్నాడు. రెస్టు తీసుకోమన్నాను. డబ్బులు ఇద్దామనుకున్నాను. ఛార్జీలు, ఖర్చులు పిల్లలతో అని గుర్తొచ్చి ఆగిపోయాను. పిండొడిం మాత్రం వచ్చే ముందు నాచేతులు రెండూ ఓసారి పట్టుకున్నప్పుడు నావళ్ళు ఎందుకో జలదరించింది.

విశాఖపట్నం వచ్చేసిన వారం పదిరోజుల దాకా పిండొడిం గుర్తుకు వచ్చినా క్రమేపి కనుమరుగయ్యాడు.

నే కాంపిటేటివ్‌కు ప్రిపేరు అవుతూ జీవితంలో నిలదొక్కు కోవాలనుకున్నా ఈ చదువులు, పోటీ, కుస్తీ, అంతా కూడా జీవితం లోంచి పారిపోవడానికేమో అని తోచేది. లేకపోతే మళ్లీ నాలుగు నెలలకు ఊరు వెళ్లేదాక అమ్మ, నాన్న, పిండొడిం గుర్తురాక పోవడమేమిటి?

స్టేషన్‌లో దిగుతూనే వెతికాను!

నా కోసం వెతుక్కుంటూ రావలసిన 'పిండొడిం' కోసం నే వెతికాను!

ఎందరెందరో వచ్చారు.

పిండొడిం మాత్రం రాలేదు!?

కనిపించిన వారినల్లా అడిగాను.

తెలీదన్నారు.

చచ్చిపోయాడన్నారు.

అమ్మ చెప్పింది పిండొడిం చచ్చిపోయాడని! తలంతా చీముపట్టి, పురుగు పట్టి,

పుండయిపోయి కుళ్లు కంపుతో... ఈదేశంలోని దుర్గంధం అంతా తలపైనే వున్నట్టు... తనే మోస్తున్నట్టు... మోయలేక వెళ్ళిపోయినట్టు!!

పిండొడిం తలకి కుట్లు పడ్డాక, డిశ్చార్జి అయినాక నీలమ్మ తనింటికి తీసుకువెళ్లిందట. వున్నదాంట్లో... తను తిన్నదాంట్లో, కలో గెంజో పెట్టిందట. కుట్లు విప్పే సరికి కొంచెం తడివున్నా ఆరిపోయిందని ఆత్మ తృప్తితో సరిపెట్టుకున్నాడట పిండొడిం. 'ఆడదానివి నువ్వేం కష్టపడతావ్, ఎన్నాళ్ళు పోషిస్తావని' ఆ తలమీదే మూటలు, డబ్బాలు, పెట్టెలు... మోసాడట. సాహసించినా తలనీరు పట్టి పుండు పెరిగిపోయి... మరో నెలకల్లా మనిషే మట్టయిపోయాడట.

అమ్మ చెప్తుంటే నా కళ్లంట నీళ్ళు తిరిగాయి.

'పనిలో కెళ్లకపోతే పొట్ట గడవదు... ఎవరో ఒక పూటకి జాలిగ, దయగా పెడతారు. రోజుకి ఎన్నిపూటలు? ఎన్ని రోజులని...? ఒకరి కష్టం తినకుండా వెళ్లిపోయిన పిండొడిం ఇతరుల కోసం కష్టపడ్డాడు. కాపురాల్ని నిలబెట్టాడు. పిండొడిం నిజంగా పిండొడిమే! ఎవరో ముద్ద మీద తను ముక్కలయ్యాడు. పొడయి రాలాడు. కూరయ్యాడు. పిండొడిం పిండొడిమే!

నే మళ్ళీ విశాఖపట్నం బయలుదేరాను. స్టేషన్లో అలవాటుగా అప్రయత్నంగా నా కళ్ళు పిండొడిం కోసం వెతికాయి. పిండొడిం కనపడలేదు. కానీ నీలమ్మ కనిపించింది. స్టేషన్, ప్లాట్‌ఫారమ్ వూడ్చుతోంది. దాని మనమడు - పిండొడిం కొడుకు చిన్న చెంబుతో నీళ్లు మోస్తున్నాడు. కునికేసిన తోటకూర కాడలా వున్న వాడి వయస్సు పదిహేనేళ్లంటే నమ్మలేనట్టుగా వున్నాడు.

నే అలా చూస్తూనే వున్నాను.

పిండొడిం కొడుకూ పెద్దవాడయ్యాడు. పిండొడిం అంత అయ్యాడు. పిండొడిం లానే మూటలు మోస్తున్నాడు.. అదే నిక్కరు, అదే చొక్కా, అదే జట్టు... అదే గూని!

ఉలిక్కి పడ్డాను. రైలు మోతతో బోగీలోకి నడిచి సీట్లో కూర్చున్నాను. నేను సేఫ్టీగా వున్నాను. మానాన్నకీ రిటైరుమెంట్ సొమ్ము లక్షా... లక్షన్నర వస్తుంది. అన్నయ్య బ్యాంకు మేనేజర్, తమ్ముడు డాక్టర్, ఇంకోడు చదువుతున్నాడు. నాకూ రేపు ఉద్యోగం వస్తుంది. అవసరమయితే పిండొడిం కొడుకూ సాయపడతాడు. సీటు మెత్తగా వుంది. గాలి చల్లగా వుంది. నాకు భవిష్యత్తూ వుంది.

పిండొడిం కొడుకు నెత్తిమీద ఏదో బరువు మూటా వుంది.

ఇప్పుడు రైలు ప్లాట్‌ఫారమ్ విడిచిపెట్టేలా వుంది.

*ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక । ౨౨౩ (దీపావళి ప్రత్యేక సంచిక)*

# మట్టి మనుషులు

''అయ్యా!... నేను వున్నంత కాలమే(నయ్యా, ... ఈ వూరు తోటి... ఈ మట్టితోటి పేగు సంబంధం... ఈనా గుప్పెడు పేనం గుటుక్కు మనీస్తే అంతాసరి. మీ తాతగోరి వూరే మీకు పరాయి వూరయిపోతాది! పానవ్నారయిపోతాది! సుట్టపుసూపుక్కూడా నొయ్యకుండయి పోతాది!!....'' అమ్మమ్మ మాటలు జ్ఞాపకానికొస్తుంటే కళ్ళలో నీళ్ళూరాయి. తాతగారి వూరిమీదుగ వచ్చినగాలి బస్సులో వున్న నన్నుతడిమి జలదరింపజేసింది. వెం(ట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. గుండె అంతా భారమైనట్టు వదిలిన ఊపిరి నిట్టూర్చింది.

ఏటి గట్టు మలుపులో (బ్రిడ్జీ మీదుగ బస్సు తిరుగతూంది. ఏటినీరు గడ్డ కట్టుకు పోయినట్టు ఏటిలో ఏ శబ్దమూ లేదు. (బ్రిడ్జీ దాటిన బస్సు మట్టిరోడ్డులోకి వచ్చింది. సరి తాతగారి వూరు వచ్చేసినట్టే! ఆ(తంగా నా కళ్ళు దేవులాడుతున్నాయి. రోడ్డువారన వున్న చెట్లు వచ్చిపోయిన వాహనాలు రేపిన మట్టికీ... దూళి దుమ్ముకీ పచ్చదనం పోయి ఎ(రగా... మాసిన ముఖాల్తో నిలుచున్నట్టున్నాయి.

చిన్నప్పుడు తాతగారి వూరు వచ్చిందంటే అమ్మ ఒడిలోంచి దూకి ఆనందంతో వేసిన వెర్రికేకలా జ్ఞాపకాల్ని ఆవిష్కరిస్తూ బస్సు హోరను మోత! ఊరు వచ్చేసిందని!! బస్సు దిగాను. క్షణకాలం అడుగులు ఎటూ పడలేదు. ఊరు పరాయిదైనట్టూ.... పాలు పెట్టిన తల్లే పాడెక్కి వెళ్ళిపోయాక చితి చూడ్డానిక్కూడా నోచుకోని కొడుకులా... కొయ్యబారి నిలుచున్నాను. నిజమే! అమ్మమ్మ చనిపోయాక ఒంటరిపక్షయి పోయిన తాతయ్య గూడు వదిలేసాడు. నలుగురిని కన్నందుకు ఏడాదికి నాలుగు వాటాలు పడి - వాటాకు మూడు నెలల వంతున అతిథిలా మిగిలాడు. నాలుగు మెతుకుల కోసం వలస పోయిన బాటసారయాడు!....

బస్సు హోరనువేసుకుంటూ ముందుకు కదిలిపోయింది. అలా కదిలినప్పుడు రేగిన మట్టి గాల్లోకి కలసి వుక్కిరిబిక్కిరైతే ఊరి రోడ్లోకి అడుగు పెట్టాను.

అమ్మమ్మ ఈ ఊరునీ.... లోకాన్నీ వదిలివెళ్ళిన ఈ ఆరేడేళ్లలోనూ ఎన్ని మార్పులొచ్చాయి? తాతయ్య ఒక్కడూ వలసపక్షి అయిపోవడంతో ఆగిపోలేదు. అమ్మమ్మ పేగు సంబంధమై శాఖోపశాఖలుగా విస్తరించిన కుటుంబాలన్నీ ఆమెతోనే పెనవేసుకున్నట్టు.... ఆమె పోయాక ఆవూరుతోనే పేగు తెగినట్టు సంబంధాలూ తెగిపోయాయి! పెళ్ళిళ్ళకి పేరంటాలకీ పండగలకీ పబ్బాలకీ... చివరకి వేసవి సెలవులకి విడిది స్థలమయిన ఊరు - అమ్మమ్మ లేక... తాతయ్య వుండీ లేక దారే మర్చిపోయాం. అమ్మమ్మ తాత అక్కడ అరవై ఏళ్ళు కాపురం చేసుండొచ్చు... కూతుర్లనీ కొడుకులనీ

ఆ మట్టి మీదే పెద్ద చేసుండొచ్చు.... ఆల పురుడులూ పుణ్యాలూ అక్కడే గట్టెక్కి వుండొచ్చు... మనమల్నీ మునిమనమల్నీ ముద్దులాడిన తేగుడు ఆరిపోయి వుండొచ్చు.... .

ఇప్పుడు ఊరొక జ్ఞాపకం!

ఇప్పుడు ఊరొక కథ !!

'' ఎవులింటికి బాబూ? '' ఎవరో అడుగుతున్నారు. ఎక్కడికని చెప్పను? ఎవరున్నారని చెప్పను? ఏ ఏ జ్ఞాపకాల్ని కళ్ళ ముందుంచను తెగిపోయిన పేగుచివరి తడి ఎలా చూపించను?

''నువ్వప్పమ్మ మనవడివి కదరా?''

గుర్తు పట్టారు. తప్పిపోయినదేదో దొరుకుతోంది.

'' కూతురు కొడికివా?'' ... సరోజిని.... పెద్దానికొడుకు నడిపోడివికదర...

ఇంకా దగ్గరగా గుర్తు పట్టారు. చాలు... చాలు...

'' ఎన్నాళ్ళయ్యింది రయ్యా... సూత్తానో లేదో... సూడకుండే సచ్చిపోతాననుకున్నాను. మీ యమ్మ రాలేదురా? ఎందుకొస్తుంది... ఈ వూర్లింక ఎవలుదానికి? మీ యమ్మమ్మ బతుక్కి తలుపులు బడ్డం కాదు... మీరీ వూరు రాడాకే తలుపులు బడిపోనాయి... ఈ ఊరుతోటి పనేటి? ఇన్నాలయితే సెక్కా ముక్కా వున్నందుకి నాలుగింజలకయినా మీ మామలు ఇద్దరూ వొచ్చోరు. పెద్దోడంతే బూమి తనకాలెట్టేనాడు. మీ సిన్నమావ ఈ ఊర్లోటే వున్నా, బాగార్లయి పోనారుకదా అన్నదమ్ములు వచ్చీ పోవడాల్లేవు... ఆడపిల్ల కదా మీ యమ్మ రాడానికేమిరా? '' తడిబట్ట స్నానం చేసి వస్తోందేమో ఆరిపోయింది, ఆ గొంతులో తడారలేదు. అమ్మమ్మ వయసే వుంటుంది.

అటుగా పోతున్న మరో ఇద్దరూ వింటూ మాతోపాటే నిలబడిపోయారు. నా గొంతు పెగల్లేదు.

ఆ ముసల్దే అంది... '' అయ్య మీతాతేటి... మీ సిన్నమావ తోటి జగడమాడి కోరుటుకెళ్తాడట... ముసలికాలాన ఆడికొద్దురన్నా, అన్నా ఇనడు ...'' ఆ తర్వాతేమీ మాట్లాడలేకపోయింది.

అంత వరకు నిల్చున్న ఇద్దర్లో ఒకరు... '' అనే సూరప్పా... ఏటీ పిల్లడ్ని ఎండలే నిలబెట్టేనావు... పోని ఎంత నీ మిత్తరాలు మనవడయినా, కంత సల్లబడిన్నర్త అడగరాదేం ?!'' అనేసరికి తప్పుచేసినట్టు ముసిల్ది ముఖం పెట్టి, నొచ్చుకుంటూ ''పదరయ్యా పదరా... మనిషి కనబడతోటికి ఒక్కపాలి ఇదయిపోనాను... '' అంది.

నేను ముందుకు కదిలాను.

వాళ్ళు వెనుకనే వుండిపోయి అమ్మమ్మ గురించి ఏటో మాట్లాడుకుంటున్నారు.

నడుస్తుంటే మాటలు దూరమవుతున్నాయి. రోడ్డు పక్క చెఱువులో ఒక పక్క పశువులు కడుగుతుంటే మరో పక్క పిల్లలు పిల్లిమొగ్గలు వేస్తూ ఈతకొడుతున్నారు. అక్కడే పదేళ్ళ క్రితం నా బాల్యమూ ఈదులాడింది. మొలతాడు తప్ప గుడ్డలన్నీ గట్టుమీదే... ఎందుకో అడుగులు నెమ్మదించి నడుస్తున్నా నిలబడి నట్టేవుంది.

అమ్మమ్మోసారి అసిరితల్లి పండక్కి కొత్తబట్టలు తొడిగి కళ్ళంలోవున్న తాతని పిలుచ్చుకురమ్మని పంపించింది. అప్పుడు తాతయ్యకు కబురందించానో లేదోగాని వీధిగుంటలతో కలసి చెఱువుకి పరిగెత్తాను. బట్టలు ఒడ్డున తీసి చెఱువు కడుపులోకి దిగానో లేదో కుక్కోటి వచ్చి... కాళ్ళు ఎత్తుబెట్టి మరెక్కడా చోటుదొరకనట్టు... ఆ కొత్త బట్టల మీదే పోసేసింది. ఆ బట్టల్ని అలా వేసుకోలేక తడిపేసి అవి ఆరినదాక గట్టుమీదే కూర్చుంటే, ఈ లోగ పొద్దు కుంకిపోయింది. మనవడు కనిపించలేదని వంటలూ వార్పులూ వదిలేసి ఇంట్లో గగ్గోలయిపోయింది. గట్టుమీదనున్న నన్ను ఎవరో తీసుకెళ్లేదాక తప్పిపోయాననేమో ఏడుపులు, అమ్మమ్మ అన్నమూ ముట్టలేదు. అసిరితల్లి గుడికీ వెళ్లలేదు. ఆ రోజు పండగాలేదు. ఇప్పటికీ ఆ సంఘటన మరిచిపో వీలుకా దు.

'' ఏటిరో మనవడా తోవగాని తప్పిపోనావేట్రా.... మాయమ్మి మీ నాయనంత సక్కన వున్నార్రా... '' పశువులు తోలుకుపోతూ కావయ్యతాత పలుకరింపుకి సమాధానంగా తలూపేను.

'' వస్తాన్రయ్య'' వెళ్ళిపోయాడు.

చెఱువు పొడవుదాటేసరికల్లా శివుడి కోవెల, కోవెల నానుకొని రావిచెట్టు. దాని కొమ్మలు నాలుగు వైపులకు విస్తరించి వున్నాయి. అందువల్ల కోవెల గోడలు ఎప్పుడో పడిన వర్షానికి ఇంకా ఆరక జబునెక్కినట్టే వున్నాయి. కోవెల్లో గంటలు ఎప్పుడో ఒకటి మోగుతున్నాయి. కోవెల చుట్టూవున్న ప్రహరీ గోడకు బయటిపక్క ఎవరో పిడకలు చరుస్తున్నారు.

మట్టి రోడ్డు అంతమయి సన్నని వీధుల్లోకి వచ్చాను. ఎవరో పరాయి వాళ్ళొస్తున్నట్టు కుక్కలు రెండు మూడు కలసి అరుస్తూ పరిగెడుతున్నాయి.

'' ఏఁవిర బావు...''

'' ఏఁవిరయ్యా... అమ్మాలంతబాగా...''

'' మీయమ్మ రాడమేలేదు... పోని ఎంతయిన ఈ వూర్లోటే పుట్టి పెరిగింది అంత మతిలబడదురా ఊరు...''

ఆడాళ్ల ప్రశ్నలు... పలకరింపుల్లా కనిపించే పట్టి కుదిపేసే ప్రశ్నలు...

అమ్మ అప్పుడప్పుడూ అమ్మమ్మ గురించి... ఊరు గురించి చెప్తుంది. తన బాల్యం తలచుకొని చెప్పి చిన్నపిల్లలా ఏడ్చేస్తుంది. తనకి పెళ్ళయిన దగ్గర్నుంచే తల్లీ... వూరూ దూరవుంయిపోయేంయి అంటుంది. అందుకేనేమో ఏ అర్ధరాత్రి పూటో ఎవరికి

అర్థంకానట్టు ఏడ్చేస్తుంది. తను పెనిమిటి, పిల్లలు ఇందరు మధ్యావున్నా ఎవర్నో దూరం చేసుకున్నట్టు వుంటుందట. అలాంటిది కోళ్లగంప సంసారాన్ని కని ఒంటరి పక్షులయిన అమ్మమ్మకి తాతకి ఒంటరితనం తప్ప ఇంకో జబ్బులేదంటుంది. అందుకే అప్పుడప్పుడయినా వెళ్ళి చూసిరావాలంటుంది. కాని అమ్మ వంటమనిషి కాబట్టి... ఇంటి మనిషి కాబట్టి... ఊరెళ్తానంటె నాన్నతో గొడవే! అంత దీవేస్తే మీయమ్మనే వచ్చి వుండమను అంటాడు నాన్న... ' నేనెలగ వొస్తానే ముసిలోడొక్కడు' అంటుంది అమ్మమ్మ. మొత్తానికి కాలం కరిగేపోయింది. అమ్మమ్మ మట్టిలో కలిసేపోయింది.

అప్పటికీ ' అమ్మా! తాతగారి వూరు వెళ్దాం రాయేం' అంటే 'వున్నప్పుడే వెళ్ళలేకపోన్ను... ...ఇప్పుడెవులున్నారని అక్కడికెళ్తాం... ఎవులింట్ల పడుకుంటాం, ఎవులింట్ల తింటాం? ఈ ఏడాదో రెండేళ్ళయిన మీ సిన్నమాఁవ వచ్చినాడంటే ఆడు అరుగేతొక్కొద్దన్నాడు'.... ఇంకేమీ చెప్పలేక అమ్మ ఏడుస్తుంది. అప్పటికా విషయాలు ఆపెయ్యడమే మంచిదనిపించేది నాకు. ఎప్పుడైనా నేనైనా వెళ్తానంటే అవే మాటలనేది.

అలాంటిది అమ్మ ఇప్పుడు నన్ను కోరి మరీ ఊరు వెళ్ళమంది.

పలుకరింపులు... అభిమానంతో... ప్రేమతో... నిష్ఠూరంతో... పలుకరింపులు.

'' ఎంతోడివైపోనావుర... అప్పుడు మీ యమ్మని తప్ప ఎవుల్ని నమ్మోడువే కాదు....''

ఎంత జ్ఞాపకం? నిజానికి వాళ్ళంతా నాకు గుర్తు లేరు. గుర్తైరిగినట్టు నటిస్తున్నాను... అంతే!

తాతగారి ఇల్లు చేరాను. ఇంటి ముందు సాలకూలి పోయి చాలా రోజులయినట్టుంది. పెనక లేదు. ముంజూరు లేదు. జారిపోయిన సొప్పకుళ్లిపోయి పెంటకుప్పలావుంది. ఒకప్పుడు అసాలలోనే మూడు జెర్సీ ఆవులు, రెండు మేక పిల్లలు, జతపోతులు నింపుగా వుండేవి. పొదుగు దగ్గరే పచ్చిపాలు వేడంటూనే... తాగితే అడ్డు వుండీదే కాదు! ఎవరొస్తే పూటకో కోడి... ఇప్పుడు ఒక్కకోడీ లేదు... కోళ్ళ గూడూ లేదు.

ఇన్నోళ్ళు తాతగారి ఇళ్లొక్కటే వీధంతిటికీ ఎత్తుగా వుండీది. వరదలప్పుడు అంతా ఆ ఇంట్లోనే వుండేవారు. అలాంటి ఇల్లూ పల్లమయి వీధి ఎత్తయింది. అంతకంటే ఎత్తయిన ఇళ్ళూ లేచాయి. పది హన్నెండిళ్ళుదాక డాబాయో, రేకో కప్పుకున్నాయి. మిగతాః న్నీ పూరిళ్ళే.

'' ఏఁవిర జగమూ...'' మామయ్య ఇంట్లోంచి అరుగు మీదకు వస్తూ నన్ను చూస్తూనే పలుకరించాడు. చాలా ఏళ్ళకొచ్చాననేమో ఆశ్చర్యపడుతూ ఇంట్లోకి నడిచి 'ఎవరొచ్చారో చూడు' అత్తయ్యతో అన్నాడు.

'' ఏట్రట బాఁవు నువ్వే. వంశదారగాని పొంగిపోగలదు '' అది ఇకటమో

ఇన్నాళ్ళురానందుకు కోపమో నాకయితే అర్థంకాలేదు.

అత్తయ్యకాళ్ళు కడుగుకోవడానికి నీళ్ళిచ్చి, నేకడుక్కొనే లోపలే అన్నం వడ్డించింది. మామయ్య లుంగీ తెచ్చి ఇచ్చాడు. ఎవరో పోలిక పట్టలేను గానివయసులో వున్న ఒకామె కోడిగుడ్డు అట్టు పోస్తూ నా వేపు చూస్తూ పలుకరింపుగా నవ్వుతోంది.

అత్తయ్య గ్రహించిందేమో '' ఏటలాగ సూత్తావమ్మి, మీ తమ్ముడే. మీ పరం బావ పెళ్ళంరా, పెళ్ళికి రాలేదు కదా... నీకు, మీయమ్మ కేటితెలుస్తాదిలే తప్పున పడతారని మీ తమ్ముడ్ని పంపీసింది మీ యమ్మ... అంత సోబత్తు... '' అంటూ వుంటే - అప్పుడే అప్రకటిత యుద్ధమేదో ప్రారంభించినట్టు మావయ్య... '' ఇప్పుడువన్నీ ఏనికే '' అన్నాడు నాపక్కనే కూర్చుంటూ.

దించిన తల ఎత్తకుండ ఆకలికో... ఆ వాతవరణానికో ఆమ్లేటు వచ్చేసరికే సగం అన్నం తినేసాను.

'' ఏటిరో మీ బాప్పవొంట... మీ యప్పవొంట అంత బాగుందేటి'' నా వేగం చూసి మావయ్య నవ్వుతున్నాడు. ...అన్నం తిన్నాక, అమ్మనాన్నల బాగోగులు అడిగారు. తర్వాత నా ఉద్యోగం గురించి అడిగారు. ఇంకా ఉద్యోగం రానందుకు మావయ్య గవర్నమెంటుని తిడితే... బాప్పేమో ఏకంగా మంత్రుల బుర్రలే బద్దలు చేసింది. అందులో వాళ్ళ పిల్లలూ ఉద్యోగం లేక పడుతున్న బాధలూ వున్నాయి.

చాలా సేపు గడచిన తర్వాత ఆ సమయంలో ఏం చేయాలో తెలీక వచ్చినపని గుర్తుకొచ్చి ''తాతయ్యేడి '' అడిగాను.

దాంతో ఆ నిశ్శబ్దమయిన వాతావరణం మళ్ళీ బద్దలయింది.

''.... మేం పరాయి మనుష్యుల మయిపోయినాంరా మీ తాతకి. వారం పది రోజులయిన ఈ వూర్లోటే వున్నా కొడుకు గుమ్మం ఎక్కలేదు. పొరుగోలింటికి ఎళ్ళినాడుగాని మా ఇంటికి రాలేదు. అంత అచ్చేయుమయినోడికి ఏలరమ్మనాల... సెయ్యమనాల.... ? ... సెప్పిన మాట సెప్తున్నాను మీ మావనీ పిలొద్దని తాటించినాను. మా పరువుతీస్సి.... తలెత్తుకోలేకుండ సేసి తిరుగుతున్నాడు... ఈ ముసిలికాలాన ఏం పోగాలవెూ...'' అత్తయ్య నాతో మాట్లాడుతున్న వీధి చివరివరకూ వినిపించేలావుందాగొంతు.

మామయ్య తలదించుకొనే వున్నాడు.

నేనూ నోరు విప్పలేదు.

''.... అవున్రయ్యా... నువ్వే దరమం సెప్పుమీ... మీ యమ్మా ఆలయ్యనీసి అడ్డగ పడిపోతాదిగాని... .... ఏమాపెళ్ళయి ముప్పయి ఏళ్ళయిందో, ఆ దేవుడి దరమాన మీ మావకి నౌకరీ అవడం తోటి రెక్కల్ని నమ్ముకొని ఎల్లిపోనాం. రిటారుమెంటయితే ఈ వూరికి వచ్చినాం. సొంతూరు రావడమే తప్పురా?...కూతుర్ల

పెళ్ళిళ్ళు సేసి, వున్న నాలుగెకరాలు మీ మాఁవలిద్దరికీ ఆనాడే పంచేనాడు మీ తాత, తన మట్టుకి మాత్రం ఎకరా కళ్ళం మడిసెక్కా వుంచీసుకున్నాడు...'' అత్తయ్య జుత్తు రెండు చేతులతో ఎత్తి ముడివేసి మెట్టం పెట్టుకుంటూ క్షణకాలం ఆగింది.

'' ... నౌకరీవుంది మాకేనికి... మావాటాకొచ్చిన రెండెకరాల పంటా ఎంతపండనీ పిడికిడి గింజలు పట్టికెళ్ళిందేనాడు లేదు... అప్పుడు సిన్నకొడుకు మంచోడు అందరికి. మాకూ కుటవాఁము పెరిగి ఒక్క మనిషీ రెక్కలూ అలసిపోయి ఈ వూరొచ్చాం... ఇన్నాలు... ఈ ముప్పై ఏళయిన పంటంతా ముసిలోడికే వదిలేనాం కదా... ఆ ఇసోసమూ లేదురా మీ తాతకి, నువ్వే లెక్కలు కట్టు... ఇన్నాల పలసాయం ఆ ముసిలోడి ఎకరాపాటి సెయ్యకపోతాదా? అందుకే వమా వాటాతోటి ముసిలోడి ఎకరా అడిగినాం తప్పయిపోయింది. ఆ ఎకరా పంటా తిన్నాం తప్పయిపోయింది. పరాయోళ్లం కదరా? మీ యమ్మమ్మ మీ సిన్నమాఁవని కనలేదు కదరా? మారటోడేమి నా మొగుడు? మీ పెద్దమాఁవ తెలివితేటలు ఈ మనిషికి లేపోనాయి, లేకపోతే ఆలన్నలాగే ఏడాదికింత ఎనకేసుకుంటే అనగూడదు ఈ ఎకరా ఒక ఈక... మాదినాలు బాగులేవు. మారాతలు బాగులేవు....'' అత్తయ్య రెండు చేతులూ తలకు ఆన్చిగోడకు చేరగిలబడిపోయింది. తడిచిన కళ్ళు రెండూ తుడుచుకుంది. ముక్కు తుడుచుకుంది. గ్లాసుడు మంచినీళ్ళు తాగింది. అక్కడ్నుంచి లేచి విసవిసా పెరడ్లోకి వెళ్ళిపోయింది.

మామయ్యింకా మవునం పట్టేవున్నాడు.

''మీ రన్నాలు తినండి....'' మామయ్య నుద్దేశించి అన్నాను. రెండు క్షణాలాగి మావయ్య అన్నాడు...

'' ఇదే తగువు మీయమ్మకీ మాకూ.... పిల్లలు మీరూ అవే పట్టింపులుకి పోతున్నారు... మీ బావలైనా, అందుకే వచ్చీపోవడాలు లేవు. అన్నీ మరిచిపోయి ఈ పండగ నాల్రోజులు సరదాగుండు...''

మామయ్య వంటగదిలోకి వెళ్ళి కంచం ముందల కూర్చుంటే, నేను నులకమంచం మీద చీరవేసుకు పడుకున్నాను. వచ్చిన పని గుర్తుకువచ్చింది. 'తాతయ్య పండగపూట ఆలింట ఈలింట తినడమేటి? పండక్కి ఇక్కడకు తీసుకురా' అంది అమ్మ. నేను తాతయ్య మామ్మలకు ఇష్టమైన ముద్దుల మనవడ్నని... నేనయితేనే తీసుకురాగలనని అమ్మ నమ్మకముంచి పంపించింది. పని గుర్తుకురావడంతో లేచి అరుగుమీదకు వెళ్ళాను.

అప్పుడే సూరప్ప 'మనవడా' అంటూ వచ్చింది. 'మా ఇంటికి రావా...' అని నా చెయ్యి పట్టుకు వాళ్ళింటికి తీసుకువెళ్ళింది. 'సల్ల బడ్డావు కావ... కంచేపు కూసో' అంటూ గోనె పరచింది. దాని మీద చీరముక్క చిరుగులది మడిచి కూర్చోమంది. వద్దంటున్నా 'సీనీ నీళ్ళే... టీకి పాల్లేవు' సంజాయిషితోనే బలవంతపెట్టి, తాగినదాక ఊరుకోలేదు.

నాకళ్ళు ఇంట్లో ఎవర్నో వెతుకుతున్నాయి.

అక్కడికి ఓ పద్నాలుగేళ్లుంటాయేమో ఓ పిల్ల వస్తూ 'అమ్మమ్మా' అంటూ సూరప్పకి ఏదో చెప్పబోయినదల్లా ఆగిపోయింది నన్ను చూసి.

''మీ బావే'' అని నావంక తిరిగి 'మరిసి పోనావేట్రాయ్యా మీ జానకత్త కూతురు నచ్చిమి, సిన్నప్పుడు నువ్వెత్తుకుంతే ఏడ్చేదేకాదు... అంత సనువు నీకాడ' సూరప్ప మాటలకి ఆ పిల్ల మరింత తలదించుకుంది, సిగ్గుపడ్తోందేమోమరి.

''పలకరించినావా గుంటకాన...''సూరప్ప ఆ పిల్లని దెబ్బలాడింది.

''చాలా సంవత్సరాలయింది కదా....'' అంతకంటే ఏమనాలో తెలీదు నాకు.

సూరప్ప ఒక్క క్షణం ఏదో ఆలోచనలో పడినట్లు ముఖం పెట్టి ''మీ యమ్మమ్మ బతికున్నప్పుడు అనీది. ఓలే మిత్తనోరొదినా!... నా కూతురు కొడుక్కి నీ కూతురు కూతురికి ముడెట్టాలని... అదెళ్ళిపోయింది. నా నేస్తం అన్నాదని అన్నానుగాని. నువ్వు సదువుకున్నోడివి. ఇది పేడతట్ట... సూడు ఓ మర్యాద మన్ననా తెలికుండ ఎలగ గెడకర్రలాగ నిల్చోంది..'' అంటున్న ఆ మాటలకు ఆ పిల్ల సిగ్గెగిరిపోయినట్టుంది. కోపంతో లోపలిగదిలోకి వెళ్ళిపోయింది.

మళ్ళీ సూరప్పే అంది... ''దాన్దేటి తప్పు, దాని కరమ్మ, ఆలమ్మ పాపమూ ఎక్కువైపోనాయి...''

అప్పుడే నేవెదుకులాడుతున్న జానకత్త వచ్చింది. వచ్చి చూసి పలకరింపుతో ఆగ లేదు. పక్కనే వచ్చి కూర్చుంది. నా రెండు చేతులూ పట్టుకుంది. నా తలమీద చెయ్యివేసి నిమిరింది. భుజంమీద పాకుతున్న చీమని తీసి కసితీరా చంపింది. మళ్లీ లేచి పంచదార నీళ్ళు కలిపివ్వబోయింది. సూరప్ప 'నాను ముందలే ఇచ్చినాను' అనేసరికిగాని ఆగలేదు.

'' ఎంతోడివి అయిపోనావురా బడవా''... ఇంకా చిన్నపిల్లాడ్నే అయినట్టు ఆ మాటలూ చేష్టలూ కనిపిస్తున్నాయి. ఆశ్చర్యంగా నా కళ్ళలోకి చూస్తోంది.

నిజానికి ఆశ్చర్యం నాకు కలగాలి. లేకపోతే జానకత్త జానకత్తేనా అని? ఈ ఆరేడేళ్లలోనే ఇరవై సంవత్సరాల వయసు ఎక్కువ పడినట్టుంది. అమ్మకంటే చాలా చిన్నది. పెద్ద అన్నయ్యకంటే నాలుగేళ్ల పెద్ద... అలాంటి జానకికి అప్పటిలా జాకట్టులేదు. జాకట్టు అవసరమూలేదు. గుండెలు ఎండిపోయున్నాయి... నా కళ్లలో ఓసారి ధూళి పడితే... ఎగర బోతులప్పుడే అనుకుంటాను. అప్పుడు లచ్చి నెలల పిల్ల... నా తలని ఒడిలో పెట్టుకొని రెండుచేతులూ కలపినా పట్టని రొమ్ముని పిండితే... తెలిసీ తెలియని సిగ్గుతో కళ్ళు మూసుకుంటే... ..''పాలు నోట్ల పొయ్యాల్రా గుంటడా' అని తిట్టి; 'ఓలమ్మో పెద్ద మగోడికి సిగ్గు' అని నవ్వి, కళ్ళలో పాలుపోసిన జానకి.... ' ఓలగుంటా మగోడిలా ఏటా బలుపు' అని వరసైనోళ్ల చేత తిట్లుకాసిన జానకి...

ఇప్పుడారూపాన్ని చూస్తుంటే గుండె బరువైంది. చెఱువైంది.

కళ్ళలో నీళ్ళొకటే తక్కువ. .

అయినా ఇంకా స్వచ్ఛంగా నవ్వుతోందే?!

'' ఏ(ట్రలగ సూత్తన్నవు... పిచ్చి గుంటడా...'' జానకత్త తిడుతోంది. నవ్వుతూ తిడుతోంది. ఆ నవ్వులో మునపటిలా చెక్కిళ్ళు ఎరుపుదనంలేదు... దగ్గరికి తీసుకొని ముద్దులాడాలనీలేదు. ఆనవ్వులో సక్కిదవడలు... లోతులకు పోయిన కళ్ళు ఎక్కువసేపు చూడలేకపోయాను.

సూరప్ప ఎలా గ్రహించిందో గాని ''మీ మావ పోయాక మనిషిని ఏటి సుత్తావయ్యా... ఎముకల కంపే, నా కన్న ముసిలయిపోయింది నా కూతురు'' అంది ఏదో జ్ఞాపకాన్ని నెమరు వేసుకుంటున్నట్టు.

జానకత్త ఇదేమి పట్టించుకున్నట్టులేదు. నాకు జున్నంటే చాలా ఇష్టమని, ఎవరిదో ఆవు ఈనిందని జున్నుపాలు తీసుకువస్తానని, వుండమని పరుగుతీసింది.

ఆ తరువాత సూరప్పే చెప్పింది. జానకి మొగుడు దాలిగాడు మామూలు చావు చావలేదట. బలివిన చచ్చిపోయాడట. కాదు బలివిన చంపేసినారట. ఎలక్షన్లప్పుడు కూలికి బేనరుగుడ్డలు కడుతుంటే కాలు జారిమేడమీదనుండి పడిపోయాడని పుట్టించేరట, కాని నిజానికి ఎగస్పార్టీవోళ్ళు వంగి బేనరు కడుతున్న దాలిగాడిని వెనుక నుంచి వచ్చి రెండుకాళ్ళూ ఎత్తేస్తే మనిషి ముందుకు తూలి పడి తలకిందకు గుద్దుకొని బుక్కెడు రక్తం కక్కి చచ్చిపోయేడట.

సూరప్ప ఏడ్చేస్తోంది. ఎలా ఆమెను సముదాయించాలో నాకు తెలీలే. జానకత్త కూతురే వచ్చి... '' ఊరుకోయేం... అవెమ్మేస్తే మంళ్ళా ఏడుంపులుం... నువ్వూరుకోమంతే...'' ఓదార్చుతోంది. ఇందాకటి కోపం ఎగిరిపోయినట్టుంది.

కొంచెం సేపటికి సూరప్ప కుదిటపడి, కళ్ళు తుడుచుకుంటూ 'మీ తాతని కలిసినావురా?'' అడిగింది. లేదని విషయంచెప్పారు. ఎటెల్లాడో అంది సూరప్ప. నరసన్న పేట బస్సు ఎక్కినాడని సూరప్ప మనవరాలు తను చూసినట్టు చెప్పింది.

''పేడరీ బావు దగ్గరికే ఎల్లుంతాడు... అంతకు మించి ఓడల వర్తకమేటాడికి..?'' అంటూ ఏదో చెప్పబోయింది.. ఇంతలో పరం బావ వచ్చాడు. వస్తూనే 'వచ్చిపూటే కాలేదు ముగ్గులేసేస్తున్నావా?...' నవ్వుతూ అడిగాడు. సాయంత్రంమవుతోంది కళ్ళంవేపు వెళ్ళి అలా తిరిగొద్దామన్నాడు.

మళ్ళీ వస్తానని నేనే లేచి నిలబడ్డాను.

''వుండు... మాయమ్మొచ్చేస్తాది... జున్నుపాలు కెళ్ళింది ఎంచేపు?'' జానకత్త కూతురు నాతో చెప్తున్నా, సూరప్పవైపే నువ్వన్నా చెప్పన్నట్టు చూస్తోంది.

'' ఎక్కడికెళిపోతాడే మీ బావ.... వుంటాడు, తింటాడు...'' అభయమిచ్చినట్టు అన్నీ చెప్పేసి కళ్ళానికి తీసుకుపోయాడు. అక్కడ నూర్పులూ కుప్పలూ పనిలో

వుంటే ఇక్కడ కాదని ఏటివేపు పదమన్నాడు. దారిమధ్యలో ఒకటి రెండు ప్రశ్నలు ఇంటి గురించి వేసి ఆతరువాత చూసిన సినిమాల గురించి అడిగాడు.

ఏట్లోకి దిగి ఇసుక మేటమీద కూర్చున్నాక అసలు విషయం మొదలు పెట్టాడు.

తనకి పెళ్ళయినా, ఇద్దరు పిల్లలు కలిగినా ఉద్యోగం లేకనే ఇంకా చదువని యూనివర్శిటీ పట్టుకు వేలాడుతున్నానన్నాడు. నిజానికి చదువుమీద ఇంటరెస్టే లేదన్నాడు. చదువంతా కాకపోయినా పనికిరాని సిలబస్సే పాఠ్యపుస్తకాల్లో ఎక్కువన్నాడు. రెండు పేజీలు, ఒక ప్రొఫెషినల్ కోర్సు వెలగబెట్టిన తన డిగ్రీల కొలతలు చెప్పాడు. పెళ్ళొద్దన్నా వాళ్ళ నాన్న ఒప్పుకోలేదట. పిల్లలు వద్దనుకున్నా పుట్టేరట. ఒక అబార్షన్ కూడా జరిగిందన్నాడు. తిరిగి తిరిగి ఈవూరే వచ్చేసాడట. చివరిగా చెప్పిందేవిటంటే తన 'వాటా' ఎంతయితే అంత... అరెకరాయో... అరవై సెంట్లో ఇచ్చేస్తే... అమ్ముకొని వ్యాపారం చేద్దామని వుందన్నాడు. తన వాటాకోసమే తనింకా ఆ ఇంట్లో వున్నాననీ అన్నాడు.

తరువాత ఏరువిడిచి పొలాల వెంబడి వస్తుంటే ప్రతి గట్టూ మట్టినేకాదు మనుషుల్నీ వేరు చేస్తున్నట్టు తోచింది. తాతయ్య, మావయ్యా, పరంబావ రేపువాడి పిల్లల పిల్లలూ చెరోగట్టయి చేతులూపుతున్నట్టనిపించింది.

నా మవునంవాడికి ఎలా తోచిందో గాని ఇంటికి వెళ్ళిందాక ఇంకేమీ మాట్లాడలేదు. ఇల్లు చేరేసరికి పూర్తి చీకటయింది. అత్తయ్య అన్నం వడ్డించేస్తానని అంది. నాకు ఆకలిగా లేదు. అసంతృప్తిగా వుంది. నా మవునం అత్త అంగీకారంగా తీసుకొని పరం బావకు నాకు ఒకేసారి వడ్డించింది. పరం తరువాత వాళ్ళిద్దరికీ శివం, విశ్వంకీ తరువాత వడ్డిస్తానంది.

కరెంటు వున్నా లేనట్టే వుంది. ఓల్టేజి తక్కువగా వుంది. ఫేను వేస్తే గూట్లో దీపం కూడా ఆరిపోదేమో.

జానకత్త అప్పటికీ రెండుమూడు దపాలు వచ్చి నాకోసం అడిగి వెళ్ళిందట. భోంచేసాకయినా వెళ్ళాలనుకున్నాను. కాని తాతయ్య తవుడు మావ వాళ్ళింట్ల వున్నాడని తెలిసి నోట్లోనీలు పుక్కిలిస్తూనే వీధిలోకి నడిచాను. జానకత్త ఇంటికి వెళ్తే ఆలస్యమవుతుందని తరువాత రేపు వెళ్ళొచ్చనీ నిర్ణయించుకున్నాను.

తవుడు మావ ఇంటికి వెళ్తే... ''వోరిప్పుడే మీ తాత అల్లాడెళ్తానని... నువ్వాగోల్లో తిరిగుంటావు.. ఎలిపోండు.. వచ్చేస్తాడు కూకో...'' అంటూ కుర్చీ చూపితే కూర్చున్నాను.

తవుడు మావ నులకమంచంలో మేనువాల్చి ఇంటిపేరుతో పెట్టి వరసలు కలిపి ఇకటాలు ఆడి, అత్తగురించి అడిగితే - వాళ్ళ కొడుకత్తోరు గురించి చెప్పి అక్కడికి వెళ్ళిందని చెప్పాడు.

తవుడు మావకు ఒక్కడే కొడుకు! నా వయసేవుంటుంది. అప్పుడే ఇద్దరు పిల్లలు

కూడా! అందుకేనేమో ' నీవెప్పుడు సేసుకుంతావురా' అంటూ 'పప్పుకూడు పెట్టమని నోరుపోయిందని అంటున్నాడు.'

వంచి సంబంధం చూడవుని... అందం కొరుక్కుంటావా అని... నాలుగడబ్బులుంటే వున్న నాలోజులూ హాయిగా గడిపేసి పోవచ్చుననీ అన్నాడు. అందుకేనట ఒక్క కొడుకని చూడకుండా ఇల్లరికం పంపించేసాడట. అత్తోరు వున్నా పోయినా అల్లుడుదే ' ఆస్తి!' ధైర్యంగా నమ్మకంగా చెప్పేడు.

ఆస్తి.... ఆస్తి.... ఆస్తి....

తరువాత తవుడు మామతో నేనేమీ మాట్లాడలేకపోయాను. ఆయనకీ కునుకు పట్టేసినట్టుంది.

తాతయ్య వచ్చాడు.

చూపు సరీగ ఆనినట్టు లేదు... దగ్గరగా వచ్చి చూస్తేగాని పోల్చుకోలేక పోయాడు.. అందుకు తన కళ్ళని తిట్టుకొని ఇంటందరి బాగోగుల్ని అడిగాడు. డబ్బు అవసరం వుండి అల్లాడ వెళ్ళాడట. రేపు పెందిలే మళ్ళీవెళ్ళాలన్నాడు. నన్ను కూడా రమ్మన్నాడు. రేపు అంబారంకి ఇచ్చిన రైతుతో తగువుందన్నాడు. తేలిపోతుందన్నాడు. నువ్వు లాయరీ ఎందుకు చదువుకోలేదన్నాడు. ఏ చదువు చదివినా బ్రతుకులేదన్నాడు.

' ఇవన్నీ గొడవ లెందుకు? ఇంటికి పోదాం పద...' అని నేను అన్నిమాటల తర్వాత కూడా ధైర్యం చేసి అనలేకపోయాను.

అలా అనలేకపోవడానికి, అడగలేక పోవడానికీ కారణం వుంది. అమ్మ నాన్నకు భార్య! పెళ్ళితోనే ఇంటిపేరు మార్చుకుంది కదా... ఇప్పుడు ఫలానా వాడి కూతురెలా అవుతుంది. కూతురుకానిది తండ్రిని పెంచుకుంటుందా? ఎన్నాళ్ళు? అయినా ఆస్తి కొడుకులదయినప్పుడు పెంపకపు బాధ్యతా కొడుకులదే... కూతురు ఒకింటి కోడలు!... ఆమెకు తన తల్లిదండ్రులను పెంచుకొనే బాధ్యత లేదు. ఇవన్నీ నాన్నమాటలు కావు. అమ్మ మాటలు కావు.. లోకం నన్నే తిట్టిపోస్తుందని అమ్మ అంటుంది. అందరూ కూతుర్లే పుడితే అడుక్కోవాలా అంటే "రివాజు" అంటుంది.

వలస పక్షి తాతయ్య ఇంటిదగ్గర చేసే మూణ్నాళ్ల భసా రసాబాసగా వుంటుంది. ''ఊరమ్మ కొడుకు మంచోడైగాని... ఇదేట్రా ఇడ్డూరం... లోకంలో కొడుకుల్లేరా?...'' అమ్మ ఆర్థిక ఇరుకు బాట్ల మధ్య దెబ్బ తగలకుండా, నువ్వేనని నాన్నచేత వేలెత్తి చూపించుకోకుండా భయమో... ముందుచూపో... అమ్మకూడా...??

''పండక్కి రమ్మందామన్నా, పండగ తర్వాతో...?...'' ఈగడువులు నేను గొంతు విప్పలేకుండా గడియపెట్టాయి.

తాతయ్య నన్ను పడుకోమన్నాడు. చాప పరచి బొంతవేసాడు. తవుడు మామ మంచం మీదకి వచ్చీమన్నా, పరవాలేదన్నాడు.

నేను పడుకుంటే నా పక్కనే కూర్చున్నాడు. అర్ధరాత్రి అవుతున్నా దీర్ఘాలోచనలో వున్న తాతయ్యని చూస్తే నాకూ నిద్రరాలేదు. అలా ఎంతసేపు గడిచిందో గాని తెల్లవారి కళ్ళువిప్పి చూస్తే తాతయ్య రడీగా వున్నాడు. బయల్దేరని నా చేతికో పలకర్ర పుల్లిచ్చి, దార్లో నోరు కడుక్కుందువులే అన్నాడు. నా మాట కోసం చూడకుండా గుమ్మం దిగితే నేనూ వెనకాలే నడిచాను.

దారి మధ్యలో బోరింగు దగ్గర నోరు కడుక్కొని టూరింగు టాకీసు పాకదగ్గర 'టీ' లు తాగేం. ఎవరెవరో తాతయ్యని పలుకరిస్తున్నారు. నన్ను గురించి అడుగుతున్నారు. తాతయ్య మాత్రం 'నా పెద్దకూతుర్రెండో కొడుకు' అని నాగురించి తెలిసినవి తెలియనవీ చెప్తున్నాడు.

మరో గంటకల్లా ఆవూరు చేరాం.

తాతయ్య ముందుగా ఎవరో షరాబులింటికి తీసుకువెళ్ళాడం. చేతికి వున్న ఒక్క వుంగరం తీసి ఇస్తే - ఆపెట్టె ముందున్నాయన లేవకుండానే అందుకుని గీటు పెట్టి అద్దాలు కదిపి చూసి, ఇటూ అటూ తిప్పి ''పాత బంగారం రేటు తక్కువే'' అన్నాడు. లెక్క చూసీమంటావా? అని పాత చిట్టాపద్దులు తీసి పన్నెండొందలు పాతవి... మొన్న లాయరుకని నాలుగొందలు... ఇప్పుడు నాలుగొందలిస్తాను... రెండువేలయిపోతాది...'' అన్నాడు. తాతయ్య తలవూపి ఇచ్చిన నాలుగువందనోట్లూ రెండుసార్లు లెక్క పెట్టాడు.

'' ఎళ్లొస్తాం రయ్యా...'' తాతయ్య అరుగుదిగుతూ అన్నాడు.

'' ఎళ్లొస్తాం అనకురా పెద్దాయన, ఆస్పెట్లికి... అప్పుకీ... ఎళ్ళొస్తాం అనకూడదు, ఎల్తాం అనాల...'' నవ్వుతూ అన్నాడు.

ఆ మాటెందుకో నాకు నిజమనిపించింది. మళ్ళీ తిరిగి వచ్చే ప్రసక్తి లేదు. ఉంగరం విడిపించే శక్తీ లేదు. ఎన్ని వస్తువులలా రెక్కలు రాకుండానే ఎగిరిపోయాయో తెలీదు.

''తాతయ్య...'' చెప్పబోయాను.

'' ఆకలేస్తుందా? టిఫినీ సేస్తావా...'' తాతయ్యే తిరిగి ప్రశ్నిస్తే అడ్డంగా తలవూపి చేతకానివాడనయాను.

తాతయ్య నన్ను అర్థం చేసుకున్నట్టున్నాడు. ' పనయిపోనియ్యిరా ఆతర్త నీకే తెలుస్తాది? నువ్వే సిచ్చేద్దుగాని గాని...' తాతయ్యమాటలు నన్ను మూగవాణ్ణి చేశాయి.

వీధి చివరకు వచ్చేసరికి పల్చగా చెట్టుకింద చేరివున్న జనం మమ్మల్ని చూస్తూనే... ''అదిగో అప్పన్నా వచ్చేండు...'' కేక ఎవరిదో.

'' ఏవిర మాకు పనులూ పాకుల్లేవనుకుంతన్నావా... రా.. రా...' ఎవరో ఓ ముసలాయన పంచె చివర ఎత్తి దోపుకుంటూవున్నాడు. పక్కనే చిన్న మావ, పరం బావ వున్నారు. వారిని చూడ్డంతో నేనేదో తప్పు చేస్తున్నట్టుగ ఒక్క క్షణం చూపు మరల్చి, మళ్ళీ మామూలయేను.

''అదీ మీ అయ్యా వచ్చేసాడు, అదరా ఆ తివ్వడూ వున్నాడు తేల్చేసుకోండి, మొకా మొకాలు'' మరో పెద్దాయనమాట.

అందరూ చుట్టూ మూగారు.

ముందుగా తివ్వడే నోరు విప్పాడు.

''పెద్దలింత మందున్నారు, మీరెలాగ సెప్తే అలాగే సేత్తాను. ఆలంబారం నాను గుత్తపట్టలేదు. నువ్వే సెయ్యి అనీ కండుగుత్త ఆలకీనేదు. ఏదో సిన్న రైతుని అంబారం అంటే ఆశపడి పట్టినాను. ఆ ముసిలోడికి ఎంతో కొంత నలుగుర్లాగే గింజలు కొలిసీవోడ్ని.. ఇదిగో ఆలసిన్నబాబు ఆదిగాడొచ్చి అది నా బూమి, ఆ గింజలేవో నాకే సెందాలన్నాడు. తండ్రీ కొడుకులేకదా అలగేనన్నాను. ఆలయ్యని... అగోటి.. ఆ అప్పన్నని ' ఇలాగంతన్నాడు నీకొడుకన్నాను.' ఎవుడ్నీకు అంబారం కిచ్చినాడు... ఎవుడికి నీవు గింజలు ఇచ్చేత్తావురా అని ఇతగాడు. అది నా బూమి నాకే సెందాల.. ఎలగివ్వో సుత్తాననీ అతగాడు. ఈ ఇద్దరితోటి బిజారు పడలేకే ఎవులికీ ఇవ్వలే....

''తివ్వా నీకేటి తిపారమా?... ఆడి వాటాకి రెండకరాలకీ రెండు గింజలయినా ఇవ్వొద్దు... నా ఎకరాకి నాకు కొలు...'' తాతయ్య మాటను చిన్న మామ అడ్డు తగిలాడు.

''... మొత్తం గింజలు నాకే కొలు, ఇన్నాళయిన నానొక్క గింజ నావాటా రెండెకరాల్లోదయినా తీసికెళ్ళినానా?... ముట్టినానా....''

''నీ కెవుడు తీసికెళ్ళొద్దన్నాడురా...'' తాతయ్యగొంతు పెరిగింది.

మావయ్య, తాతయ్యల వాగ్యుద్ధం పెరిగేదే '' ఆగండేస్... మీరే తేల్చుకుంటే మావుదేనికి గుడ్డామెట్టడానికి...'' కసిరాడో ముసలాయన. ఇద్దరూ నోర్లుమూసారు.

అంతట్లోనే తివ్వడు నోరిప్పాడు... '' ఈల్లో ఎవ్వలికిచ్చినా సికాకే,'' చెప్పబోయాడు. 'అయితే మరేనికి నువ్వుంచీసుకోరా' మరో ఆయన కల్పించుకొనే సరికి అంతా నవ్వేసారు.

మళ్ళీ నిశ్శబ్దం గూడుకట్టుకుంది.

తలపండిన ముసిలాయనొకతను తీర్పు చెపుతున్నట్టు గొంతు సరిచేసుకొని... ''రేపేదొచ్చినా తండ్రీకొడుకులు మీరే ఒకటవుతారు. మీమంతా పయే. ఇందల యెవడికి ఏలూమాలు వచ్చిపడిపోవు, ఆటితోటే బతికీరు. అప్పన్న ఆస్తి మూడోటాలేసి, కొడుకులకి రెండోటాలిచ్చి... మిగిలిన దాన్తోటి ఇద్దరాడ కూతుర్లికి పెళ్ళిళ్ళు సేసి ఎకరామిగిల్చుకున్నాడు. ఆడు సచ్చిపోక ముందే ఏనికి వాటాలేసేనాడో...'' పూర్తికాలేదు.

తాతయ్య అందుకున్నాడు... ''పెళ్లిళ్ళయితోటికి ఎవుడి తుంబాదుడ్డా ఒట్టుకోని ఆలే ఎలిపోన్రుగాని, రేపు నీనెప్పుడు గుట్టుక్కుమనీస్తే బూమి కోసం... మడిసెక్కకోసం-తలలు సెక్కలు సేసుకుంతారు. అనీసి ఇదిపడ్డానుగాని నేపోతే ఇప్పుడు నాతల

సెక్కలయినట్టుగున్నాది...''

'' ఏ పిల్ల ఇంటిదగ్గరో గడిపేస్తన్నావు గదరా కాలం, మరేనికిరా నీకి బూమి? మెడకి మెలేసుకుంతావేటి?'' మామయ్య పక్కనే వున్న మనిషి ఎవరో తాతయ్యని అడిగాడు.

తాతయ్య ఆప్రశ్నకు సమాధానం చాలాసేపు చెప్పలేకపోయాడు. ముఖంలో రంగూ, పెదవి విప్పాక గొంతూ మారిపోయాయి.

''... నాకళ్ళం మడి ఎకరా సెక్కని అంబారం ఎన్ని గరిసలత్తాయో మీకు తెల్దా? ఆ గింజలే... నాకు సేర్జీలకీ.. మందులకీ మాకులకీ... కడకి ముసిల్దానికి నీరట సీరెట్టడానికీ... నా సుట్ట పీకలకీ...'' తాతయ్య ఆగి చుట్టూ చూసి, నేల్లోకి కళ్ళు గుచ్చి '' నీ నున్నంతకాలం నా కిందరయిపాయాలు పడిపోనామనీసి సెప్పుకుంతారు గాని మొన్న పచ్చవాతమొచ్చి కాలూసెయ్యీ రాకపోతే నా డబ్బులున్నంతవరకే నాకు ఆస్పెట్లకి తిప్పినారు. తర్త సరి. జబ్బు మాటపోని వున్నీ, కూరలకి డబ్బుల నన్నిడిగీవోరు... ఇస్తే మంచి ఆపూటకి గైబుచ్చుకెళ్ళోరు...లేదూ అంతే గతివూలినోడ్ని... శనిలాగా దాపురించినాని తిట్లూ తగువులు...'' ఇంకా ఏదో గుండెల్లో కెలుకుతున్నా చెప్పడానికి ఇష్టంలేనట్లు ఆగిపోయాడు.

చిన్నమావ పక్క నిల్చున్న ఇందాకటాయనే మళ్ళీ అన్నాడు. '' నీ బాదలు నీకున్నాయిరా, కాదన్ను, మరి ఆదిగోడు ఆడిపంట వదిలేసాను ఇన్నాలయిన అంతన్నాడు ఆడినోట్ల మట్టిగొడతావురా...''

తాతయ్య కూడా నిష్ఠూరంగానే సమాధానమిచ్చాడు.. '' నా సిన్నకొడుకు తల్లీదండ్రీ ఎలగున్నారో... అని తొంగిసూసి ఒంగోలకయినా, పంతాలకో... పట్టింపులకో... ఎక్కడో వుజ్జోగంలో వుండి యవసాయం సెయ్యలేకో ఒగ్గేనాడు.. వగ్గీస్తే.. ఆ మన్ను అన్నమయిపోతాదిరా? ఆ మట్టిలో సెమటపిండాల. పిండుదుమన్నా ఒక్కాదుక్కీ...? తిండికి లేకపోయినా ఇత్తనాలకి ముందలే దేవుడి ముడుపులా తీసీసినా గుండా పిండీ...? ఎరువులు కొనడాకి ఇల్లు తనకాల ఎట్టినా మీవూరోలుకాడే. వంశధార ఏటికాలువ ఎవలకి అందతంది? గూడెయ్యడాకి సెత్తిలేదు, మోటారు పెట్టించడానికి సెత్తిలేదు.... ఇంకేటి సేద్దమని ఒకదండమెట్టేసి అంబారింకి ఒగ్గీసిన. అందన్నిపుట్లు తిని బలిసినానో సూడండి...'' తాతయ్య ఆరిపోయిన గుండెల్ని బాదుకున్నాడు.

మళ్ళీ తిరిగి తనే అన్నాడు.

''నా బూమికి నాకొడుకే బాగారయిపోయినాడు గానీ ఆడిపెళ్ళికి నాల్తులాల బంగారం పెట్టినప్పుడు. ...ముసిల్ది సచ్చిపోయిన ముందటేడు సేరు దిగిందంతే సేరాపరేసనుకి... కొడుకుని కళ్ళు బాగోలేవంటే తీసికెళ్ళిన పదేలుకి అప్పు నాను తీర్చినాను. ఎవులు ఎవులుకు

బాకో సెప్పండి? యవసాయం యాపారం అనుకుంతే ఏడాదయిన ఆడూసూడ్డం లేదా?...'' కళ్ళలో తిరుగుతున్న నీటిని తువ్వాలుతో అద్దుకున్నాడు.

కొద్దిసేపు గడిచాక...

''వంరేనికి తగువులుగాని, ఆదిగాడు ఆడి రెండెకరాలు ఆడు ఎలగా దునప్పకుంతండు, అప్పన్నా! నీ ఎకరామీద ఎంతపండితే అది తండ్రీ కొడుకులిద్దర్దీనూ...'' పెద్దమనిషి మాటకు చిన్న మామయ్య తాత్తు అంటూ ఎగిరిపడ్డాడు.

''నీను ఒక్క గింజొదల్ను.... సగం గిగం లేదు లేదు, ఆ ఎకరా నాదే. నా నోట్ల మట్టిగొట్టొద్దు... నీ నూరుకోను, ఆడు ఎలగా కోర్టు ఎక్కుతుండు, కోర్టులే కలుసుకుందాం...'' కోపంతో మామయ్య కదలబోయాడు.

''అవున్రా... నీ మాట నీదీగాని, ముసిలోడు ఎన్నాలు బతకాలిరా?''

''ఆడు ఎప్పుడు సత్తాడో?'' (ఆది) చిన్నమామయ్య కోపంగా అరిచాడు.

'' ఇదరా వచ్చి సంపీరా... సంపీ...'' తాతయ్య అరుచుకుంటూ వెళ్ళి మామయ్య రెండు చేతూలూ తీసుకొని తన మెడమీద వేసుకొని... ''నీ చెతుల్తోటి నువ్వే పిసికీ...'' అది దుఃఖమో, బాధో, ఏడుపో మరి...

నేను తాతయ్యను పక్కకు లాగాను.

పరంబావ మామయ్యను అక్కడి నుంచి తీసుకెళ్ళాడు.

అంబారం(కౌలు) తివ్వడుకి ధైర్యం వచ్చినట్టుగుంది. ''ఆలు తండ్రీ కొడుకులు కోపంల వున్నారు. ఆలిద్దరూ ఒప్పొదానమై ఏటి ెయ్యమంతే అదే సేద్దును. ఇప్పుడంతే వుడుకు మీదున్నారు. సల్లబడి కబురు పెడితే నానే గింజలు పంపేత్తాను. ఇవులింట్లలేదు. మంటిపొయ్యిగాని, ఈదిలపడిపోడమేనికి?'' అంబారం పంట తనవద్దనేవుంటున్నదనడంలో ధైర్యంకంటే ధీమాయే నాకగుపించింది.

ఎవ్వరూ ముగింపు వాక్యం పలకక పోవడంతో తివ్విడిమాటే తిరుగులేనిదిగా వుంది. చిన్నమావయ్య, పరం బావ వెళ్లిపోతున్నారు. జనం ఒక్కరొక్కరు కదుల్తూ పల్చబడుతున్నారు.

ఇందాక పెద్దగా వ్యవహరించిన ఒకాయన మా దగ్గరికి వచ్చి ''... ఒరే అప్పన్నా! తల మీదకొచ్చింది ఎండ, పకాలన్నంకూడా తినలేదుగల్ల... ఎల్లి సల్లబడు..'' అన్నాడే గాని ఊహించినట్టు తగువు గురించి మాట మాత్రానికయినా ఎత్తలేదు. ఏదో చెప్పాలని చెప్పలేకపోతున్నట్టుగా వున్నాడు.

''పద తాతయ్యా'' నేనూ బలవంతం చేసాను. నిస్సత్తువుగా తాతయ్య కదిలేడు. చోడవరం ఊర్లోకి వెళ్ళే ఒకేరోడ్డులో మావయ్య, పరం బావ ముందు నడుస్తుంటే... తాతయ్య, నేనూ వెనక నడుస్తున్నాం. దార్లో మావయ్య, తాతయ్య మాట్లాడుకోలేదు.

పరం బావ కూడా ఏమీ నాతోనయినా మాట్లాడలేదు. కళ్ళతో పలుకరించినా ఫలితం లేదు.

ఊరొచ్చింది. దార్లు వేరయ్యాయి. నేను తాతయ్యవెంట తవుడు మావ ఇంటికి వెళ్ళాను. తవుడు మావ ఇల్లరికం వున్న కొడుకుదగ్గరికి వెళ్తున్నాడట. ఇల్లు జాగర్త అని చెప్పి వెళ్ళాడు. తాతయ్యే ఆ పూట వరిగట్టితో బియ్యం పొంగించాడు. చింతపండు పిడిచి చారుచేసాడు. అప్పడం కాల్చి ఇచ్చి, అన్నం వడ్డించాడు. తనో కంచంలో వేసుకున్నాడు.

తింటున్నప్పుడు 'అమ్మ నిన్ను తీసుకొని రమ్మంది' అన్నాను.

సమాధానం లేదు.

' ఎప్పుడు బయల్దేరుదాం?' మళ్ళీ అడిగాను.

తాతయ్య నోరు కడుక్కొంటూ '' ఎల్దుంలే, రేపు పండగ్గావల్ల, మీ యమ్మసూస్తాది.. నువ్వు పద, నేనొస్తాను'' అన్నాడు. ' ఇద్దరం కలిసే వెళ్దాం' పట్టుదలగా అన్నాన్నేను. 'నేనేనికి నువ్వు ఎళ్లు' అన్నాడు మళ్ళీ.

'అమ్మ ఏడుస్తంది' అన్నాను నేను

అప్పుడు నా కళ్ళలోకి తాతయ్య క్షణంకాలం చూసేడు. ఆ చూపులో ఎన్నో ప్రశ్నలున్నాయి. మళ్ళీ తను ఇక్కడికి వచ్చి చేయవలసిన పోరాటాలూ వున్నాయి. ఏదో తేల్చుకొని వెళ్ళాలనే పట్టుదలా వుంది. అందుకు సాక్ష్యంగా ఆ సాయంత్రం నన్ను నరసన్న పేట ప్రయాణం కమ్మన్నాడు. నేను కాదనలేదు.

వెళ్ళే సరికి చీకటి పడుతోంది. బస్టాండులో దిగి, రిక్షా ఎక్కితే తెలిసింది. లాయరు ఇంటికని, ఇంటికి వెళ్ళేసరకి లాయరుగారు లేరు. పండగకి అత్తవారింటికి పెళ్ళాం బిడ్డల్ని దిగబెట్టడానికి వెళ్ళాడని, తను మాత్రం వున్నాడని... రేపు వెళ్తాడని తెలిసి ఇంటిదగ్గరే ఇద్దరం ద్వారానికి రెండు వైపులా గొర్కాల్లా నిల్చున్నాం. ఎప్పుడు నిద్రపట్టేసిందోగాని లాయరుగారు లేపిందాక తాతయ్యకూ, నాకూ వంటిమీద తెలివిలేదు. తెలివొచ్చిన వెంటనే గుప్పున కంపొచ్చింది. ఆ తర్వాత ఆయన నోటినుంచి మాటొచ్చింది. వాళ్ళావిడి వెళ్లిపోవడంతో లాయర్‌గారికి మూడొచ్చింది. బార్లో కెలితే ఇంతవేళకు తెలివొచ్చింది. ఆయన కథ విన్నాకే తాతయ్యకు తన కథ గుర్తొచ్చింది. లాయరుగారికి కేసూ గుర్తొచ్చింది.

తాతయ్య ఇచ్చిన మూడొందలు లెక్కపెట్టి తీసుకొని లాయరుగారడిగేరు.

''మరి శిస్తు ఎవులు చెల్లిస్తున్నారు?''

''రెండేళయిన సిన్న కొడుకుగాని, అంతకు మునుపల్లా నానే'' తాతయ్య చెప్పాడు.

' ఇరుకన పడ్డాం' అన్నాడు లాయరు, ''ఎవరు పేరున కడతన్నారో తెలుసునా?'' లాయరు ప్రశ్నకి తాతయ్య తల అడ్డంగా ఊపేడు. శిస్తు ఎవరిపేరున కడుతున్నారో, ఎవరు కడుతున్నారో ఆలకే భూమి చెందుతుందట. పట్టా కాగితాలు, రసీదులు

తీసుకురావాలిట. తప్పక న్యాయం జరుగుతుందట. పండుగ మూడు రోజులూ పోవాలిట, తర్వాత ఇంజక్షన్ ఇస్తాడట.

తాతయ్య అసంతృప్తిగానే సంతృప్తి పడ్డాడు. లాయరుగారు లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నారు. ఆ అరుగుమీద నిద్రపట్టని నిట్టూర్పుల మధ్య ఆలస్యంగా తెల్లవారింది. మళ్ళీ వెనుదిరిగి తాతయ్యా, నేనూ ఊరు చేరుకున్నాం. ఆ పూటంతా తాతయ్య ఏదో ఆలోచిస్తున్నట్టే తలకు చేతులు ఆన్చి కూర్చున్నాడు.

నేను మాత్రం అక్కడ వుండలేక జానకత్త వాళ్ళ ఇంటివేపు నడిచాను. జానకత్త, వాళ్ళమ్మ సూరప్పాలేదు. లచ్చిమివుంది. పండుగ రోజుకదా, దొరోరి ఇంటికాడ పప్పురుబ్బడానికి తల్లీ కూతుర్లు వెళ్లినట్టు చెప్పింది. జున్ను అమ్మ దాచిందని, వుండమని వచ్చేస్తారనీ చెప్పింది. మళ్ళీ వస్తానని చెప్పి అక్కడ నుండి చిన్న మావయ్యగారింటికి వెళ్ళాను. గుండెలో ఏదో అలజడి నాకు తెలియకుండానే ప్రారంభమయింది.

మావయ్య, పరంబావ తీవ్ర ఘర్షణలో వున్నట్టున్నారు. నేను వెళ్ళడంతో అంతా సద్దుమణిగి పోయింది. కొంచెం సేపు నిశ్శబ్దం. ఎవ్వరూ ఏమీ మాట్లాడడం లేదు. కాసేపటికి అత్తయ్యే అంటోంది... ' ఈ గుడిసేటు ఇంట్ల పండగలేదట, ఎప్పుడూ ఏట్లోల్లా ఈదిలబడి పోడమేనట, తమలాంటి కష్టాలు ఎవరికి రాకూడదట.... తనలో తనే మాట్లాడుతున్నట్టుగా వుంది. నేను అరుగు దిగుతున్నా ఎవ్వరూ ఏమీ అనలేదు. దార్లోనే తాతయ్య కలిస్తే కళ్ళం వేపు వెళ్ళాం. తాతయ్య పొలంలోకి దిగాడు.

పొలాలన్నీ చేలుకోసేసాక వరిదుబ్బులు ఎండకు ఎండి మరింత గిడసబారి అడ్డుగోస్తే ముల్లలా గుచ్చుకుంటున్నాయి. తాతయ్య అవేవీ పట్టించుకోవడం లేదు. చేతిలోకి పడికెడు మట్టితీసి వాసన చూసాడు. చుట్టూ చూసాడు. నా వంక చూసాడు. పలకం నెల్లో కోతలు కోస్తే మళ్ళీ అవేటిదాక దమ్ములు పట్టిందాక పొలాలన్నీ సాశానాలయి పోతాయి. ఊరు కాలీచేసినట్టు గుంటాది. ఆరుమాసాలే ఆవుసు ఈ మట్టికి. నీలుసుక్కలుంటే డాలవాలు... పెసరా.... మినపా, లేపోతే లేదు. వున్నోలికి వుంతే, లేనోడి కడుపులాగే అర్ధ ఆకలిలాగే అర్ధకాలం పొలాలున్నూ! ఆడయినా ఏటి బతికేస్తాడు? నాలాగే దొంద పడిపోతండు...' తాతయ్య గొంతును దుఃఖం ఆక్రమించుకుంది. వణుకుతున్న చేతుల్లోంచి మట్టి జారిమడిలో పడింది. కూలబడిపోతున్న తాతయ్యను నిల్చోబెట్టాను. కొంత సేపటికి స్థిమిత పడ్డాక 'పద' అన్నాడు. ఇద్దరం కదిలేం. వీధిలోకి వచ్చేసరికి ''మహాదేవా... మహాదేవా.. '' జంగపోడి గంట... అదికూడా చిన్నమావ ఇంటిముందరే!

''... ఆ నల్లని పొగలోన ఆ నాగలోకమందు ॥ మహాదేవా ॥
ఆ తెల్లని పొగలోన ఆ దేవలోకమందు ॥ మహాదేవా ॥
నీ విలవిల పేనాలు - ఈడిపోయినాయ ॥ మహాదేవా ॥

అప్పమ్మా! నీవు - నీకొడుకైనా
ఆదీ నారాయణ - గంగ ఒడ్డునేమో సాన్నాలు జేసి
గదిలో పిండంబు - గదియ బెట్టినాడు
మల్లెలు సంపంగి - మారెడు పత్తిరి... ॥ మహాదేవా ॥
కోటికి వీ ఇల్లు శివశంభో...''

గంటలు గణ గణ మని లయగా పడుతున్నాయి. అలవాటుగా అన్ని వివరాలతో పాడుతున్నాడు. తాతయ్యతో పాటు నేనూ క్షణకాలం నిలబడిపోయాను. తాతయ్య ముఖంలో ఏదో సేద తీరిన భావం... అది కూడా కొద్ది క్షణాలే!

బస్సు హారనంవెూత లీలగా వినిపించింది. 'పద బస్సు వచ్చేస్తంది' తాతయ్యమాటతో నా మనసు తేలిక పడి జానకత్త ఇంటివేపు పరిగెత్తాను. 'తవుడు మావగోరి దగ్గరున్నానని జున్నుపట్టుకొని అమ్మొచ్చింది' లచ్చిమి మాట పూర్తికాక ముందే ''నే ఊరుళ్తున్నా, అమ్మకిచెప్పు '' పరుగుతీసాను. లచ్చిమి ఏదో చెప్తోంది. బస్సు వచ్చేసిందని ఎవరో కేకపెడుతున్నారు. తాతయ్య పిలుస్తున్నాడు. చిన్న మావ ఇంటికి చెప్పడానికి వెళ్ళేసరికి జంగాలనోట పాట, చేత గంటా రెండూ ఆగిపోయున్నాయి. పరం బావ సూట్‌కేసు పట్టుకు వెళ్తున్నాడు. ఆపడానికి వాళ్ళమ్మ చాలా అవస్థ పడుతోంది. మామయ్య పొమ్మనేసి తిడుతున్నాడు. పరం బావ పెళ్ళాం ఏడుస్తోంది. ఇంకేమీ చెప్పలేక వెనుదిరిగాను. పరుగులాంటి నడకతో దారిలోనే తాతయ్యను కలసి బస్టాండు చేరేసరికే బస్సు వచ్చి ఆగివుంది. మేం ఎక్కేసరికి పరంబావ బస్సులో కూర్చున్నాడు. మావేపు చూసి తల తిప్పుకున్నాడు.

బస్సు కదిలింది. తాతయ్య కళ్ళలో నీళ్ళూరుతుంటె కనిపించనివ్వకుండా కిటీకి వేపు తిరిగి ఆవలివేపుకు చూస్తున్నాడు. నేనేమీ కదపలేదు. పరంబావ ఆస్తిలో భాగం కావాలనే గొడవ పడినట్టున్నాడు. 'నా బతుకు నన్ను బతకనివ్వరు' అని ఎవరితోనో అంటున్నాడు. బస్సు వేగం పెరిగింది. ఎవరో పిలిచినట్లయింది. జానకత్త జున్ను పట్టుకు వచ్చిందేమోనని బస్సులోంచి చూసాను, బస్సు రేపిన ధూళి, ముసురుకుంటున్న చీకటికి... ఎవ్వరూ కనిపించలేదు.

ఆకాశం గుడగుడమంటోంది. చినుకులే రాల్తాయో... ఉరుములే మిగుల్తాయో? తుఫానే పెడుతుందో? చూడాలి!

*రచనా కాలం : 17 ఫిబ్రవరి 1993*
*ముద్రణ : ఆహ్వానం, నవంబరు 1993.*

# పోలిగాడి చావు



ఆ ఇంట్లో అందరూ లజ్జుగిజ్జు లాడిపోతున్నారు. కాలు, చెయ్యి ఆడ్డంలేదు. నోటి మాట రావడంలేదు.  ఏం చేయాలో ఎవ్వరికీ ఇదమిద్ధం కావడం లేదు. ఏదన్నా చెయ్యాలనుకున్నా అది సమయం కాదు. పైగా పరిస్థితులు వేరేగా ఉన్నాయి.

అందరూ మంచం చుట్టూ చేరారు. మంచం మీద పోలిగాడి శవముంది.  అసలు అది శవంలా లేదు. పోలిగాడు గురక పెట్టి నిదురపోతున్నట్టుగానే ఉంది. కాని పోలిగాడు ఇందాకే చటపటలాడి, కాళ్లూ చేతులూ తన్నుకుని చనిపోయాడు.

పోలిగాడి చిన్నకొడుకయితే బిక్కచచ్చిపోయాడు. చిన్నకూతురు జడిసిపోయి తల్లిని చుట్టేసుకుంది. గుంట ఎంతలా జడుసుకుందో గాని గుడ్లు తేలేసింది.  ముఖాన రెండు నీళ్ళు పోస్తే లెగిసింది. నడిపోడి కళ్ళు ఏడుస్తున్నాయి. గొంతులో మాత్రం శబ్దం లేదు. పెద్దోడి కంట్లో  ఒక్క నీటి చుక్కా లేదు. మనిషి మాత్రం ఏదో ఆలోచనలో పడినట్టున్నాడు.

పోలిగాడి పెళ్ళానికి నిండారా  ఏడవాలని ఉంది. గుండెల్లోంచి తన్నుకొచ్చిన దుఃఖం కక్కేయాలనే ఉంది.  ''నాన్నీకే మన్నేయం సేసినాను. నన్నొదిలిపోయావు? ఈ పిల్లల్ని సంసారాన్ని అన్నిటినీ వదిలెల్లిపోడానికి నీకు మన సెలాగొప్పిందయ్యా? అడికిది దరమం కాదు. నా రాజుని నాక్కాకుండా సేసినోడికి'' అని రాగం తీస్తూ, వర్ణిస్తూ తల నేలకేసి బాదుకుని ఊరంతా వినబడేలా ఏడ్చేదే. కాని ఏడవటంలేదు. ఏడుపు ఆపుకోవడానికి

గొంతు పిసుక్కుంది. నోట్లో పైట కుక్కుకుంది.

'' ఏడిసావా పీక పిసికి సంపేత్తాను, లమ్డీ కూతురా!'' పెద్దకొడుకు తల్లిని తాటించాడు.

'' ఇంట్లో ఎవుడు గాని ఏడ్చినాడో కత్తెట్టుకు నరికేత్తాను. జాగర్త. కిక్కురుమన్నా రంటే తాటొలిసీగలను. నా సంగతి తెల్దేటి?'' పోలిగాడి పెదబావమరిది అంటె - పోలిగాడి భార్య పెద్దన్న ఇంటందర్నీ హెచ్చరించాడు.

అందుకే శవం ఇల్లు వదిలి కాష్టానికి తీసుకెళ్లకముందే, శవాన్ని తగులబెట్టాక నెలకొన్న వాతావరణం ఆ ఇంటినిండా అలుముకుంది. అసలు ఇల్లు ఇన్నాళ్టి కంటె చాలా నిసంకుడుగా ఉంది.

పోలిగాడి నోటిమీదా, ముక్కు రంధ్రాల మీదా ఈగలు వాలి అటూ ఇటూ ఎగురుతున్నాయి. నడిపి కొడుకు తువ్వాల్తో వాటిని అదిరాడు.

పోలిగాడి పెళ్ళాం సీతాలు ఆపుకోలేకపోయిందేమో ''అమ్మో'' అని గుండెలు బాదుకోబోయింది.

కాని అవకాశం ఆమెకీయలేదు. దాని అన్నా కొడుకూ కలిసి. పెద్దకొడుకు తల్లి జుత్తు పట్టుకొని అతాలించిబోయాడు - ''వద్దురో రన్న వద్దురా! దా న్నొదిలీరా! అదసలే అయ్య సచ్చి కొయ్యబారిపోనాది?'' ఎంతో బతిమలాడాడు నడిపోడు. అప్పుడు గాని పెద్దోడు జుత్తొదల్లేదు.

'' ఏనికే వద్దంతే ఏడుస్తావు? ఏటికే! అలుసెప్పినట్టినే!'' నడిపోడు తల్లిని సముదాయించాడు.

''నువ్వూరుకోరా! నా నేటి సేసినాను. నాపెనిమిటి పోతే ఏడుపెలాగాపుకోగలన్రా! ఏ ఆడదానికీ ఇది రాకూడదురో దేముడో!'' ఎంత నెమ్మదిగా మాట్లాడినా సీతాలు గొంతు పెద్దది. ఆమాటలు పెద్దగానే వినిపించాయి.

''మెల్లిక మాట్లాడంతే ఇనపడదే! వెనికి సెపుతున్నామో ఇను! నీకే నేటి దుఃఖం? మాకు పోలిగాడంటే పేణమేనే! అభిమానమేనే! ఆడు మీన మద్దినఇకన ఉండడంటేనే... తల్సుకుంటే గుండె సెరువైపోతన్నాది వల్లకోయే'' అని చెపుతున్న సీతాలన్న సిమ్మాద్రి గొంతూ బాధతో నిండిపోయి బరువెక్కిపోయింది. అంతమనిషికీ ఏడుపొస్తోంది. కళ్ళు రెండూ పంచెతో తుడుసుకున్నాడు.

'' ఏట్రా మావా! అందరికి సెప్పి నీవే ఇలాగయితెలగ?'' ప్రశ్నించాడు పోలిగాడి పెద్దకొడుకు.

'' నేదు, నేదు గాని... నువ్వెళ్లి ఆ మారన్ననీ, కొండయ్యనీ పిలుసుకొచ్చి రారే! ఎళ్లు జాకర్త! విషయం పొక్కనీకు. ముఖమాతువ్వాల్తో తుడుసుకొని ఎళ్లు. ఎళ్లి బేగి పొ్రామీ!'' చెప్పాడు సిమ్మాద్రి.

పోలిగాడి పెద్దకొడుకు లుంగీ, బనీనుతో తువ్వాలు భుజం మీద వేసుకుని ''మావా, జాకర్తరా! అమ్మానువ్వేడకే? ఒరే తవిటిగా! అమ్మని సూ(డ్రా! ఎవులయినా రాగ(లు, తలుపు గడెయ్యండి'' చెప్పి వెళ్లాడు.

తవిటయ్య అన్న వెళ్లగానే తలుపు దగ్గరగా వేసి, చిన్నగా గడియపెట్టి మంచం దగ్గరకు వచ్చాడు.

కొంచెంసేపు నిశ్శబ్దం.

ఆ సమయంలో ఆ నిశ్శబ్దం భరించవల్లకానట్టుగా ఉంది.

సీతాలు తట్టుకోలేకపోయి పోలిగాడి శవం మీద పడిపోయి ఒళ్లంతా తడిమేసింది. బుగ్గలు ముద్దెట్టుకుంది. ఆప్యాయం, ప్రేమ, అనురాగం అన్నిటికీ మించి అనంతమైన బాంధవ్యం ఆ స్పర్శలో నిబిడీకృతమై ఉంది.

సీతాలు చేష్టలు చూసి చెట్టంత సివమ్మా(ద్రి నీరుగారిపోయాడు. చెల్లెల్ని ఆపలేకపోయాడు. అయినా సీతాలు మౌనంగా రోదిస్తోంది.

'' అమ్మా! ఏడకే! ''అని చిన్న కూతురు ఏడుస్తూంటే, పిల్లల్ని చూసిన సీతాలుకి జాలిగా అనిపించింది. తన పిల్లలు దిక్కులేనోళ్లలాగా కనిపించారు. ఆకలికి అడుక్కునేవాళ్లలాగా కనిపించారు. అంతే, కూతుర్నీ, కొడుకునీ గుండెల కదుముకుంది.

'' అన్నొచ్చి అందర్నీ కొట్టీగల్డు ఏడొద్దు! '' భయాన్ని వెళ్లగక్కాడు పదేళ్ల చిన్నకొడుకు. అసలు ఏడిస్తే అన్న ఎందుకు తంతామన్నాడో ఆడికీ, చిన్నదానికీ ఎంత ఆలోచించినా అర్థం కావడంలేదు. సీతాలుకీ అలానే ఉంది. ' దాంది మొద్దు బు(ర ' అని ఏ విషయమూ, ఎందుకూ అన్నది చెప్పలేదు.

కళ్లు తుడుచుకుంది. కాని ని(ష్ప్రయోజనమని సీతాలుకీ తెలుసు. కళ్లు ఊటబావుల్లా ఉన్నాయి.

సీతాలు కళ్ల ముందు పోలిగాడు మెదిలాడు. పెళ్లయ్యేసరికి పోలిగాడికి ఇంకా నిండారా మీసం రాలేదు. ' అసలు పంచి కట్టుకోడమే తెలీదుగొరకడికి ' అని ముసలమ్మ అనేది. అటువంటోడు పెళ్లయ్యాకే కండగట్టినాడని ఊరంతా అనేది. సంవత్సరం తిరక్కముందే తొలుసూరు మగపిల్లడ్ని కంటే అందరూ ' అదృష్టవంతులు ' అని పోలిగాడ్ని పొగిడితే ఎంత పొంగిపోయాడు? సిగ్గయనా లేకుండా సిన్న పిల్లలా ఎత్తుకుని, ' సీతాలు సింగారం! మా లచ్చి బంగారం! ' అని కళ్ళు తిరిగిపోయేలా తిప్పేశాడు. ఎంత బలమని?

పుట్టెడు బియ్యం ఒక్కడూ అవలీలగా భుజం మీద వేసుకుండేవాడు. రెండో కానుపుకయితే వంటా అదీ అన్నీ ఆడే ఆడదాన్లా చేసేవోడు. అలాటిది ఆరుగురు పిల్లల్ని కనేసరికి ఎంత మార్పు తీసుకొచ్చిందీ జీవితం! ఆర్థికంగా చితికిపోయాడు. బాగార్లు (అన్నదమ్ములు) దిబ్బయిపోయిన బాగార్ల ఆస్తుల కోసం తన్నుకొని కోర్టులకు

ఒప్పజెప్పేసినారు. ఉన్న కొద్ది ఆస్తీ, ఆడి జిమ్మపడిపోనూ, ఆ మామ గండడు తాగేసి తగలబెట్టేడు. ఆరుగురు పిల్లల్ని సంసారాన్నీ లాక్కొస్తూ ఒక పిల్లకి పెళ్లి సేసినాడు. అంతలోనే భగవంతుడు సిన్నసూపు సూసినాడు. లేపోతే రాయిలాంటి మనిషి ఏది తిన్నా అరాఁయించుకున్న మనిషి అలాటిది. ఆడి కడుపులో కాయువడమేంటి ... అది పెరిగిపోడమేటి?

'' ఓరన్న ఆపరేసను సేసుంటేఁ ఎలగొచ్చున్నో...'' ఆలోచనల నుండి.

సిమ్మాద్రికి ఏమని సమాధానం చెప్పాలో తెలియలేదు. ఎలా చెప్పాలో అంతకన్నా గురి కావడం లేదు.

' ఓ అయిదు వేల్రూపాయలుంటే... పట్నం తీసుకెళ్లుంటే మనిషి తప్పకుండా దక్కేవోడో, కాని అయిగు వేలంటేటి మాటలా? గుంటలు బిళ్ల కొనుకుంతామని గోలసేత్తే సేతిలో అయిదు పైసాలు లేక ఒక్కోపాలి నానా జంజాటు పడిపోనాం కదా... జబ్బులు అందరికీ రావచ్చు, కాని అవి పోడాకి డబ్బులే అందరికాడ ఉండవు...' అని మనసులోనే అనుకున్నాడు సిమ్మాద్రి. పైకి మాత్రం... '' దేవుడి రాత తప్పదు కదా...'' అన్నాడు. కర్మ పేరు చెప్పి దేవుడి మీదకి నెట్టేసి అసత్యమాడుతున్నాడని సిమ్మాద్రికే కాదు - సీతాలుకూ తెలుసు.

ఇంతలో తలుపు చప్పుడయింది.

భయం భయంగానే 'ఎవరూ? ' కేకేసాడు సిమ్మాద్రి తలుపు తీయకుండానే.

'' ఓరన్నా నీన్నా దాలమ్మను... మా తోటి కోడలు పనిలోకి రాదేటి?'' గొంతుపెంచింది అవతలి నుండి దాలమ్మ.

''...పనిలో కెళ్ళి పోయినట్టుందే...'' అంతకన్నా ఏమి సమాధాన మివ్వాలో తోచలేదు సిమ్మాద్రికి.

'' గుడిసేటు ధ్గాయి సెప్పకుండా పోనాది. నాను బుగతోరు గాఁపు తీతకెళ్తన్నాను వస్తాన్నయ్యా...'' అంది దాలమ్మ వెళ్ళిపోతూ.

'' అమ్మయ్య...'' అనుకున్నాడు సిమ్మాద్రి.

'' అన్నా... శవాన్నింట్లెట్టుకొని ఏట్రెటిది?'' దుఃఖం గొంతుతో అడిగింది సీతాలు.

ఎలా చెపితే సీతాలు చెవికెక్కుతుందో ఆలోచిస్తున్నాడు సిమ్మాద్రి.

'' ఓరన్నా పెద్దానికి కబురు ఎట్టా... నడిపిదీ అక్కడే వుంది. ఇద్దరూ ఆలయ్యని ఆఖరిసారి సూత్తారు...'' సీతాలు మొత్తుకుంది.

''కబురు పంపించినాన్లే...'' చెప్పాడు సిమ్మాద్రి. అది అబద్ధమని సిమ్మాద్రికే కాదు. సీతాలుకీ తెలుసు. నిన్న రాత్రి నుండి ఇక్కడి నుండి గడపలో అయినా అడుగెట్టని అన్న... కబురంపించాడంటే అది ఖచ్చితంగా అబద్ధమని ఆమె నిర్ధారించుకుంది.

ఇంతలో తలుపు చప్పుడయింది.

'' ఎవరూ...?'' ఈ సారి తవిటయ్య తలుపు తియ్యకుండానే అడిగాడు. ''నేన్రా తవిటీ..'' ఆ గొంతు పెద్దన్నదని విని తలుపు గడియ తీశాడు నడిపోడు. వెంటనే పోలిగాడితో పనిచేసే సూరన్న కొండయ్య అన్నతో పాటే ఇంట్లోకి గబగబా చొరబడి పోయారు.

వాళ్లని చూస్తూనే మరింత ఏడవబోయింది సీతాలు. కాని నోరు మూసేశాడు పెద్ద కొడుకు. కాస్సేపయితే ఊపిరాడలేదు. ''ముష్టి గులామా... దొంగలంజికొడకా నీకేటి పిచ్చి పట్టిందిరా...'' పిచ్చి దానిలా కొడుకుని పట్టుకొని ఊగిపోయింది. సీతాలు.

''రాయప్పా... రాయే... సెవుతాన్రా...'' అంటూ సూరన్న, కొండయ్య సీతాల్ని వంటగదిలోకి తీసుకెళ్లారు. ఎలా చెప్పాలో వారికి చేతనవలేదు. కాని వారి మాటలు చూస్తుంటే వాళ్లందరికీ పిచ్చి పట్టినట్లుగానే ఉంది సీతాలుకి. చిన్న కొడుకూ, చిన్న కూతురు సీతాలు కొంగున చేరారు.

''పిల్లలు జడుసుకుంటారు...'' వాళ్ల సమాధానం సీతాలుకి నచ్చలేదు. ఏడ్చింది. ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయింది.

చేయగలిగిందేమీ లేదన్నట్టుగా సీతాలు వంక జాలిగా చూసివంటగది తలుపు దగ్గరకు వేసి, మంచం దగ్గరకు వచ్చారు సూరన్న, కొండయ్యలు.

'' ఏట్రయ్యా సిమ్మాద్రి...?'' ప్రారంభించేడు సూరన్న.

'' ఏటంతేటి... పోలిగాడు సేన అల్లర పెట్టైనాడు. సచ్చినోడు రాత్రికాడ సచ్చిపోయినా బాగున్ను...'' అన్నాడు సిమాద్రి.

'' ఇపుడు తెల్లారి గట్ల సచ్చిపోడంకాదూగానీ... ఎవుడికి సచ్చిపోయినట్టు తెలిసినా ఊరంతా పాకేత్తాది.. మనపదకం బెడిసి కొట్టేద్ది, రాత్రయితే గాని ఏది సెయ్యలేం...'' కొండయ్య అన్నాడు.

'' ఒరే శవ మిక్కడుంటే వచ్చిపోయినోల్తో పెద్ద బాదొచ్చి పడిపోద్ది... ఆ కొట్టు గదిలో అయ్యని (శవం) తీసికెళ్లి పడేరా...'' చెప్పాడు సూరన్న.

నడిపోడు తవిటయ్యకీ ఏదేదో అర్థమౌతోంది.

''వాసనొచ్చిదా రోజంతా ఉంటే...'' సిమ్మాద్రి ప్రశ్నించాడు.

''రోజంతా ఏనికి? సీకటి పడేదాక సేనలే...'' అన్నాడు సూరన్న.

'' అంతక్కాపోతే పావలా గుగ్గిలము, ఓ కట్ట ఊదొత్తులు తెచ్చీసినారంటే అవన్నీ ముట్టించీసి కొట్టుగది తలుపు లేసేస్తే వాస నెటూపోదు...'' కొండయ్య తన ఆలోచనని చెప్పాడు.

''అలాగే గబీల్నెట్టుకొద్దాం...'' అన్నాడు పోలిగాడి పెద్దకొడుకు.

'' ఒరే పెద్దోడా కొట్టుగదిలో సాపమీదేసీరా...'' చెప్పాడు సూరన్న. ఆ మాటతో కొట్టు తలుపు తెరచి చాప సర్దాడు సిమ్మాద్రి.

వాలగాడ శవాన్ని పెద్ద కొడుకు బలంగా ఎత్తాడు, కాని మనిషి వెళాడబడి పోతున్నాడు. అనుకున్నట్టు సులాపనగా లేదది. భారంగానే ఉంది. కాస్తంత కష్టమనిపించింది. కొండయ్య తోడు పట్టాడు. కోట్లో పోలిగాడి శవాన్ని పడుకోబెట్టి గోని సంచులు కప్పారు.

'' మీ డూటీ వోలుకెవరికి సెప్పావా?'' సిమ్మాద్రి అడిగాడు.

''మా తోటి గేంగీమెన్లు మరిద్దరికే సెప్పినాను. వాళ్లు మనోళ్లే సాయంసేత్తారు... బయం లేదులే...'' నమ్మకంగా అన్నాడు సూరన్న.

''డూటీలో సచ్చిపోతే డబ్బా... కొడుకెవడికో ఉజ్జోగమూ వస్తాది. అదీ రెల్వేరుజ్జోగం. సదువు లేదు గాని మాబాగుంటాది...'' తనెంతో సుఖపడిపోతున్నట్టు అన్నాడు కొండయ్య.

'' ఆఫీసరు బాఁవు మంచోడయి సరిపోయింది. పోలిగాడు వంట్లో బాగోలేక వెళ్లకపోయినా కొడుకు తవిటయ్య అడొంతు ఎల్లోడు. ఎల్తన్నాడు... మస్తరి పడిపోతంది... ఆ ఆఫీసరు బాఁవుకి దండమెట్టాల. అయినా ఈ ఎండకాలంలో అదీ రైలు కమ్మీలంట రాళ్ల మీద నడుసుకొని ఎవుడు సెకింగుకి వత్తాడు?'' అన్నాడు కొండయ్య.

''పగలందరూ సూత్తారు గానీ ఇపుడు కుదర్దు. రేపు తెలారే సరికల్లా అంటే రాత్రపుడు రైలు కమ్మీలు మీద పడిస్తే ఏ బండి కిందో శవం ముక్కలైపోతాది. తెల్లారి అందరూ సూస్తారు. కాని డూటీ ఎక్కాకే బండి కుమ్మీసిందని మీ డూటీ వోళ్లూ, మీరూ అనీయండి... పట్టాల ఇనపబద్దీలు కొడుతూ, బోల్టులు బిగిస్తూవుంటే ట్రైను వచ్చి సరికే దాటబోయాడు పట్టాలు... కాని దొరికిపోండు అని కప్పి సెప్పాల మీరు... జాకర్తమీ...'' సిమ్మాద్రి నిదానంగా చెపుతున్నాడు.

కాని సొమ్మసిల్లి పోయిన సీతాలు ముఖం మీద చిన్న కొడుకు, కూతురూ వంటగదిలో నీళ్లు చల్లి తట్టి లేపి స్పృహలోకి తెప్పించారు. ఆమె ఈ మాటలు చాలా వరకు వింది. పూర్తిగా అర్ధమైపోయింది. అందుకే సిమ్మాద్రి మాటలు పూర్తికాక ముందే సిమ్మాద్రి మీద వురిమి పడింది. మెడ మీద వేసుకున్న తువ్వాలును లాగింది. పైజమా చింపేసింది, గోళ్లతో రక్కింది.

'' నామొగుడి శవం ముక్కలయితే నాను సయించలేను. డబ్బు కోసం బరాయించలేను. ఆలిచ్చిన వుజ్జోగమూ వద్దు. డాకటర్లు ఆ తర్వాత నామొగుడ్ని కత్తులతో కండకండలు కోత్తే, ఆ తర్వాత పారేసిన డొక్కుని దహనం సేత్తే ఆడికి పై కెళ్లాక ఏటి ముక్తుంతాది? తర్వాత పోలీసోళ్లు...!'' గట్టిగా అరుస్తోంది సీతాలు.

'' ఓ లమ్మా, ఊరుకోయే నీకు తెల్దు!'' పెద్దకొడుకు తల్లిని అనబోయాడు.

'' ఏట్రా తెల్దు, ముష్టి గండా!'' పెద్ద కేకలు పెడుతూ పెనుగాలిలా ఊగిపోతూ ఉధృతమైన సీతాల్ని ఆపడం కష్టమయింది. చెపితే వినేటట్టు లేదు. ఇరుగూ పొరుగూ

వచ్చేటట్టు ఉన్నారు. అటు తర్వాత గుట్టు రట్టు అయ్యేటట్టుగానే ఉంది.

అంతే! ముందూ, వెనుకా చూడకుండా దబడదబడ రెండు సుట్లు దెబ్బలు వేసాడు పెద్దాడు. ''అమ్మో! బాబోయ్!'' అరచింది సీతాలు. ఇక తట్టుకోలేకపోయాడు అంతే! బలంగా తన అరచేతిని బిగించి తల్లి గూబ పగులగొట్టాడు. ఆ దెబ్బకు అలాగే పడిపోయిందా తల్లి.

' సచ్చిపోయిందేమో' అనుమానంతో నిలువెల్లా వణికిపోయాడు తవిటిగాడు. పెద్దోడు కూడా బయపడ్డాడు. చిన్న పిల్ల లిద్దరూ ఏడుపందుకున్నారు.

''నోర్మూయ్యండ్రా!'' కేకలేస్తూ లేచాడు సిమ్మాద్రి.

నోరు తెరిస్తే తంతాడని ఏడుపు ఆపుకోవాలని ప్రయత్నిస్తున్నా వాళ్ల వల్ల కావడంలేదు.

ఇంతలో ఇరుగూ పొరుగూ వచ్చారు. తవిటిగాడు తల్లి తలని ఒడిలోకి తీసుకున్నాడు. పెద్ద కొడుకు గబగబా వెళ్లి మంచినీళ్లు చెంబుతో తీసుకువచ్చి ముఖం మీద చల్లి, తుడిచాడు. గొంతులో నీళ్లు పోశాడు. విసనకర్రతో విసిరాడు. చాలాసేపటికి అన్ని ఉపచర్యలకి తెలివి వచ్చింది. కొడుకు వేపు చూసింది. పెద్దకొడుకు గొంతులో నీళ్లు పోయబోయాడు. కాని పెదవి తెరవలేదు. అసహ్యంగా, అసహనంగా చూసింది. కాని పెద్దకొడుకుతోపాటు తవిటిగాడు, చిన్న పిల్ల లిద్దరి కళ్లలో నీటి పొర చూసి తనూ నీరులాగా కరిగిపోయింది. కొడుకిచ్చిన నీళ్లు తాగింది.

'' ఏటయ్యింది రోరయ్యా! ఏట్రా!'' అడిగింది పొరుగింటి సూబద్రమ్మ.

'' ఎవర్ర కొట్టినోళ్లు? జిమ్మలు బడిపోతే అంత గుమాయించిపోయినట్టు ఆడదాని మీద సెయ్యి సేసుకుంతారర్రా! మీ సేతు లిరిగిపోను!'' తిట్టిపోసింది పెరట్లో ఉన్న ముసల్ది.

ఇంట్లో జనం మూగిపోతున్నారు. పరిస్థితి విషమిస్తోంది.

'' ఏమీ లేదమ్మా! ఇంటి గొడవలు,'' సూరన్న తడబడ్డాడు.

'' పోలిగాడు... మరి వంట్లో బాగోపోయినా పనిలో కెళ్తానని ఎళ్లిపోనాడు. వంట్లో బాగోనేదు కదా వద్దంది సీతాలు. ఆడినిపించుకోలేదు. మందులు ఘాకులు తరువా తెట్టడం నా వల్ల కాదని తిట్టి పోసింది మా సెల్లిలు. అంతే రెండు బాదీసి మరీ డూటీ కెలిపోండు. అలాటి మనుసుల్తోటి ఏటి పడతాము!'' మాట అల్లుతూ సర్దేడు సిమ్మాద్రి.

'' ఇంటింటికీ ఉంది మంటిపొయ్యి! ఎళ్లం డెళ్లం డెహె!'' గదమాయించి అందర్నీ పంపేశారు సూరన్న, కొండయ్యలు.

'సెయ్యి దురుసుతన మని' సచ్చినోడి మీద నింద మోపినందుకు క్షమించమని మనసులోనే అనుకున్నాడు సిమ్మాద్రి.

సీతాలుకి అయోమయంగా ఉంది. అంతకు మించి శక్తి లేక నిర్లిప్తంగా అచేతనంగా

ఉంది.

' ఇంతొాయిసొచ్చినా అదేంమగబుద్ధి' ఒక రిద్దరు పోలిగాడ్ని తిట్టి వెళ్లారు. కొద్ది క్షణాల్లో అందరూ వెళ్లిపోయి నిశ్శబ్దం ఇల్లంతా ఆవరించుకుంది.

సిమ్మాద్రి సీతాలు చేతులు పట్టుకున్నాడు. '' సెల్లెమ్మా! నా నెందుకిదంతా సేత్తున్నాను ఆలోసించు! ఇందులో నాకేటి పైసా వచ్చింది నేదు. పైగా సొచ్చికాల్లో ఇరుక్కుంతాను. అయినా నీ సంసారం బాగుపడల్ల! నీ బాధ లీడేరిపోవల్ల! అదేనా మాఁవల్లా కోరేది. నాకు నువ్వొకటీ బావొకటేఁ? బావ ఎలాగయినా సొరగానికి ఎల్తాడే!'' దాదాపు ఏడ్చేశాడు.

'' సీతాలమ్మా! ఉన్న సిన్నుజ్జోగం మీద పెద్ద సంసారం లాగనేకే పోలిగాడు ఒకదవ కావాలనే రైలుకింద పడబోనాడు. నాను సత్తే పిల్లలకి ఎవులుకయినా వుజ్జోగం వస్తాది. గవర్నమెంటు పని ఇస్తాది. రేప్పొదున రిటారయితే వచ్చే పించను డబ్బుతో జీవిత మెల్ల దనీవాడు. అప్పులు...వాటి మీద వడ్డీలు. ఇంకిద్ద రాడపిల్లలూ... ఎట్నుంచి పైసా వచ్చిన దారా లేదు. అయితే ఆనాడు ఆడ్ని సావనివ్వకుండా ఎందు కాపినాం?'' ప్రశ్నించాడు కొండయ్య.

'' ఓలప్పొ! శవం కొయ్యి నివ్వకుండా అందరితో మాట్లాడే పూచీ మాది. ఆడుజ్జోగం ఆడి కొడుకులకి వచ్చినందుకు ఆడి ఆత్మ సంతోషిత్తాదే.'' సూరన్న ఏదో చెప్తున్నాడు. ఆమె కింకేమీ వినిపించడంలేదు. తలో మాట మాటాడుతున్నారు. జవాబు చెప్పే ఓపిక లేదు. పైగా తన మాట జరగనీరు. ప్రాప్తకం అనుకుంది. అలా అని అణచుకుని తట్టుకోలేకపోతోంది. మొగుణ్ని ముక్కముక్కలుగా కోసేస్తారనే ఆలోచన సీతాల్ని మరింత కుదిపేస్తోంది. వల్లు సచ్చిపోయింది. సెరమ్మ సిల్లులు బడిపోయింది.

''రే తవిటిగా! నీవు పనిలో కెళ్లురా! మే మో రెండు గంటల ఆలసింగా వస్తామని సెప్పు. అలాగే రేపుటి నుండి మీ అయ్యే పనిలోకి వచ్చేస్తానన్నాడని నాను మఁరాను అని మరిసిపోకుండ మల్లమల్ల సెప్పు! ఎళ్లు ఈ రోజుకి పనిలో కెళ్లు. నోరు జారక!'' సిమ్మాద్రి మాఁమ మాఁటల్తో తవిటిగాడు తలవంచుకు వెళ్లాడో, లేదో పెద్ద కూతురు తన కొడుకు నెత్తుకొని రెండో కూతురుతో కలసి వచ్చింది.

కూతుర్లిద్దర్నీ చూసి బోరున ఏడ్చింది సీతాలు. కాని పెదవి జారి ఇదీ అని చెప్పలేదు. చిన్న కొడుకూ, కూతురు భయంతో నోళ్లు విప్పనే లేదు. మొత్తానికి ఇంటి వాతావరణంలో మార్పు ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

'' అక్కడ మా అత్తోరింట్ల జగడమాడుకొని రెండ్రోజులుందామని వస్తే ఇక్కడా అక్కడిలాగే ఉంది నాకర్మ!'' అంటూ ఇంటందర్నీ తిట్టిపోసింది పెద్దదాయి.

సీతాలు మనుమడు ''అమ్మా! బువ్వే!'' ఏడు పందుకున్నాడు. వంట గదిలోకి వెళ్లి చూసింది. కుండలన్నీ కాళేసి ఉన్నాయి, '' ఇల్లా, సొసేనమా! ఇంతేలవరకు వంటా గట్రా సేసుకోరా! పోనిగెంజన్నా కాసుకోరా! మీకేటి పట్టేసిందఁరా?'' చిరాకుపడిపోయింది

పెద్దకూతురు.

'' వచ్చిందానివి తిన్నగుండు! మా పరువులు తియ్యక. కంత కూడు వండీ ... అమ్మ కొంట్లోట బోగోలేదు. '' పెద్దన్న అరిచాడు.

'' సరిలే రోరయ్యా! దేశాలు మూసీసొచ్చి నీవూ నీతులు సెప్పడమే'' ఇంకా ఏదో అనబోయింది. కాని, ''నచ్చిమీ వల్లకోయే... ఈపాలికి...'' అని గద్దాం పట్టుకున్నాడు సిమ్మాద్రి మామ. పెద్దాడ్ని కూడా పెదవి విప్పకుండా వారించాడు.

సీతాలు ఆలోచన అస్పష్టతల నడుమ గిరగిరాలు కొడుతోంది.

కొట్టు గదివైపు ఎవ్వరూ ఎళ్లకుండా ఓ కన్నేసి ఉంచారు కొండయ్య, సూరన్న.

తవిటయ్య పనిలోకి వెళ్లి విషయం చెప్పమన్నట్టుగానే చెప్పాడు. పనిచేస్తున్నాడే గాని ఆలోచనంతా ఇంటి చుట్టూరా తిరుగుతోంది. పిచ్చిగా అనిపిస్తోంది. పని చెయ్యబుద్ధి కావడంలేదు. కాని ఎవరికైనా అనుమాన మొస్తుందేమోనని చేస్తున్నాడు. ఒక రిద్దరు అదే విషయం అడిగారు. ఏమీ లేదన్నాడు. తండ్రిని తలచుకుంటే దుఃఖం వస్తోంది. ఒకప్పుడు తండ్రి వంతు పనిలో కొచ్చినప్పుడు చేతులు పొక్కులు పొక్కాయి. ఇప్పుడు చూసుకున్నాడు. కాని పొక్కులు లేవు. వాటి స్థానంలో కాయలున్నాయి.

తండ్రి తన మీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాడు? తన కొచ్చిన జబ్బుకి ఎంతోకాలం బతకనని, కుటుంబం వీధిలో పడుతుందని అన్నయ్యకి అందరి తిండి తినిపించారు. అందొస్తాడని బాగా మేపించారు. వాడు కొవ్వెక్కి ఎవర్తినో లేపుకుపోయాడు. ఆ తర్వాత అది ఇంకొకడ్ని చూసుకోవడంతో చివరికి ఇంటిదారి పట్టాడు. జీవితంతో ఏముందో అనుభవించడానికి అనుకున్నాడు. ఎన్నో పూటలు ఇంట్లో పస్తులు పడి ఉండటం తెలుసు. అందుకే ఇప్పుడు ఆకల్ని తట్టుకోవడం సులువుగానే ఉంది. అయితే మరీ పస్తులు పడి బతకలేమని అయ్యే ఈ పని చెయ్యమని తన మిత్రుల్ని, సిమ్మాద్రి మామను కోరుంటాడు' అనుకున్నాడు తవిటయ్య. మరి పనిచెయ్యలేక ఎవరితో చెప్పకుండా ఇంటికి వచ్చేశాడు.

అక్కనీ, చెల్లెనీ చూశాడు. వారూ వచ్చేసినందుకు గాభరా పడినా సర్దుకున్నాడు. ఇంట్లో ఏ విషయమూ పొక్కలేదని తీర్మానించుకున్నాడు. అందుకు అక్క అయ్యని గురించి అడగడమే సాక్ష్యం.

పిల్లాడు గోల చేస్తూంటే వాళ్లమ్మ (పెద్దకూతురు) తినిపిస్తోంది. వాడు రెండు ముద్దలు మింగి, తినకుండా ఊసేశాడు. ఆ గిన్నెలో కలిపి చిన్న చెల్లెకీ, తమ్ముడికీ తినమంది. వారు తినలేదు. ఇన్నాళ్లయితే ఆవురావురమని తినేసేవాళ్లు. మరిప్పుడు ఆకలి ఆవురావురమంటున్నా మెతుకుముట్టలేదు. పెద్దదాయే ఆ ముద్ద ఆకలికి నోట్లో వేసుకోబోయింది. కాని ఇంట్లో ఎవ్వరూ తినకపోవడంతో తిట్టుకుంటూ తనూ గిన్నెను పక్కకు తోసేసింది. ఎవరి చర్యా ఆమెకు అంతు పట్టడంలేదు.

అందరూ ఎదురు చూస్తున్నట్టుగానే చీకటిపడింది. నెమ్మదిగానే అయినా పల్లెటూరు

కావడంచేత వేగంగానే ఊరు నిదురపోయింది. అలసి అలసి విశ్రాంతి లేక అర్ధరాత్రయ్యేసరికి చిన్న కూతురూ, చిన్న కొడుకూ, పెద్ద కూతురూ, దాని తరువాత దాయి నిద్రలోకి జారుకున్నారు. పిల్లాడు తల్లి రొమ్ము కరచుకుని ఉన్నాడు. ఇంకా వాడికి ఆకలి తీరినట్టుగా లేదు.

సీతాలు మాత్రం కనెప్పలు అసలు మూయడంలేదు.

పోలిగాడ్ని తీసికెళ్లినప్పుడు మళ్లీ సీతాలు ఏడుపందుకుంటే తమ పథకం, ఆశ అంతా నిరాశవుతుంది. ఊరంతా తిట్టిపోస్తుంది. పోని ఒకవేళ గాని అనుకున్నట్టుగానే పని పూర్తి చేసినా రేపు పోస్టుమార్టంలో అనుకూలంగా వస్తుందా? అసలు పోస్టుమార్టందాకా వెళ్లకుండా పని చక్కబెట్టుకోవాలి. అది తరువాత. ముందీపని చేసెయ్యాలి. ఆలోచనలు చిక్కుముడుల్లా ఉండి తెగడంలేదు వాళ్లకి.

పెద్ద కొడుకు పెరటి వైపుగా వెళ్లి పరిస్థితి అంతా చూసి వచ్చాడు. అనుకూలంగానే వుంది. తవిటిగాడ్ని తల్లికి కాపలా ఉంచి, కొట్టు గది నెమ్మదిగా తెరచి పోలిగాడి శవాన్ని మోసుకుపోతున్నారు. మూడు గజాల ముందొకరు, మూడుగజాల వెనుకొకరు. సడయితే చెప్పడానికి గస్తీగా నడుస్తున్నారు. వెన్నెల మంచులాకురుస్తోంది. తుమ్మ చెట్ల అడ్డదారిలో రైలు పట్టాల దగ్గరకు చేరుకున్నారు.

ఇంతలో దూరంగా వెలుతురు టార్చీ వేసినట్టు ... ఆ వెలుగు చూసి గతుక్కుమన్నారు. కాని ఆ వెలుతురు దగ్గరవుతూండడంతో రైలొస్తోందని క్షణాల్లో గ్రహించారు. క్షణక్షణానికి రైలే ముందు కొస్తూ వెలుతుర్ని పెంచుతోంది. దగ్గరవుతున్న రైలు చప్పుడును మించి గుండె చప్పుడు ... ఒక్క గడియ ఆలస్యం చెయ్యకుండా నలుగురూ శవాన్ని అమాంతం ఎత్తి పట్టాలపై పడేసినా కంగారు వల్ల విసిరేసినంత చప్పుడయ్యింది. వెనువెంటనే నలుగురూ నాలుగు డొంకల్లో దాక్కున్నారు. వారిలో భయం, బాధా మిళిత మయ్యాయి. వాళ్ల కళ్లు కన్నీటితో తడిశాయి. ఇంతలో రైలు వచ్చింది. పోలిగాడి శరీరం ముక్కలవడం రైలు శబ్దంలో కలసిపోయింది. అంతా క్షణాల్లో జరిగిపోయింది. సీతాలు అడ్డుపడనందుకు తృప్తి! అంతకుమించి ఏదో అసంతృప్తితో వారి గుండెలు నిండిపోగా ఇల్లు చేరుకున్నారు.

తవిటిగాడ్ని పడుకోమని సైగచేస్తూ, తామొచ్చిన అలకిడి కూడా సీతాలుకి తెలియనివ్వలేదు. సివమ్మాద్రి సీతాలుకి కాపలా ఉంటానని మిగతావార్ని రెప్ప వాల్చమన్నాడు. మరెవ్వరికీ నిద్రలు రావడంలేదు. తెలతెలక నవుతుంటే వాళ్ల రెప్పలు భారమయి మూసుకుపోతున్నాయి. వారితోపాటే సిమ్మాద్రికి కూడా.

తెల్లారి రైలు కమ్మీలు దగ్గరికి వెళ్లి జనం గుంపుని ఛేదించుకుని చూశారు. పోలిగాడి శవం పక్కనే సీతాలు శవమున్నా, రెండు శరీరాలూ ముక్కలైపోయాయి. రక్తం గడ్డకట్టింది. ఈగలు ఝుమ్మని ఎగురుతూ రక్తం రుచి చూస్తున్నాయి.

అంతే! తులుక్కుపడిన సిమ్మాద్రి గతుక్కుమంటూ కూటి రెప్పలోంచి లేచాడు.

చెమటలు పట్టేసింది ఒళ్లంతా మిత్రుల్ని ఆగలెక లెపాడు. సితాలు ఇంకా అలానె కూర్చుని ఉంది.

తెల్లవారేసరికి యాత్రవుతున్నట్టు జనం గుంపులు గుంపులుగా రైలు కమ్మీల కేసి వస్తూ పోతున్నారు. శవం చుట్టూ మూగిపోయిన జనం పెదవి విరుస్తున్నా అందులో జీవితాన్ని ప్రశ్నించే బాధ ఉంది. కొంతమంది పోలిగాడి శవాన్ని పోల్చారు.

పోలిగాడు రైలుకింద ముక్కలయ్యాడన్న వార్త ఊరంతా గుప్పుమంది. సిమ్మాద్రి, కొండయ్య, సూరన్న అంతా రైలుపట్టాల కేసి పరుగు తీశారు. వారి వెంటే పోలిగాడి పెద్దకొడుకూ, నడిపోడున్నూ.

పోలిగాడి శవం రైలుకింద తల పెట్టినట్టు లేదు. శరీరం నడుం దగ్గరకు తెగి రెండు భాగాలయి ఉంది. రక్తం కూడా గూడు కట్టుకుపోయిందేమో తుళ్లలేదు. తెగిన దగ్గర చిమ్మిన కొద్దిపాటి రక్తమూ ఎర్రగా లేదు. నలుపురంగు కలిసిన ఎరుపులా, బిళ్లల్లా ఉంది. శవం దగ్గర కుళ్లిన వాసన కూడా ముక్కుపుటాల్ని చెదరగొడుతోంది.

''పోలిగాడు రైలుకింద పడి చావలేదు .... ఎవరో చంపేసి పడేసినట్టున్నారు!''

'' అదిగో కంపుసూసినావా, ఎలాగేస్తిందో? ఒక రక్తమూ తుళ్లలేదు, రక్తం రంగు సూడండి! ఎవుడయినా మెడకాయెట్టినట్టు సూసినాం గానీ, నడం కాడకంటే ...''

ఆ మాటలు వింటుంటే సిమ్మాద్రికి, వాడి మిత్రులకు చెమటలు పోశాయి. పెద్దోడి పరిస్థితి అలానే ఉంది.. తవిటిగాడు మరి చూడలేక ఏడ్చుకుంటూ కూలబడిపోతే తెలిసిన వాళ్లెవరో పక్కకు తీసుకెళ్లారు.

'' పెద్దోడా! ముందలెల్లి మీ యమ్మని సూడిపో! పరిగెట్టెళ్లురా!'' సిమ్మాద్రి అనుమానంతో వణుకుతూ అన్నాడు. మామ మాటతో పెద్దాడు ఇంటివైపు పరుగు పెడుతుంటే అట్నుంచి పరుగుతో సీతాలు దారిలోనే ఎదురయింది.

'' అవ్మా!'' తట్టుకోలేక పెద్దాడు తల్లిని చుట్టేస్తే, ఆమె అలానే నేలన కూలబడిపోయింది.

'' అమ్మా! కక్కుర్తి పడ్డా కడుపు నిండలేదే, అమ్మా!''

పెద్దాడికి పసిపిల్లాడిలా ఏడుపు తప్పితే మరి మాటలు రావడంలేదు.

''నాయనా! నీవు కూడా మాకన్నేయం సెయ్యకురా!'' అంత దుఃఖంలోనూ, వ్యథలోనూ కొడుకు తలని ఒడిలో నిడుకుంది సీతాలు.

*రచనాకాలం : ఫిబ్రవరి '92.*

*ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, డిశంబరు 22, 28 - 1993*



# తెగిన గొళ్లాలు

ఇంకా చాలా రోజులు ఉందనుకున్న కుసుమ పెళ్లి అంత తొందరగా దగ్గర పడిపోతున్నందుకు అలజడిగానే ఉంది ఆదిలక్ష్మికి. మరునాడు రాత్రికే ముహూర్తం. పెళ్లి పెద్దలై ఉండి , పెళ్లి కుమార్తె తరపున కంకణాలు కట్టుకోవలసి ఉండి ఇంత వరకూ ఊరు బయలుదేరకపోవడం ఆమెకి అదోలాగ ఉంది.

'' అమ్మా! అక్క పెళ్లికి ఇంకెప్పుడెళ్తామే? ... అమ్మా!...'' ఆదిలక్ష్మి పైట గుంజుతూ అడిగాడు చిన్నకొడుకూ, పదేళ్ల వాడూ అయిన రాజు. పెళ్లికి ఇంకా బయలుదేరనందుకు వాడికి కోపంగానూ, అంతకంటె బాధగానూ ఉంది.

కొడుకు అడిగిన మాటకు ఆదిలక్ష్మి సమాధానమిచ్చే స్థితిలో లేదు. ఏదో అందని ఆలోచనలతో ఆందోళన పడిపోతోంది. బెంగగా, బితుకుగా ఉంది.

తల్లిని కుదుపుతూ రాజు మళ్లీ అదే ప్రశ్న వేశాడు.

''నువ్వొక్కడవూ వెళ్లిపోరా!'' అన్న తల్లి ఎందుకలా మాట్లాడిందో రాజుకి అర్థం కాలేదు. చెప్పినా వాడికి అర్థం కాదు. చెప్పే వోపిక ఆమెకీ లేదు. ఏమనుకున్నాడో రాజు వీధిలోకి బాధగా వెళ్లిపోయాడు.

ఆదిలక్ష్మి ఆలోచనలకి మాత్రం అంతం లేదు తను పెళ్లయి కొత్తగా కాపురానికి వచ్చిన రోజులు కళ్ల ముందు మెదిలాయి. ఆయనగారు రోజుకి సగం గంటలు డ్యూటీలోనే గడిపేవారు. డ్యూటీ ఎనిమిది గంటలే అయినా స్టీలు ప్లాంటుకు వెళ్లిరావడమంటే మరో నాలుగు గంటల ప్రయాణం. డ్యూటీ కంటే వెళ్లి రావడమే కష్టమనే వారు.

పెళ్లయిన కొత్తలో పెనిమిటి రోజంతా తనతోనే ఉండాలనిపించేది. అదే కోరిక అతనికీ ఉన్నా '' నిన్ను కట్టుకోక ముందే ప్లాంటు నన్ను కట్టుకుంది'' అని నిట్టూర్చేవారు. ఆ నిట్టూర్పులో కూడా వెళ్తూ తన్ను దగ్గరికి పిలిచేవారు. డ్యూటీకి వెళ్లేముందు సినిమాల్లోలా 'ముద్దు' పెడతారేమోనని చాలాసార్లు చూసింది. కా ని పిలిచిన ప్రతీసారి పెట్టించేవారు ఏమిటి? 'ముద్దు' కాదు బొద్దుగా వుండే తాళం కప్ప!

కటకటాలకి లోపల్నుండి తాళం వేస్తూ ''పట్టపగలు కూడా ఎందుకూ!'' అన్నట్టు చూసింది ఆదిలక్ష్మి.

''రోజు రోజుకి దొంగల భయం ఎక్కువవుతోంది. నాకోసం ఆలోచిస్తూ నీ వా గదిలో వంట చేస్తుంటే అవతల ఎవరో వచ్చి ఇల్లు సర్దేస్తాడు'' సంజాయిషీ ఇచ్చాడు.

ఇలా అన్నిటికన్నా ముందు గుర్తొచ్చేది తాళం కప్ప. భర్తకి భార్యకంటే, భార్యకి భర్త కంటే... ఇద్దరికీ భగవంతుడి కంటే కూడా! ఇంటికి తలుపులు ఎంత అవసరమో, తలుపులకి గొళ్లెమెంత అవసరమో, గొళ్లేనికి తాళం కప్ప అంత అవసరం!

తాళం గొప్పతనాన్ని అప్పటికే కొంత అర్థం చేసుకోగలిగింది ఆదిలక్ష్మి ఇంట్లో ఉండే వారంతా కుటుంబ సభ్యులే అయినా సూట్‌కేసులకి, పెట్టెలకి తాళం ఎందుకేస్తారో తర్వాత తర్వాత అర్థమయింది.

ఇప్పుడు ఇంటికి తలుపులున్నాయి. తలుపులకి గొళ్లాలున్నాయి. గొళ్లాలకి బాంబ్రకప్పంత తాళాలున్నాయి. అయినా పెళ్లికి వెళ్లాలంటే భయమే! భయముండదూ?! ఎంతటి తాళం కప్పనూ తలదన్నేలా తయారయింది మాయదారిలోకం! పగలయినా, రాత్రయినా ఒకటే! పాడయిపోయింది లోకం. ఎంతగా అంటే భర్త, నలుగురు మగపిల్లలూ అంతా ఉన్నా తలుపులు తాళం వేసుకున్నా సరే ఏ అర్ధరాత్రో, అపరాత్రో ఎవడో దొంగ వెధవ కిటికీలోంచి కర్రకి దోని కట్టినట్టు కొక్కెం కట్టి మరీ స్టాండుకున్న బట్టలు లాగేసి పట్టుకుపోయాడు. నయం, చొక్కా జేబులో యాభై రూపాయలే ఉన్నాయి. అదిగో అది మొదలు రాత్రులు పడుకొనే ముందు కిటికీలు బిడాయించుకొని మరీ పడుకోవడమే! కరెంట్‌పోయినా, దోమలు కుట్టినా, ఊపిరి సలపకపోయినా, వేడి ఆవిర్లతో రాత్రి కనురెప్పలు పడకపోయినా అలా తెల్లవారవలసిందే! మంచి గాలి కాదు, ఏ గాలీ పీల్చుకోలేని స్థితి. కష్టంగా మొదట్లో అనిపించినా తరువాత అలవాటుగా మారింది.

''పోలీసులున్నా రెందుకు?'' ప్రశ్నించుకుంది ఆదిలక్ష్మి.

''దొంగల్ని పట్టుకోవడానికి?''

తన సమాధానం తనకే నవ్వు తెప్పించింది. అసలీ పోలీసులు ఎవరికోసం? వీళ్లెవరికి కాపలా కాస్తున్నారు? తమ ఇంటికి కాపలా కాకపోతే ఈ వీధికీ, ఈ వాడకీ? లేకపోతే పోలీసు స్టేషన్‌లకీ ( స్టేషన్ ని ఎవడైనా ఎత్తుకెళ్తాడనా), బాగా డబ్బున్న వాడికీ, రాజకీయ నాయకులకీ మంత్రులకూ కాపలా కాస్తారు! పోలీసు లుండేది వాళ్ల కోసమేనేమో?

చాలా బాధనిపించింది ఆదిలక్ష్మికి

గత కొద్ది రోజులుగా నగరంలోనూ, చుట్టుపక్కలు జరిగిన కొన్ని సంఘటనలు, వాటిని నిరూపిస్తూ పేపర్లో ఫోటోలు, వార్తలు కళ్ల ముందు మెదిలాయి.

అసలీదోపిడీలు, దొంగతనాలు ఎందుకు జరుగుతున్నాయి? దొరికితే పులుసులోకి ఎముకలు కూడా మిగలవే! జైల్లో పెట్టి కొట్టి కొందరైతే అక్కడే నిజం చెప్పమని తన్ని తన్ని చంపేస్తారు కూడానట! మరి ప్రాణాలకు తెగించి అందరూ ఎందుకు చేస్తారు? కొందరుంటే ఉండొచ్చు. తిండికి లేకనా? ఆకలి ఎంత పనైనా చేయిస్తుంది. అన్నమా మరేమిటి?

ఆదిలక్ష్మి ఆలోచనల వల్ల అరగంట నుంచీ గొంతు చించుకుంటున్నది భర్త అని గ్రహించలేదు. ఆయన అరుగు మీద అసహనంగా కూర్చుండిపోయాడు. ఆటకుపోయిన రాజొచ్చి కేకేస్తే అప్పుడు చూసింది భర్తని.

జగన్నాథం ఇంటి లోపలికి అడుగుపెట్టడంతోనే అందుకున్నాడు. '' ఎక్కడున్నావ్? కొత్తగా పెళ్లయిన ఆడకూతుర్లా ఆ ఆలోచన లేమిటి? లేకపోతే ఆ కొత్తగా పెళ్లవలసిన జంట గురించి ఆలోచిస్తున్నావా? కుసుమని నీ కూతురనుకున్నావే? కాళ్లు కడిగి కన్యాదానం చేస్తేనేనా పుణ్యం వస్తుంది? అసలు కూతుళ్లు లేరని నీ కంత బాధ ఎందుకూ అంట? అలాగయితే మగపిల్లలు లేనివారికి వంశమేముందే? పైగా కొడుకు కొరివి పెట్టకపోతే, పిండం పెట్టకపోతే మరి మోక్షమే లేదట! నీ కా నలుగురు కొడుకులున్నారు.'' అని ఆగిపోయిన భర్తని అర్థం కానట్లుగా చూసింది ఆదిలక్ష్మి.

అర్థమైనంత జీర్ణించుకొని, కుసుమ పెళ్లికి కట్నం తామే ఇస్తే కాళ్లు కడిగి కన్యాదానం చెయ్యొచ్చన్న చెల్లెలు, మరిది జ్ఞాపకం వచ్చారు. ''డబ్బు దొరకలేదా?'' అడిగింది ఆదిలక్ష్మి

''డబ్బు దొరికింది, అది కాదు సమస్య ''. జగన్నాథం నుదుట మడతలు.

''మరి ?'' ఆత్రంగా అడిగింది ఇంకా అర్థంకాని ఆదిలక్ష్మి.

అప్పుడు చెప్పాడు జగన్నాథం.'' కుసుమ వాళ్ల సంతానంలో మొదటిదట. జ్యేష్ఠ పుత్రిక కాబట్టి, ఆ అమ్మాయికి తల్లిదండ్రులే కన్యాదాన మిస్తే మంచిదట. మీ చెల్లెలికీ, మరిదికీ, ఇలా అందరూ తలో మాటా అంటే ఈ నిర్ణయానికి రావలసి వచ్చిందట. అయినా ఇంకా ఇద్దరాడ పిల్లలున్నారు కదా! అని మనకి గుర్తు చేస్తూ రాశారు.''

'' రేపు పెళ్లి పెట్టుకొని ఈ రోజు చెప్పడమేమిటి?'' ప్రశ్నించింది ఆదిలక్ష్మి.

''.... మనం వస్తామని చూస్తున్నారట. పెళ్లికార్యం తల మీద పెట్టుకొని రాలేకపోయారట. లేకపోతే వచ్చే చెప్పుండేవారట. మీ చెల్లయితే ఏడ్చిందట, పాత విషయమే మళ్లీ గుర్తు చేశారు. మనకి నలుగురు మగపిల్లలు. వాళ్లకి ముగ్గురు ఆడపిల్లలు పుట్టే అవకాశం ఇక ఎలాగూ లేదు కాబట్టి చంటి పిల్లల్ని, అంటే మన రాజుగాణ్ణి వాళ్లకిచ్చి వాళ్ల అరుణని మనం తెచ్చుకుంటే బాగుండేదట మనకి ఆడపిల్ల ముచ్చట, వాళ్లకి మగపిల్లడి ముచ్చట తీరిపోయేదట!''

జగన్నాథం మాటలకు మళ్లీ అడ్డు తగిలింది ఆదిలక్ష్మి.

'' ఇప్పుడా విషయాలన్నీ ఎందుకట? ఎప్పటి మాటలో మళ్లీ ఆడి, ఇచ్చిన మాట దాటిపోయామని దాయడానికా? అసలు కుసుమ నీ కూతురే! నువ్వంటే దానికి ఇష్టం అదంటే నీకు ఇష్టం. తప్పిపోయి మా ఇంటిలో పుట్టిపోయిందిగాని...'' అయినా ఇప్పుడేమయిపోయింది? ఒక పేగు ఎరుసనా? నువ్వు నాకు రక్తం మిగిల్చితే కదా నేను పుట్టాను - అంటే అదీ నీ రక్తం పంచుకుపుట్టినట్టేనని మా చెల్లి మాయ కబుర్లుచెప్పింది. ఇప్పుడేమో...'' మరి మాటలు రావడం లేదు. దుఃఖం తెరలు తెరలుగా పొంగుకొస్తోంది.

భార్య అలా కుమిలి కుమిలి ఏడ్చేసరికి జగన్నాథం శాంతంగా, సహనంగా, ఆలోచనతో మాట్లాడాడు.

''ఆదీ ! ఇప్పుడేమయిందని? పాపం కుసుమ 'అమ్మ రాలే' దని నీ కోసం ఏడుస్తోందట. వారం ముందొస్తానని అన్నావట - అదీ తను నెల రోజులు ముందు రమ్మంటే.' ఆ దిలక్ష్మి ఇంక జగన్నాథాన్ని మాట్లాడనీయలేదు. కళ్ళు రెండూ రెండు మండలతో చిన్న పిల్లలా పులుముకుంటూ - '' అది నా కేమవుతుంది? వాళ్ల అమ్మా, నాన్నా ఉన్నారుగా!'' అంది.

''ఛ! అవేం మాటలు? పెద్దవాళ్లం మనం మనం ఏదో పడతాం పిల్లల మనసు ఎందుకు విరచడం? అదేవిషయం తనూ రాసి, వా ళ్ల అమ్మానాన్నా లెటరు అందించిన మనిషితో పంపించింది. మనం మాత్రం మనబ్బాయిని ఇంకొకరికి...'' ఆదిలక్ష్మి ముఖం చూసి ఆగిపోయాడు జగన్నాథం.

''అమ్మా! ప్లీజ్ అక్క పెళ్లికి వెళ్దామే!'' బ్రతిమలాడినట్టు తల్లి గడ్డం పట్టుకున్నాడు రాజు. 'సరే' అని ఆదిలక్ష్మి అన్నదాకా విడువలేదు. తరువాత వాడి ఆనందానికి అవధుల్లేవు.

'' అదీ! ఆకలేస్తోంది. అన్నంపెట్టు''. జగన్నాథం అన్నాకే కూర్చున్న చోటు నుంచి లేచి నిల్చుంది ఆదిలక్ష్మి. ముఖం చెంగుతో తుడుచుకొని భర్తకీ, కొడుక్కీ రెండు కంచాల్లో వడ్డించింది. అప్పుడే నడిపి కొడుకు. మళ్లీ వాడికి వడ్డించింది. అంతా భోంచేస్తుంటే తల మీద చేతులు వేసుకొని ద్వారానికి చేరగిలబడిపోయిందామె.

అందరి భోజనాలయినా, ఆదిలక్ష్మి ఇంకా ఏదో ఆలోచిస్తున్నట్టుగానే ఉంది.

జగన్నాథమే కదిపాడు. '' నువ్వూ భోంచెయి కలిపిన అన్నం వదిలేశాను. చప్పగయిపోతుంది.'' కంచాన్ని ఆమె ముందుకు తోశాడు..

ఆ వదిలిన కంచంలో మరికొంచెం అన్నం వేసుకొని, అందులోనే వారగా కూర వేసుకుంది.

ఆదిలక్ష్మికి ఆ విధంగా వదిలిన ఎంగిలి కంచంలో తినడం అలవాటే! అసలు ఆ విధంగా అన్నం వదలకపోతే ఆమెకు మహాకోపం. తన తల్లి నుండి తనకా గుణం సంక్రమించింది. పెనిమిటి వదిలిన కంచంలోనే పెళ్లాం తినాలట!.

'' ఇంతకీ ఇంట్లో ఎవర్నుంచి వెళ్దాం. ఎవ్వరూ లేకుండా ఇల్లొదిలి వెళ్తే రోజులసలే బాగోలేవు. '' భర్త అన్న ఈ మాట ఆదిలక్ష్మి కి అన్ని సమస్యల కంటే పెద్ద సమస్యలా అవుపించింది.

''తాళం వేసి వెళ్దాం.'' చిన్నాడు రాజు సలహా ఇచ్చాడు.

ఒకప్పటి తాళానికి ఇప్పుడు విలువలేదని తేలిపోయినట్లనిపించింది ఆదిలక్ష్మికి. 'తాళం వేశామన్న మాటేగాని ఎప్పుడు భయం లేదు గనక?' అనుకుంది.

''తాళం వేసినా మనిషుండాలి. రాత్రు లెవరో పడుకుంటే సరిపోతుంది.'' భార్య

పెదవి దాటి మాట రాకపోయేసరికి జగన్నాధమే అన్నాడు.

'' తాళం పోయి మని షొచ్చాడు. ఆ మనిషి ఉన్నా భయం లేదూ? ఇంట్లో ఇంటెడు మనుషులుండి రాత్రి ఏ పిల్లి దూకిన చప్పుడయినా అమ్మో ఏమిటి? ఎవడొచ్చాడు అని నిద్రలేచి, టార్చి వేసి కాచుక్కూర్చోలేదూ?'' మళ్లీ తనలోనే అనుకుంది ఆదిలక్ష్మి.

'' ఎవర్ని పడుకోమనడం? మన మనుషులుంటే బాగుండును. నమ్మకమయి నోళ్లయితేసరి. ఇల్లు అప్ప చెప్పామంటే బాధ్యతున్నట్టు చూసుకోవాలి. ఇరుగూ పొరుగులో ఎవరు?'' మళ్లీ అన్నాడు జగన్నాధం.

'' మళ్లీ మంచిరకం మనిషి '' ఆదిలక్ష్మి ఆలోచనలు సాగలేదు.

భార్య మాట్లాడకపోయేసరికి ఇంకా కన్యాదానం గురించి ఆలోచిస్తోందోమోనను అనుకొని '' పెళ్లికి వెళ్లాక పీటల మీద నీ కూతురు వుండగానే, నీ చెల్లెల్నీ, మరిదిని కడిగేద్దువులే! ముందు ఇంట్లో ఎవర్ని పెడతామో ఆలోచించు'' అన్నాడు జగన్నాధం.

అప్పుడు ఆదిలక్ష్మి నోరు విప్పింది - '' ఇదా పెళ్ళిళ్ల సీజను. ఎవర్ని ఉండమన్నా అందరూ మాకూ వున్నాయని అంటున్నారు. అందుకే గద ఇంతవరకు వెళ్లకుండా ఉండిపోయింది!''

''రేపే పెళ్లి.'' రాజు బాధ రాజుది.

'' నువ్వుండిపోతా వట్రా! వచ్చాక సినిమాకి తీసుకెళ్తాను.'' ఆటపట్టించాలని నవ్వుతూ కొడుకుని అన్నాడు జగన్నాధం.

'' ఆ...అబ్బా నే నుండను. ఉదయం అడిగితే అమ్మ నన్నొక్కడ్నీ వెళ్లిపోమంది.'' అమ్మ అర్ధరయిపోయినట్టు గొప్పగా చెప్పాడు రాజు.

'' అన్నాను కదా అని ఒక్కడవూ వెళ్లిపోగలవురా? అయినా నువ్వేం వస్తాదువా నిన్ను కాపలా ఉంచి మేం వెళ్లడానికి? నీ అన్నలు ముగ్గురున్నా రెందుకు? అవసరానికే మనుషులు కరవు. గొప్ప చేస్తున్నాడు మీ పెద్దన్నయ్య. సెలవులు దొరకలేదని ఉత్తరం మాత్రం రాశాడు. మీ చిన్నన్నయ్య అదిగో, ఇంట్లో ఉన్నాడంటే వాడు మీ చిన్నయ్యకి ఇష్టమైన కొడుకు. పనిసాయం చేస్తాడట. వాణ్ణి తీసుకెళ్లకపోతే దెబ్బలాడతారు. మీచిన్న చిన్నన్నయ్య ఉన్నాడంటే చదువని, కోచింగ్‌లని రానేలేదు.'' విసుగ్గా అంది అలసిపోతూ ఆదిలక్ష్మి .

కొన్ని క్షణాలు గడిచాక - ''అవునే, పక్కింటి పాపాయమ్మ కొడుకుని ఇంట్లో పెట్టి వెళ్తే ?'' నెమ్మదిగా అడిగాడు జగన్నాధం.

ఆదిలక్ష్మి మాత్రం నెమ్మదిగా చెప్పలేదు సమాధానం. '' వాడా... వాడాండీ? మీ కేటి బుద్ధుండే మాట్లాడుతున్నారా? ఆ ఛండాలుడు వాళ్ల నాన్న జేబులే కొట్టేస్తాడట. వాళ్లమ్మ ఏ పోపుల డబ్బాలో దాచినా, కడుపులో పెట్టుకున్నా అసలు తినే పదార్థమే ఉంచడట !అవునండీ! కాకపోతే ఆ సాయమ్మ కూతుర్ని వీడిన్ని సార్లు సినిమాలు చూసింది కాక, దాన్ని తీసుకెళ్తాడట. మనమే జీతాలెత్తి నెల కో సినిమా అయినా...''

చెపుతూనే ఉంది.

'' ఆపవే, అంత గట్టిగా చెప్పాలా? వాళ్ళు మన మీదికి యుద్ధానికి రావడానికా? ఆ సంతంతా ఎందుగ్గాని, ఇంకెవరున్నారో చెప్పు? మధ్యలో అడిగాడు జగన్నాథం

''అవున్రా నడిపోడా, మీ స్నేహితుడు కామేసో?'' ఆదిలక్ష్మి అడిగింది రెండో కొడుకుని.

''వాళ్ళ మామయ్య కొడుకు పెళ్ళికి వెళ్ళాడమ్మా?'' చెప్పాడు.

''మరి నారాయణ, తేజ వాళ్ళో?'' తండ్రి అడిగాడు.

ఏమనుకుందో ఆదిలక్ష్మి వెంటనే ''వాళ్ళొద్దు, వద్దులే. లేకపోతే లేదు'' అంది. ఈ సమస్య ఎప్పుటికి తెగుతుందో అని చూస్తున్నాడు రాజు.

''అవునూ పెరటి అంబుజం వాళ్లకి తాళం ఇస్తే?'' నడిపోడు నసిగాడు.

వెంటనే అందుకుంది ఆదిలక్ష్మి ''ఆలా, వాడు కాస్ప్ ఒగ్గేసుకున్నాడు మందని, ఈ గుంటముండ పాపలందరు ఎక్కితొక్కిరూ? తల్లితో వస్తేనే కళ్ళెగ్రజేస్తున్నా వినకుండా టీవీ తిప్పేసి ఇవి లాగేసి అవి తాగేసి, అయినా ఒట్టప్పుడే ఆయమ్మ, అదియ్యోదినా ఇదియ్యోదినా అని ఒకదాని కొచ్చి రెండు తీసుకెళ్లేది. అలాటిది... తాళా లిస్తే ఆర్లిక్స్ పాలగుండ, పంచదార, నూనె... అన్నీ ఉన్నా యింట్లో పొపుల్లగ్గిర్నుంచి.''

''మరి ఏదీ కాకుండా, ఎవరూ లేకుండా ఎలాగ?'' ప్రశ్నించాడు జగన్నాథం.

పెద్ద సమస్యొచ్చి దేశం మీద మనుషులే లేనట్టుంది వారికి. మనిషి - ఒక్క మనిషి కనిపించడంలేదు.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

''అయినా మన దగ్గరేముంది ఎత్తుకుపోవడానికి? అయినా బెంగ. గుండె నిబ్బరానికి ఎవులో ఉండాలి. లేదంటే పెళ్లికి వెళ్లినా ధ్యాసంతా ఇటే ఉంటుంది.'' స్వగతంగా పైకే అంది ఆదిలక్ష్మి.

''మొన్న మంగ... కొళాయి దగ్గరిల్లు... మంగ పెళ్లికి వాళ్ల సొంత అన్నయ్యే ఇంట్లో ఎవరూలేరని పెళ్లికి వెళ్లలేదు. ఎవరయినా ఏమిరా మీ చెల్లి పెళ్ళికి వెళ్లలేదూ? అంటే పెళ్లి జరిగిన రోజు ఇంటికి తాళం వెయ్యకూడదు. దీపం దేవుడికి పెట్టి ఉంచాలి అని మాట్లాడుతున్నాడు. అది నిజమేనమ్మా!'' అడిగాడు నడిపోడు.

ఏం మనను మార్చుకుందో '' ఏమోరా, అయితే నువ్వుండిపోకూడదూ?'' టక్కున బతిమాలుతున్నట్టుగా అంది ఆదిలక్ష్మి.

వాడు రెండు నిముషాలు మాట్లాడలేదు. తర్వాత అన్నాడు. ''సరే లేకపోతే ఏం చేస్తాం? నన్నుండమంటే ఉంటాను.''

రాజు - ''అన్నయ్యరాడా?'' అని ఆందోళనతో మొఖం వెల్లబెట్టాడు.

జగన్నాథం ఏదో ఆలోచిస్తున్నాడు. ఆదిలక్ష్మి మాత్రం ''నాయమ్మ.. నాయమ్మే'' అని మెచ్చుకుంది. ''కావాలంటే మేం వచ్చిన వెంటనే నీవు వెళ్లి వారం రోజులు ఉండి

వద్దువుగాని, సరేనా?'' అంది. వాడు మాట్లాడకపోవడం, తల్లి మెచ్చుకోవడం - నడిపోడు ఖాయం అన్నట్టుంది.

ఇరవై రెండేళ్ల కొడుకుని ఇంట్లో ఉంచడానికి ఆదిలక్ష్మి ధైర్యంగా ఉన్నా, జగన్నాథం మాత్రం అందుకు సిద్ధంగా లేడు. మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది.

జగన్నాథానికి కొడుకు వయసులో ఉన్న తన గతం గుర్తుకు వచ్చింది. పెళ్లికి ఒక సంవత్సరం వుండవచ్చు. ట్రైనింగ్ పిరీడ్‌లో ఒంటరిగా ఉన్నప్పుడు వయసు ఊరుకోనిచ్చేది కాదు, నరాల్లో ఏదోకదలిక, ఆరాటం. అంతా ఓ చోట చేరి మధు పుస్తకాలు సంపాదించి చదవడం, మధన, మన్మథల్లో, బొమ్మలు చూస్తూ కాలాన్ని వెళ్లబుచ్చడం. మొదట్లో ఆనందం, తర్వాత అసహ్యం, మళ్లీ ఒంటరిగా ఉన్నప్పుడు అవే దృశ్యాలు గుర్తుకొచ్చి నిద్రపట్టేది కాదు. చదువు మీద మనసు నిలిచేది కాదు. డబ్బుల్లేకగాని ఉంటే వెళ్లేవాడేమో! అంతగా వెళ్లాలనిపించేది. ఒక్కోసారి వద్దు అనిపించేది. ఏది ఏమయినా బుర్ర పాడైంది. అలానే చదువూ కాస్త చెడింది.

మరి ఈ కాలం కుర్రోళ్లని అసలు పట్టలేం. సినిమాకని చెప్పి స్నేహితుల ఇళ్లు ఖాళీగా దొరికితే చాలు. బ్లూ ఫిల్ములూ, మందు పార్టీలూ! ఈ వయసులో మతి తప్పితే జీవితపు గతి తప్పినట్లే!

అంతే! ''నడిపోడు ఇంట్లో కాపలా ఒక్కడూ ఉండడానికి వీల్లేదన్నాడు'' జగన్నాథం.

ఆదిలక్ష్మికి అర్థం కాలేదు. అదే విషయం అడిగింది.

''నీకు తెలీదు ఊరుకో'' అన్నాడు.

అంతలోనే ''పాపం వాడి ఒక్కణ్ణే ఏం వదిలి మనమంతా వెళ్తాం? ఎలాగూ వాళ్లిద్దరూ లేరు'' అన్నాడాయన.

ఆదిలక్ష్మి భర్త మాటలు విని ఏమనుకుందో, ఏమో కాసేపు ఆలోచించి 'సరే' నంది.

''అయినా మన దగ్గరేముంది? ఏమ్మి తీసుకుపోతాడు ఎవడైనా?'' ఆ మాట అవసరమైనప్పుడూ, కానప్పుడూ అంటునే ఉంది.

'' ఏదైతే అదే అయ్యింది'' అనుకున్నారు.

అప్పుడు దోపిడీలు, దొంగతనాల గురించి కదిలింది. రాజు మధ్య మధ్యలో ప్రశ్నలేస్తూ, వాళ్ల పాఠంలో దొంగలు చివరకి మంచి వాళ్లయినట్లు చెపుతుంటే ఆదిలక్ష్మి ఆగలేక '' ఆ.. అది కథ'' అంది.

''కాదు నిజమే'' అనాలనుకున్నాడు రాజు. కాని మళ్లీ తల్లి వాడికా అవకాశమివ్వలేదు. తన చిన్నతనంలో వాళ్ల ఊళ్లో జరిగిన దొంగతనాల గురించి చెప్పింది. అప్పుడు దొంగలు తక్కువట. ఇంతలా పెచ్చుమీరి పోలేదట. అధవా ఎవడో దొంగతనం చేసిదొరికితే - పోలీసులకి అప్పజెప్పేవారు కాదట. అసలు పోలీసు ఊరికి ఒక్కడూ

ఉండేవాడు కాదట. అప్పుడే దేశం బాగుండేదట. ఇప్పుడు పోలీసులే జైల్లో నుండి దొంగల్ని వదిలి దొంగతాలు చేయిస్తున్నారట. దొరికినకాడికి వాటాలు వేసుకుంటున్నారట. లోకమిలా అయిపోతున్నందుకు భగవంతుణ్ణి తిట్టిందీసారి ఆదిలక్ష్మి.

''మరి దొంగలు దొరికితే పోలీసుల కప్పజెప్పక ఏం చేసేవారు?'' మధ్యలో తల్లి వదిలేసిన విషయం తాను మాత్రం వదల్లేదు. రాజుకి ఆసక్తిగా ఉంది.

'' ఆ... దొరికితే ఆడి పాపం పూరాపండిపోయినట్టే! ఇక చూస్కో, మంగల్ని పిలిచి నున్నగా గుండు గొరిగించి, ఆ గుండు మీద పిండి చుక్కలు పెట్టి, ముఖానికి మసిబొగ్గుతో నామాలు దిద్ది, కుండ మట్టు మెడలోదించి, స్తంభానికి కట్టి, గుండగ చితగొట్టి, గాడిద ఎక్కించి ఊరేగించేవారు. మేం అప్పుడు చిన్నగుంటలం కదా వెనక పరిగొట్టి వోళ్లం. అన్నట్టు చెప్పడం మరిచిపోయాను ఆ దొంగోడి మెడలో పిడకల దండవేసి మరీ..'' కళ్లెదురుగా జరుగుతున్నట్టు చెప్తోంది ఆదిలక్ష్మి.

''తరువాత దొంగా డేం చేసేవాడు?'' చిన్నాడి ప్రశ్న.

'' ఇంకేటి చేస్తాడు? ప్రాణం పోయినా పరవాలేదు. పరువుపోతే ఆ బ్రతుకు ఎందుకు? ఎందులోపడి చావక!'' రోతగా అంది ఆదిలక్ష్మి.

ఆ చెప్పే విధానికి జగన్నాధం కూడా నోరు వెళ్లబెట్టాడు. తర్వాత తేరుకొని ''బుద్ధిగా చదువుకోక, వీథిలో ఎక్కడ చూసినా నువ్వే నన్నమాట!'' వ్యంగ్యంగా అన్నాడు.

''మరి మీ ఊర్లో ఇలాంటివి జరిగాయేంటి?'' చిన్నపిల్లలా అడిగింది ఆదిలక్ష్మి.

'' ఏంటి అమ్మా నీదొక ఊరూ, నాన్న దొక ఊరా?'' అర్థం కాలేదు చిన్నాడికి.

''మా ఊరు మీ అమ్మమ్మ వాళ్ల ఊరు. మీ నాన్నాల ఊరు మీనాయనమ్మున్న ఊరు.'' కొడుకు సందేహం తీర్చేసింది ఆదిలక్ష్మి.

''మరి నాన్నా! మీ ఊళ్లో దొంగతన మేమన్నా జరిగిందా!'' చిన్నాడీసారి తండ్రి నడిగాడు.

జగన్నాథం మాటాడకపోయేసరికి ఆదిలక్ష్మి అంది. ''ఆయనేం చెప్తుతారు? వాళ్లి ఊర్లో దొంతనమే జరగనట్టు ఎలా చూస్తున్నారో చూడు.''

'' ఏంటి, ఒక్క దొంగతనమూ జరగలేదా?'' వాడి కెందుకో చాలా ఆశ్చర్యంగా ఉంది. ''ఆ.. దొంగలుపడని ఊరంటూ లేదు.'' నమ్మకంగా చెప్పింది ఆదిలక్ష్మి. చిన్నాడి ఆశ్చర్యం తొలగిపోతోంది. తండ్రిని చెప్పమని గుంజాడు.

జగన్నాధం చెప్పడం ఆరంభించాడు. ''.. మాచిన్నప్పుడు మా పక్కింట్లో దొంగలు పడి అన్ని సామాన్లు ఉన్నా ఏదీ పట్టుకుపోకుండా వంట గదిలో దూరి అన్నం, కూర అన్నీ కడుపునిండా తిని కుండ పగలకొట్టి పోయారు.''

చిన్నాడికి తండ్రి చెప్పింది చప్పగా తోచింది.

''దొంగ లెక్కడి నుండో కుండ కూలి కట్టుకొనిరారు. ఆ వాడలోనోళ్లూ, ఇరుగూ

పొరుగోళ్లంతే.'' ఈ మాట అంటూ తన ఇరుగూ, పొరుగూ పెరటి ముందల వాసన వాళ్లని ఒక్కసారి గుర్తుకు తెచ్చుకొంది. ఎవరెలాంటి వాళ్లో ఏ పుట్టలో ఏ పాముందో మళ్లీ భయం వేసింది ఆదిలక్ష్మికి.

ఈ దొంగతనాలు, దోపిడీలు మాట్లాడాక ఇంటికి తాళం వేసి పెళ్లికి వెళ్దామన్న పెనిమిటితో పేచీ పడింది ఆదిలక్ష్మి. చివరకు విసిగిపోయిన జగన్నాధం తనే ఉంటానని, పిల్ల లిద్దర్నీ తీసుకొని భార్యని ప్రయాణం కమ్మన్నాడు.

అప్పటికే సాయంత్ర మవుతోంది. ఈ ఆలోచన బాగానే ఉన్నట్లనిపించింది ఆదిలక్ష్మికి

''మీ రుంటే ఇంక భయ మేమిటి? పిల్లలు నాకు తోడుంటారు'' అంది. కంకణాలు కట్టుకొని కన్యాదానం ఇచ్చుకోడానికి అయితే ఇద్దరుండాలిగాని ఇప్పుడొక్కరు వెళ్లినా పరవాలేదు. అందుకే మనసు స్థిమితపడింది.

జగన్నాథం ఆదిలక్ష్మిని బయలు దేరమన్నాడు. ఆదిలక్ష్మి ముఖం కడుక్కొని చీర మార్చుకొనేలోపు ఆలోచన మారిపోయింది.

'' ఏమండీ నా కయితే వెళ్లాలని ఉంది. కాని ఇప్పుడే సాయంత్రమైపోయింది. ఊరు చేరేసరికి ఏ రాత్రి పదకొండో, పన్నెండో. కాలాలు చూస్తే బాగాలేవు. వస్తువులు, తీసేసి రుమాల్లో చుట్టి బొడ్లోనో, జాకెట్లోనే దోపుకున్నా ఈ చెవుల్లోవి, ముక్కుల్లోవి చాలు, ఆ దారిని కాచిన వాడికి మెడలో పుస్తెలు చాలు. పుటుక్కున తెంపుకుపోవడానికి! ఆతరువాత అర్రెంటే రాదు... బుర్రంటే రాదు!'' భయాన్ని వెలిబుచ్చింది ఆదిలక్ష్మి.

''సరే, అయితే పొద్దున వెళ్దువు, ఉండిపో'' అన్నాడు జగన్నాథం.

ఆదిలక్ష్మి కట్టిన కొత్త చీర విప్పి పాత చీర కట్టుకుంది.

పిల్లలు నీరసించిపోయారు!

ఆ రాత్రి

చిన్నాడికి రేపు వెళ్లబోయే ఊరిని, పెళ్లిని తలచుకొని నిద్రపట్టింది కాదు.

నడిపాడు అంచనాకు అందని లోకాన్ని జానాబెత్తుల తన మెదడుతో కొలచి, ఇంక ఆలోచించలేక నిద్రపోయాడు.

జగన్నాథానికి ఆ రోజు జరిగిన చర్చ, భార్య తీరు గుర్తు కొచ్చి కొంత నవ్వు, కొంత నిరాశతో చాలా సేపు గడిపి అర్ధరాత్రి దాటాకే నిద్రలో జోగాడు.

అర్ధరాత్రి అయినా ఆదిలక్ష్మికి నిద్రరాకుండా ఉంది. కాసేపు కన్యాదానం గురించీ, ఆ ఆశ నిరాశయినందుకూ బాధపడింది. తర్వాత పెళ్లి ప్రయాణం గురించి ఆలోచించింది.

తనొక్కర్తే వెళ్తే భర్త రానందుకు అంతా తనని తిట్టరూ? తిడితే తిట్టనీ! లేకపోతే ఇంటి దగ్గరెవరుంటారు? రేపు పెందరాళే లేచి వంట చేసేస్తే ఆయనకి భోజనానికి ఇబ్బందుండదు. రేపు గడిచిపోతుంది. ఎల్లుండికి మరి? ఛీ! ఈయనకి వంటరాదు,

---

పిండొడిం

ఛ్ఛ! ఆ ఎదురింట్లో వనజాక్షిని కసిన్ని బియ్యం పొంగించి ఇమ్మంటే ఇస్తుంది. అమ్మో! వద్దు. అవి డసలే బావగా రంటూ సరసాలకి పోతుంది. తనుంటేనే జంకదు. లేనప్పుడు ఇంకేమన్నా ఉందా? ఆయన ఉన్నారని తెలిస్తే కావాలనే వస్తుంది. లేరు కదా అని చెప్పి కూర ఇస్తుంది. ఏదో అంటుంది. ' ఇక చాలు' ఈయన ఊరుకుంటారా దాని మాటలకి, ఆ వగలాడి చిన్నెలకి? ఈ మగాళ్లని నమ్మకూడాదు. మెత్తగుండే కొంపలు ముంచేస్తారు. ఏముంది? ఇద్దరూ ఒకసారి ఆ అవకాశం దొరికితే ఇంక వదులుతారా? తన కొంప కూలిపోదూ? కొల్లేరు కాదూ?

ఆదిలక్ష్మికి భయమేసింది. చెమట పట్టింది. భర్తను వదిలిపెట్టకూడదనుకుంది. వెళ్తే ఇద్దరూ కలిసయినా వెళ్లాలి. లేదా తనయినా ఉండిపోవాలి. ఆయన్ని మాత్రం ఒంటిగా ఇంటికి కాపలా ఉంచకూడదు. ఆయన ఉండడం లేదు. అప్పుడే భర్తకు, లేపి ఆవిషయం చెపుదామనుకుంది. కాని ఆయన నిద్రలో ఉన్నారు. 'మొద్దు నిద్ర' తిట్టుకుంది. పెద్ద ఆపద తప్పినట్టు ఊపిరి పీల్చుకుంది. తరువాత ఆమెకు నిద్రపట్టింది.

గోడ కున్న గడియారంలోని ముళ్లు నవ్వుకున్నాయి.

చిన్నాడు తెల్లవారు జామున లేస్తూనే ఇంటందర్నీ లేపేశాడు.

ఆదిలక్ష్మికి రాత్రి ఆలోచనా, ఆచరణ గుర్తుకు వచ్చి బద్దకం ఎగిరిపోయింది. లేచి కూర్చుంది. బద్ధకంగా ఉన్న భర్త అటూ ఇటూ దొర్లుతుంటే '' ఏమండీ! మీ రుండడానికి వీల్లేదు. నేనే ఉండిపోతాను. మీరే వెళ్లండి. గౌరవం దక్కుతుంది. లేదంటారా, ఇద్దరం వెళ్దాం. అంతే!'' తెగ్గొట్టినట్లు చెప్పింది.

జగన్నాథం మాట్లాడబోయాడు. ఆమె అతనికా అవకాశం ఇవ్వలేదు.

తెల్లవారిపోయిందిగాని, జగన్నాథం ఆశ్చర్యం నుండి తేరుకోలేదు.

ఆదిలక్ష్మి తెల్లవారేసరికి తన అభిప్రాయం ఎందుకు మార్చుకుందో జగన్నాథం ఆలోచనలకి అందలేదు. భార్యనొక వంక కనిపెడుతూనే ఉన్నాడు.

పిల్ల లిద్దరూ అప్పుడే స్నానాలు చేసి బట్టలు కూడా తొడిగేశారు. ఆదిలక్ష్మి కూడా స్నానం చేసి ఎందుకనో మరి కొత్త చీర కట్టుకుంది. జడ అల్లుకుంటూ ''బయలుదేరుతారా? ఇప్పుడు బస్సెక్కితే మధ్యాహ్నం భోజనాల టైముకి చేరుకోవచ్చు'' కేక వేసింది.

జగన్నాథం పక్క మీద నుంచి లేస్తూ 'మరి ఇంటి దగ్గరెవర రుంటారే?' అర్థం కానట్టు ముఖం పెట్టాడు. 'ముందు బాత్‌రూంకి వెళ్లి స్నానం అన్నీ చేసి రండి.' మనిషిని లేపి కూర్చోబెట్టింది ఆదిలక్ష్మి. జగన్నాథం చేసేదిలేక స్నానం, అన్నీ చేసుకొచ్చి '' ఇంట్లో సామాను పోతే నాకు తెలీదు. ఏది జరిగినా నన్ననొద్దు. ఆ... '' తాటించినట్టుగా అన్నాడు. పేరా ఆదిల క్ష్మి ముఖంలో రంగులు మారడం గొంతులో కనిపించింది... ''మీరు పిల్లల్ని తీసుకువెళ్లిరండి. నేనుంటానన్నానుగా నే నుంటాను!'' చివరికి వచ్చేసరికి మాట గొంతులోనే ఉండిపోయింది. దుఃఖానికి ముందు గొంతు ఎలా

పూడుకుపోతుందో అలా ఉంది. తల దించిందే కాని ఎత్తడం లేదు.

ఇవన్నీ జగన్నాథం గ్రహించకపోలేదు. అయినా తను బయటపడకుండా 'మాట్లాడుతున్నాడు.

''మీ చెల్లెలి కయితే ఏం చెప్పమన్నావ్? మరెందుకు, ఆ కొత్త దంపతుల్ని అత్తవారిల్లు అడుగుమోపి వచ్చాక, మన ఇంటికి రమ్మని పిలుపు చేస్తాను. నువ్వు పెళ్లికి రాకపోయినా చూసినట్టుంటుంది సరేనా?''

జగన్నాథం మాటకు ఆదిలక్ష్మి నుండి అస్సలు జవాబు లేదు. తలభారమైనట్టు కిందికి దించేసి ఉంది. పెద్ద ఊపిరి మాత్రం బుసబుస వినిపిస్తోంది. ఇంక లాభం లేదని ఆదిలక్ష్మి దగ్గరగా వెళ్లి అరచేత్తో బలంగా గడ్డం పట్టుకు ఎత్తాడు. ఊహించిన దానికంటే ఎక్కువ. ఆదిలక్ష్మి కళ్లలో జలపాతం ఉరుకుతోంది. ఆసమయంలో జగన్నాథం గొంతు పెగల్లేదు. చిన్నాడికి మాత్రం తండ్రేదో తప్పు చేసినట్టు తోచింది.

''ఆదీ! నువ్వన్నట్టు మనింట్లో దొంగలుపడితే ఏముంది. పడనీ! మరెప్పుడూ జన్మలో ఈ ఇంటికే కాదు కదా ఈ వాసకే రాడు.'' నవ్వించాలని ప్రయత్నించాడు జగన్నాథం.

కాని ఆమె నవ్వలేదు. పైటతో కళ్లు తుడుచుకుంది.

''బయలుదేరు బస్సు తప్పిపోతాం. ఫస్టు బస్సు దొరుకుతుందిలే. వేరం ఆచిన్నాడి కోసం. వాణ్ణి కూడా ఏడిపించకు లే!'' సముదాయిస్తున్నట్లు అనునయంగా అన్నాడు జగన్నాథం.

చిన్నాడు తల్లి కళ్లలోకి అమాయకంగా చూశాడు.

అప్పుడు మనిషి కాగలిగింది ఆదిలక్ష్మి కాని ఎందుకో తన చర్యకు తనకే తలచుకున్న కొద్దీ సిగ్గేస్తోంది.

కన్నీటి చారలు తుడుచుకొని పౌడరు అద్ది కాటుక, కుంకుమ పెట్టుకొని అరగంటకి రెడీ అయింది ఆదిలక్ష్మి .

అప్పుడు జగన్నాథం ఒక ప్రశ్న వేశాడు.

''కుసుమ పెళ్లికని మొదట ఇరవై వేలిచ్చాం, మరి మిగతా పదివేలు పట్టుకోనా? మానేనా?'' ఆ ప్రశ్నలో మనం పెళ్లి పెద్దలం కాము అన్న స్ఫురింపు ఉంది. ఆ విషయంతలచుకుంటే ఆదిలక్ష్మికి మళ్లీ వెళ్లాలనిపించలేదు. కాని మళ్లీ తను బయలుదేరి ఉండిపోవడం బాగోదనిపించింది. ''మీ ఇష్టం'' అంది.

''లేదు, నువ్వే చెప్పు'' తనేన్నిర్ణయం తీసుకోలేనట్టుగా అన్నాడు జగన్నాథం,

కాస్సేపు ఆగి ''మనకి కాళ్లు కడిగి కన్యాదానం చేసే హక్కివ్వనప్పుడు మన డబ్బుతో వాళ్ల కింక ప నేటుంది? ఆ పదివేలూ బీరువాలో అలా ఉంచేయండి.'' అన్న ఆదిలక్ష్మి మాటే శిరోధార్యమయింది.

అప్పటికి అన్ని తలుపులూ, కిటికీలూ మూసేశారు పిల్లలూ. సీలు చేసినంతగా

బిడాయించారు. ఇంటిలోపల, పెరడున రెండు, బయట వీధి గుమ్మానికి ఒకటి మొత్తం మూడు తాళాలు పెట్టి బయలుదేరారు.

బస్ రెడీగా ఉంటే ఎక్కడం, కదలడం ఒకేసారి జరిగిపోయాయి. చిన్నాడి కిప్పుడు ఆనందంగా ఉంది. నడిపాడు ముందు సీట్లో కూర్చున్న అమ్మాయిని తల్లిదండ్రి గమనించకుండా జాగ్రత్తపడుతూ చూస్తున్నాడు. తర్వాత సీట్లో ఆదిలక్ష్మి జగన్నాథం పక్కపక్కనే కూర్చున్నరు.

బస్సు కొంత దూరం పోయాక జగన్నాథం ఆదిలక్ష్మి ముఖంలోకి చూశాడు. కన్నీటి చారికలు పౌడరు మాటున అస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎక్కువసేపు చూస్తే ఏమయినా అనుకుంటుందని ఆ సమయంలో భార్యవంక చూడడానికి కూడా భయపడ్డాడు.

ఎండా కాలమయినా ఉదయపు గాలి చల్లగా ఆహ్లాదంగా ఉంది. బస్సు పెద్ద రద్దీగా లేదు. కండక్టరు టిక్కెట్లు కట్ చేసి, కూర్చోని వాటి నంబర్లు రాసుకుంటున్నాడు. బస్సు వేగం అందుకుంది.

చిన్నాడు రాజు దృష్టి బస్సు గోడల్ని తడిమింది. వాడు ఎర్రగా కనిపిస్తున్న అక్షరాల్ని పైకే చదువుతున్నాడు. అంతవరకూ కొడుకు చదివిన వాక్యాల్ని పట్టించుకోని ఆదిలక్ష్మి అప్పుడు మాత్రం ఉలిక్కిపడింది.

''దొంగలున్నారు జాగ్రత్త'', ''మీ సామాన్లను మీరే భద్రపరుచుకోండి!'' ఆ రెండు వాక్యాలూ ఆమె చెవిలో రొదపెడుతున్నాయి.

అటుపైన ఆదిలక్ష్మి ధ్యాస ఇంటివేపు మళ్లింది. ఇరుగూ పొరుగుకైనా చెప్పకుండా వచ్చేసినందుకు ఏదో తప్పు చేసినట్లనిపించింది. ' ఎంత గాభరాపడ్డా వచ్చేముందు ఒక్క కేక వేసి చెప్పుండాల్సింది!'' అనుకుంది. 'తాళం సరిగ్గా వేశామా? గొళ్లెం వదిలివేయలేదు కదా? పిల్లలు వెనకింటి అరదండ పెట్టారా? కిటికీలు మూశారు. మరి బీరువా తాళాలు ఎక్కడ పెట్టారు?'' అనుమానాలు అంతకంతకూ ఎక్కువవుతున్నాయి.

''బిరువా తాళాలు ఎక్కడ పెట్టారో? అసలు తాళం వేశారా?'' పెనిమిటిని అడిగింది ఆదిలక్ష్మి.

''తాళం వేశానే, అది అందులోనే ఉంచాను. తాళం చెవులు పరుపు కింద పెట్టా'' చెప్పాడు జగన్నాథం.

అలా తాళా లెందుకు వదిలేశారని అడగాలనిపించింది ఆదిలక్ష్మికి. కానిబస్సులోని ఏదొంగ వెధవయినా వింటే? అంతే, నోరు మూసుకుంది. ఆలోచనలు ముసురుకున్నాయి.

''తాళాలు మెడలో తాడుకి పెట్టుకుంటే బాగుణ్ణు'' అనుకుంది. పదివేలున్నందుకు భయం ఎక్కువవుతోంది.

అసలు ఒకప్పుడు జగన్నాథం ఆ వాడలో చీటీలు వేసేవాడు. నెలనెలా డబ్బు

పోగుచేసేవాడు. కాని ఆదిలక్ష్మి చీటీలు వద్దంది. లాభాలు వద్దంది. ఇంట్లో చీటీ వేస్తే తను ఉండనంది. చీటీ కావాలో, తను కావాలో తేల్చుకోమంది. మొదట జగన్నాథానికి అర్థం కాలేదు. తర్వాత తన భయం చెప్పింది. ముష్టిముండ వూరు మారిపోతోందట, ఇప్పటికీ ఆ వాడంతటికీ ఫలనోళ్లు చీటీ వేస్తున్నారని తెలిసిపోయిందట. అంచేత ఎవులుకయినా కళ్లగ్గసం అవుతుందట. మగ మనిషి రాత్రి డ్యూటీలకని వెళ్తే అయినా పగలయినా, రాత్రయినా ఎవరి బుద్ధి ఎలా మారుతుందో? ఆ డబ్బుంటే నేనుండను - పెద్ద తగువే అయిపోయింది. మొగుడూ పెళ్లాలకి వారం రోజులు మాటలు కూడా లేవు.

మరిప్పుడు ఇంట్లో డబ్బు వదిలేసి వచ్చెయ్యడం బెంగగా ఉంది.

బస్సు నాలుగైదు స్టాపులు దాటాక రద్దీ ఎక్కువయింది. అది పెళ్లిళ్ల సీజనుకావడం వల్ల అందరూ కట్నాలు, బంగారం గురించి మాట్లాడుకుంటున్నారు. ఎవర్నైనా ఉంచి వస్తున్నారా అని అడగాలనిపించింది ఆదిలక్ష్మికి, కాని అడగలేదు, బయటకు చూస్తున్న భర్తని తట్టి ''రాత్రి పెళ్లయిపోగానే రేపు తెల్లారగట్లే ఫస్టు బస్సుకి వచ్చేద్దాం ఎలాగయినా'' చెప్పింది ఆదిలక్ష్మి. 'అలాగే' అన్నట్లు తలూపాడు జగన్నాథం.

'' ఈ ఒక్క రాత్రి గండం గడిస్తే అదే చాలు.'' స్వగతంగా అనుకుంది. 'అయినా , మన దగ్గరేముందని ఎవడయినా వస్తాడు? మళ్లీ అనుకొని గుండె నిబ్బరం చేసుకొనే ప్రయత్నం చేసుకుంది. ఆ నిబ్బరం ఎంతోసేపు ఉండడం లేదు.

ఆ మధ్యాహ్నానికి జగన్నాథం దంపతులు పిల్లలతో ఊర్లో బస్సు దిగారు. పెళ్లి ఇల్లు చేరుకున్నారు. భోజనాలవుతున్నాయి.

ఆదిలక్ష్మిని చెల్లెలు అనసూయ చూసింది. ''చుట్టాలొచ్చినారు. భోజనాలు పెట్టండర్రా తినేస్తే మరొక గంటలో బస్సుంది''. అనేసి ఆగకుండా వెళ్లిపోయింది. అనసూయ మనసు గ్రహించింది. ఆదిలక్ష్మి జగన్నాథం ఆమె కోపానికి నవ్వుకున్నాడు.

చిన్నాడు రాజు భోజనాల దగ్గరుండే వాళ్లకి నీళ్లు పొయ్యడానికని జగ్గు తీసుకువెళ్తున్నాడు. నడిపోడు అటుకేసే నడుస్తున్నాడు.

అప్పుడే వచ్చాడు ఆదిలక్ష్మి మరిది నారాయణ. వీళ్లను చూస్తూనే అన్నాడు - ''మీరూ పిల్లల్ని కన్నారు. పెళ్లికాని చెయ్యడం మానేస్తారా? పిలవడం మానేస్తారా? మేమూ సెలవు దొరకలేదనో, బస్సులు దొరకలేదనో చెప్పలేమా?''

''అది కాదు తమ్ముడూ, సెలవూ దొరికింది. కానీ ఇంట్లో ఎవర్నుంచి రావడానికి ఎవరూ లేరు. కనీసం రాత్రి పూటయినా కాపుంటే రావడానికి'', పరిస్థితిని అంతకంటే వివరించలేకపోయాడు జగన్నాథం.

ఆ మాట వింటూనే గడపలో కూర్చున్న ముసల్ది నారాయణ తల్లి '' ఆ పదెకరాల రైతువి. తోటా, దొడ్డా, పంటా కాపా? పోని బక్కా బడుగా? కోళ్లా, గొర్రెలా? ఏటున్నాయని పొద్దుబోతే కట్టలేదనో, ముయ్యలేదనో బెంగ? తాళం వేసి రావడానికి?''

దీర్ఘం తీసింది.

పట్టణం సంగతంతా వివరించాలని ఆదిలక్ష్మికి అనిపించింది. అంతలో అనసూయ అంది. ''దాని కూతురయితే అది ఎందుకు రాదు? ఒక్క పేగు ఎరుసని తేడా చూపుతంది.'' నిష్ఠూరంగా ఉందామాట.

ఆదిలక్ష్మి ఆమాటతో ఆగలేకపోయింది. గుండెలో అణిచిపెట్టుకున్న దుఃఖాన్ని కాయలేకపోయింది. అంతే! ''కుసుమకి కాళ్లు కడిగి కాన్యదానం చేసే హక్కు నాదన్నావు. ఆడపిల్లలు లేనిదాన్నని చాలా కనికరించావు. చెల్లివయితేనేమి? తల్లిలా అర్థం చేసుకున్నావు. అక్కని, కూతుర్లు లేకపోయినా నేను గొడ్రాల్ని కాదే!'' ఆదిలక్ష్మి మరి మాటలు రావడం లేదు కళ్లమ్మట నీళ్లు తప్ప.

''... ఊరంతా పెద్దకూతుర్ని...'' చెప్పబోయింది. అనసూయ.

అరుగు మీద ముసల్ది లేచి ''నువ్వాగే, మిగతా ఇద్దరూ ఆడపిల్లలు కారే?! నీకు నచ్చినదాన్ని అట్టుకుపోయే... ఎళ్లే!'' గొంతెత్తి అంది.

''... ఆ ... ఇప్పుడిలా అంటారు. దాన్ని తీసుకోమన్నట్టే తర్వాత ఇదిగిలాగే, అయినా ఎవుల బిడ్డ ఆల బిడ్డ, ఆపుణ్ణెమూ వద్దు, మీరే మూటగట్టుకుపొండి.'' ఏడుస్తూనే అంటోంది ఆదిలక్ష్మి.

జగన్నాథానికి ఎలా ఓదార్చాలో అంతుపట్టకుండా ఉంది.

సరిగ్గా అప్పుడే వచ్చింది కుసువు పెళ్లికూతురు గదిలోంచి, ఆదిలక్ష్మి గమనించలేదు. కుసుమే దగ్గరగా వచ్చి, ''అమ్మా !'' పిలిచింది. ''నేను మీ అమ్మను కానే! నాకు కూతుళ్లు లేరుగా!'' మరింత ఎక్కువయిపోయింది. ఆదిలక్ష్మి ఏడుపు ఏడుస్తూనే కుసుమ రెండు చేతులూ ఒడిలో పెట్టుకుంది. జనం పోగయిపోతున్నారు పెళ్లి ఇల్లు కదా, ఇంక అడిగేదేముంది?

జగన్నాథానికి ఈపరిస్థితి అంతా చికాకుగా ఉంది. 'నోర్మూయ్యి' అని భార్యని హెచ్చరించాలనుకున్నాడు మళ్లీ అంతలోనే జాలి కూడా కలిగిందామెమీద.

కొంచెం సేపట్లో పరిస్థితి సర్దుకుంటూ ఉండగా నారాయణే అన్నాడు. ''వదినా! లెగు పురోహితుడ్ని పిలుస్తాను. అన్నయ్యా మీరు కంకణాలు కట్టుకుందురు'' అని అనసూయ ముఖం వంక చూశాడు.

''అక్కా! లే... బావా! అందరూ పెద్దకూతురు తొలిసూలు పిల్లని అన్నారనిగాని దాని ఆశచెడగొడదామని నాకు లేదు. ఇంకిద్దరు మాకెలాగూ ఉన్నారు'' అని జగన్నాథంతో అని భర్తని పురోహితుడ్ని పిలుచుకురమ్మంది అనసూయ. పురోహితుడు వచ్చాడు. కాని కంకణాలు కట్టుకోవడానికి ఆదిలక్ష్మితోపాటు జగన్నాథమూ అంగీకరించలేదు. అనసూయ తన అక్కనీ, బావనీ బ్రతిమాలాడింది. నారాయణ కూడా.

''నేనూ మనిషినే! ఆశ తీసెయ్యడమని కాదుగాని, మీరు కట్టుకున్న కంకణాలు ఇప్పెయ్యడం ఏమంత సబబుకాదు. తర్వాత మీ రన్నట్టు ఇద్దరు పిల్లలున్నారు ఏదో

అయితే అవుద్ది. అయినా మేం ముందొచ్చుంటే ఎలా గున్నో... ఇల్లొదిలి రావడం అయ్యేంది కాదు''. కచ్చితమైన తన నిర్ణయాన్ని చివరగా చెప్పింది ఆదిలక్ష్మి. భార్య మాటలకు జగన్నాథమూ సంతోషించాడు.

వాతావరణం సానుకూలమయినందుకు పెళ్లి సందడి మరింత ఎక్కువయింది.

కంకణాలు కట్టుకున్న అనసూయ, నారాయణలు కార్యంలో మునిగిపోయారు. అక్కడ కాసేపున్నాక, జగన్నాథం వీధిలోకి వెళ్లిపోయాడు. ఆదిలక్ష్మి మళ్లీ ఆలోచిస్తోంది. కొంచెం ముందొచ్చి ఉంటే బావుణ్ణు. అయిందేదో అయిపోయింది అనుకుంది.

కుసుమే వచ్చి పెద్దతల్లిని జడవెయ్యమని అడిగితే, జడతోపాటు పెళ్లి ముస్తాబు చేసింది. పెళ్లి ముహూర్తం దగ్గరపడింది. పెండ్లికుమారుణ్ణి, పెళ్లికూతుర్ని కూచోబెట్టి పురోహితుడేవో మంత్రాలు చదువుతున్నాడు. ఎన్ని ఘట్టాలు జరిగినా దూరం నుంచి చూస్తున్న ఆదిలక్ష్మి కాలుగడిగి కన్యాదానం చేసేటప్పుడు మాత్రం చూడలేకపోయింది. చూసినంతలో కళ్లనీళ్లు తిరిగి, మసకగా అనిపించి, ఎవరైనా చూస్తారని తలదించేసుకుంది. జగన్నాథం మాత్రం భార్యని గమనించాడు. కాని గమనించనట్టే నటించాడు. ఆసమయంలో తను చూశాడని గమనిస్తే ఆమె దుఃఖమేం ఖర్మ. ఏడుపే అందుకుంటుందని తెలుసు మరి!

పెళ్లయి ఊడుులవీ చదింపులయేసరికి, తూరుపు తెలతెలవారుతోంది. ప్రయాణాలు కావలసిన వాళ్లు కొందరు సిద్ధపడుతుంటే, మరికొందరి కుర్చీల్లో కూలబడే కునికిపాట్లు తీస్తున్నారు.

జగన్నాథానికి, ఆదిలక్ష్మికీ మళ్లీ సమస్యొచ్చిపడింది. ఇద్దరూ కూర్చొని ఒకకొలిక్కి రావడానికి ప్రయత్నిస్తున్నారు. కుసుమ పెళ్లి కనిచ్చిన ఇరవై వేల రూపాయల గురించి, కన్యాదానం తాము చేయలేదు కాబట్టి ఆడబ్బు గురించి అడగాలనే అనిపించింది భార్య భర్తలిద్దరికీ. మొదట కొంచెం తటపటాయించినా సరే, డబ్బువాళ్లు మాత్రం ఉత్తినే ఇస్తారా? మనమూ వదిలయ్యకూడ దనుకున్నారు. రేపు తమ పిల్లలకి ఉద్యోగ మొచ్చి డబ్బు కట్టవలసి వస్తే వీళ్లు ఈ ఢబ్బు ఇస్తారా? అయినా కష్టపడిన సొమ్మయినా మాటకి కట్టుబడి ఇచ్చారు. ఆ మాట వాళ్లూ తప్పారు కాబట్టి, తమ డబ్బులు తాము తీసుకోవాలని నిశ్చయానికి వచ్చి అదే విషయం అడిగారు.

నారాయణ, అనసూయ ఆశ్చర్యపడలేదు. సమయానికి తమకు అందవలసిన సొమ్ము అందలేదని బాధపడ్డారు. ''మీరు ఇరవై వేలు ముందుగా సర్దడం వల్ల చాలా మేలు చేశారని'', ''అసలు పెళ్లి మీ మూలంగానే అయిం''దన్నారు. ''అయితే ఇంకా డబ్బు సరిపోలేదని, మీ నుండి పదివేలు వస్తాయని ఆశవున్నా అడగడానికి నోరు రాలేకపోయిం''దని ''అలా అని కూతురు పెళ్లి వదులోకోలేం కదా'' అన్నారు.

'' ఇంతకీ ఎప్పుడిస్తారా ఇరవై వేలు?'' ఆదిలక్ష్మి దంపతులిద్దరూ అడిగారు. '' వీలున్నంత తొందర్లోనే తీర్చేసా''మని అన్నారే కాని, ముందు ఇంకా పిల్లలున్నారని అన్నారు కాని, కన్యాదానం గురించిగాని ఎత్తేలేదు అనసూయ దంపతులు.

అందరూ కష్టపడితేనే డబ్బు వస్తుందని, ఆ డబ్బే మంచయినా, చెడయినా చేస్తుందని వడ్డీ ఇవ్వకపోయినా 'ప్రామిసరీ నోటు' తప్పకుండా కావాలన్న అక్కనీ, బావనీ చూసి మాత్రం ఆశ్చర్యపోయారు. ఇంకేమీ మాట్లాడకుండా కోరినట్టే కాగితాలు తెప్పించి నోటు రాయించి ఇద్దరూ ఇరవై వేలకు సంతకాలు పెట్టి ఇచ్చారు. నోటు అందుకునేటప్పటికి ఒక రోజున్నరయింది. పెళ్లికొడుకు, పెళ్ళికూతురు ఇల్లు వదిలివెళ్లడం, చుట్టాలు గందికి, ఇన్నింటి మధ్య కూడా రాతకోతల పని అయింది. ఈరెండ్రోజులూ అక్కచెల్లెళ్లుగాని, తోడన్నదమ్ములుగాని ఎక్కువగా మాట్లాడుకోలేదు కూడా. ఏదో అవసరమైతే తప్ప ఆదిలక్ష్మి, జగన్నాథాల కయితే తింటునప్పుడల్లా పరాయి వాళ్ల ఇల్లులానే తోచింది. ఆ రెండ్రోజుల్లో అనేక దఫాలు మనసు మారిపోతే మరుక్షణమే మామూలయేది.

ఆవేళ మధ్యాహ్నం జగన్నాథం కుటుంబం బయలుదేరింది ఉండమని ఎప్పుడూ పోరే అనసూయ కూడా ఆదిలక్ష్మిని ఏమీ అనలేదు. నారాయణయితే ముఖంలోకి చూడడం లేదు.

ఆదిలక్ష్మి కూడా ఆడపిల్ల లిద్దర్లో ఎవరినీ బయలుదేరమనిగాని, రమ్మనమనిగాని అనలేదు. జగన్నాథం ఆ విషయమే మరిచిపోయాడు. చిన్నాడికి ఇంటి వాతావరణంలో మార్పు కొట్టొచ్చినట్టు అగుపించి బాధనిపించింది. నడిపాడు పిన్ని చిన్నాన్నల ప్రేమకు దూరమైనట్టుగానే వున్నాడు.

ఎప్పుడూ దిగబెట్టే నారాయణ బస్సు దగ్గరికి రాకపోయినా కిమ్మనకుండా వెళ్ళి బస్సెక్కి కూర్చున్నారు పిల్లలతో జగన్నాథం దంపతులు. బస్సు కదిలిపోయింది. ఊరు విడిచి పెట్టేసింది. అందరి గుండెలూ భారంగా ఉన్నాయి. జగన్నాథం ఆదిలక్ష్మి ఎందుకనో ఒకరి మొఖాలు ఒకరు చూసుకోలేక పోతున్నారు. చిన్నాడికి వెళ్లినంత సంతోషంలో సగమయినా లేదు వచ్చేటప్పుడు.

దిగాల్సిన ఊరు వచ్చినదాకా ఆలోచనల్లోపడి ఇంటి గురించి భయం వెయ్యకపోయినా, మళ్లీ మొదలయింది. అక్కడున్న రెండ్రోజులూ రాతకోతల్లో పడి మరచినా ఇప్పుడు భయం రెట్టింపవుతోంది. నమ్మకంలేని చోట పదివేలు ఎలా వదిలివెళ్ళామా' అన్న ఆలోచన రాలేదు. ఆ దంపతుల గుండెలు భయం భయంగా, బితుకుబితుకుగా ఉన్నాయి. అడుగులు వడివడిగా వేస్తూ ఉన్నా తడబడుతున్నాయి.

ఇల్లు దగ్గర పడింది. పరిగెత్తుకు వెళ్లారు. ఇంటికి తలుపులు. తలుపులకు గొళ్లాలు. గొళ్లానికి తాళం ముద్దుగా, బొద్దుగా ని

శ్చలంగా ఉంది.

తలుపుల గొళ్లాలు తెగలేదు.

కాని ఎక్కడో మరేవో గొళ్లాలు. - అవి తెగిపోయాయి.!

*రచనా కాలం 9, 10, జూన్ 1992*

*ముద్రణ : ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, నవంబరు 23-29 1994.*

*కథ 1994.*

# బతుకు చెరువు

బిడ్డికోడం గట్టుమీద పడ్డ చేపలా గిలగిలా గింజులాడేడం. ప్రాణం విలవిల్లాడుతున్నట్టు కాళ్ళూ చేతులూ తన్నుకోబోయేడు. కాని కాళ్ళూ చేతులూ కట్టేసినట్టు కన్నబిడ్డలు నలుగురూ ఆ ముసలిశరీరాన్ని కదలనివ్వకుండా పట్టుకున్నారు. బిడ్డకోడు ఆవేశంతో పెనుగులాడేడు. ఆయాసంతో అరచి గీపెట్టాడు. అమ్మా ఆలీచేసి అక్కడ చేరిన అంతమందినీ బూతులు తిట్టాడు. అలసి సొలసి అయ్యాబాబూ అని బతిమలాడుకున్నాడు. ఆఖరికి దుఃఖం పట్టలేక ఏడ్చాడు. గుండె బాదుకున్నాడు. అంతలోనే పూనకం వచ్చి పీనుగులా వున్నోడు ఏనుగులామారి, కదలనివ్వకుండా చుట్టుకున్నవారిని విసిరి కొట్టి నేలమీది మట్టి దోసిళ్ళతో తీసి పిచ్చివాడిలా నెత్తిమీద పోసుకున్నాడు. నింగిమీదకి విసిరాడు.

''కొండలంజకొడుకుని ఇక్కడ్నుంచి తీసికెళ్లండ్రా...''

ఆ మాటతో బిడ్డికోడి కొడుకులు కొండడు, బూగడు, లక్ష్మాయ్, సాంబ అంతా కలిసి బిడ్డికోడ్ని బరబరా రెక్కలు పట్టుకు లాక్కెళుతున్నారు. గరకు నేలా మొక్కా మోడూ రాయిరప్పా గుట్టామెట్టూ తగులుకుంటూ బిడ్డికోడి నల్లటి శరీరం పెచ్చులూడి ఎర్రని పూత పూసుకుంటోంది. అయినా బిడ్డికోడు ఈండ్రబడుతున్నాడు. మొలమీది గోసిగుడ్డ మట్టిగొట్టుకుపోయి, బిడ్డికోడి చర్మంలానే చివికి రేగిపోతున్నది.

అప్పుడే కొండమీద నుండి బంతిదొర్లినట్టు వచ్చింది- సిరిమిల. ఆమె వెనకాలే పెద్దకోడలు సుక్కి, రెండో కోడలు బూది, ఒక్కగానొక్క కూతురు లిక్కిడి వొగరుస్తూ వచ్చారు.

'' ఓలమ్మోలమ్మో... సంపేనారు. నామొగిడ్ని సంపేనారు..'' సిరిమిల గుండెబాదుకుంటూ బిడ్డికోడి దగ్గరకు వస్తూనే కొడుకుల్ని చూసి దూరంగా పరిగెడుతోంది. వంటిమీద కోకని ఈడ్చుకుపోతుందే గాని ఏగేసుకుందామన్న ధ్యాసలో కూడా లేదు. తల్లిని చూసి కూతురు లిక్కిడి 'ఒలమ్మోలమ్మో' ఏడుస్తూ తల్లిచుట్టూ పరుగుతీస్తోంది. ఆ పిల్ల వెనకాలే సుక్కి, బూది.

''వొద్దు.. వొద్దు.. ఏగయిర్నమెంటుగాడిద కొడుకుల్నీ నమ్మొద్దు.... వొద్దురొరే... ఈ కనికట్టు నమ్మొద్దురొరే.. ''బిడ్డకోడు పేగులు తెగేల ఏడుస్తున్నాడు. ఆ అరుపులకు చుట్టూవున్న కొండలు ప్రతిధనిస్తూ అదే మాటని పదే పదే అంటున్నాము

బిడ్డికి అరుపుల్ని, బిడ్డికితో గొంతుకలుపుతున్న కొండల ప్రతిధ్వనుల్ని మింగేస్తూ వికృత శబ్దం! గుజ్జువాయి కొండల్నీ గుజ్జుగుజ్జయిపోయే రొద!

బిడ్డికోడి నోరుపడిపోయింది. కాళ్ళూ చేతులూ అవిటివయి పోయాయి. ఏ చలనమూలేని శరీరం ఎటుపడితే అటు పడిపోతోంది. కళ నీళ్ళతో కరిగి ఎర్రబడి చెంపలు జోరికలు కట్టాయి! చూపు నమ్ముకున్న నేలమీదే! పుట్టిన మట్టిమీదే!!

ఎర్ర మట్టిమీద చోలు, జొన్న, కందులు ఇంకా నిలచిలేవు. మట్టికింద ఆ మొక్కలన్నీ తలలు వాల్చేస్తున్నాయి. మరోపక్క మామిడి, ఇప్పచెట్లు వెన్నువిరిగి మన్నుకిందమన్నె...

బుల్డోజరు భూమి పొరల్ని దొలుస్తూవుంది. ఆకలికి నోరు తెరిచిన రాకాసిలా పంటనంతా పుక్కిట పట్టినట్టు... ఏమొక్కనీ మోడునీ మిగలనివ్వకుండా తవ్వుకుపోతోంది. రాయీరప్పా ఏదీ కాదు అడ్డంకి. ఎడారిలా నున్నగా.. కొండని గుండు గీసినట్టు... గొయ్యితీసినట్టు...

ఆ గోతిలో పాతినట్టు బిడ్డికోడికి ఊపిరాడకుండా వుంది.



ఊరుకు నిప్పంటుకున్నట్టు... ఏరు వెంటబడి తరుముతున్నట్టు... ఊరంతా ఖాళీ చేసినట్టు పరుగు! ఉరకలేస్తూ పరుగే పరుగు!

బిడ్డికోడు కొండమొదల్న మెరకమీద కంపనరుకుతూ వున్నాడు. తాతల తండ్రులనుండి చెమటపోసి పదును చేసి మడిగడుతూనే వున్నాడు. తలెత్తిచూసాడు. తెల్లకారు, మట్టిరోడ్డమ్మట దుమ్మురేపుకుంటూ వచ్చి ఆగింది. ఊరు అక్కడే దార్లోనే బస చేసినట్టుంది. బిడ్డికోడు కదిలాడు. బూగడు తండ్రిని కేకేసుకుంటూ పారిపోయాడు.

గుజ్జువాయితో పాటు చుట్టుపక్కల గూడేలన్నీ జాతరకు కొండ దిగుతున్నట్టు దిగబడిపోవడంతో బిడ్డికోడుకి కళ్లముందు గొర్రెల మందే కదలాడింది. ఒక్కటి పరుగుతీస్తే దాని వెనకే మిగతావి పరుగుతీయడం ఎందుకో గుర్తుకు వచ్చింది. నిట్టూర్చాడు. అడుగులు నెమ్మదించాయి. కాని దార్లో అవుపడ్డ బొంత బిడ్డికిని గాబరాపెట్టి నడిపించాడు.

బంతి భోజనాలకు కూర్చున్నట్టు అంతమందీ రోడ్డుమీద మట్టిపైనే కూర్చుండిపోయారు.

''... అంచేత ఎప్పుడూ లేని అవకాశం... బంగారంలాంటి అవకాశమొచ్చింది చెప్పండి ఎవరెవరికి ఎన్నేసి ఎకరాల భూమివుందో ఎంతేసి కేటాయించగలరో.'' ప్రాజెక్టు ఆఫీసరుగారి పియ్యే టయ్యి సర్దుకున్నాడు.

''... అదేటి బావు సెక్కో ముక్కో భూమి పంచుతారని మావొస్తే. తిరగి మాకాడ ఎన్నేసెకరాలున్నాయని ఎకసెక్కాలాడతన్నారు... మా బాగుంది కత''... పోలేసు కూర్చున్నోడు లేచి నిలబడిపోయాడు.

'' ఎకసెక్కాలు కాదు, పరాచికాలు కాదు... పర్టిక్యులర్స్ కావాలి. ఎందుకంటే భూమి వున్నోళ్లకే చెఱువులు ఎలాట్ చేయ్యగలం... తవ్వించగలం. ఆసక్తి వున్నోళ్ళు ఒక్కొక్కరూ పేర్లివ్వండి...

అందరూ ఒకరి మొగమొకరు చూసుకున్నారు. గుసగుసలాడుకున్నారు. కాని ఒక్కరూ ముందుకు రాలేదు.

అప్పుడు ప్రాజక్టు ఆఫీసరే బోధపరిచాడు.

''... నేను కూడా మీలాంటి కుటుంబాల్నుంచే వచ్చాను. ఇవాళ ఆఫీసర్ని ... అయినా మీ మంచి చెడ్డలు నావేనని అనుకొని వచ్చాను. చెప్పండి. మీ ఇబ్బంది ఏమిటో...'' గొంతునిండా ఆప్యాయత వుంది.

చాలా చేతులు ఆమాటకే చలనమొచ్చి లేని దండమెట్టాయి. మళ్ళీ గుసగుసల శబ్దం.

''కలెక్టరుగారు మన జిల్లాలో అయిదు వందల చెఱువులు తవ్విస్తున్నట్టు ప్రకటించారు. మన పార్వతీపురం ఐ.టి.డి. పరిధిలో నూటయాభై అయిదు చెరువులకు అవకాశమిచ్చారు. కురుపాం. కొమరాడ, మక్కువ, సాలూరు, జియ్యమ్మవలస మండలాలతో పాటు మీ గుమ్మలక్ష్మీపురం కూడా వుంది,... ప్రాజెక్టు ఆఫీసరు నోటుబుక్కులో వున్నది చూసుకుంటూ చెప్పాడు.

బిడ్డికోడికి అంతా అయోమయంగా అర్థంకాకుండా వుంది. ముడుకులమీద కూర్చున్నోడు లేచి అడిగేసాడు.

''మా గుజ్జాయి పెద్దగెడ్డ రిజరోయరు నీరే మాకందదు, ఆరొందలెకరాలకి అందుతాద ని అప్పుడు లెక్కలు సెప్పినారు. అర్థవై ఎకరాలకే అవస్థయిపోతంది. మొక్కా మోడు బలిస్సి, మన్నూగ్గ్రటా నిండిపోయి నీరుపారదు. మదుమూ తూములూ పాడైపోనాయి. సెర్వుల్తోటి పంటేటి పండిస్తామికన...?''

''వ్యవసాయం కోసం చెరువులు కాదు, చేపలు పెంచడానికి చెఱువులు-చవల చెరువులు,, బిడ్డికోడి అయోమయాన్ని పోగొట్టానని అనుకున్న పియ్యే బిడ్డికోడిని, మరింతమందిని అయోమయంలోనూ అనుమానంలోనూ పడేసాడు.

''రిజర్వాయర్ బాగుకు ఫండ్స్ గవర్నమెంటు నుంచి రాలేదు....'' ప్రాజెక్టాఫీసరు పొడిగా సమాధానమిచ్చేడు.

''చేపల చెఱువులా?'' బుదడు ఆనందంగా అరచి, గుంపుకు వెనకాతల వున్నవాడల్లా ముందుకు వచ్చాడు. చదవడమూ రాయడమూ వచ్చిన బుదడు ఆ క్షణాన అక్కడ వుండడం ఆశ్చర్యమే. వాడు నెలకు వారం రోజులు ఊర్లో వుండడం కష్టం.

'' ఈయన పేరు రాయండి'' ప్రాజెక్టాఫీసరు అన్నాడు.

''బుదడు, ఓల్డు ఫిఫ్త్‌క్లాసు'' గొప్పగా చెప్పుకున్నాడు బుదడు.

''మీ భూమి ఎక్కడుందో, చూసొద్దాం...'' పియ్యే రాసుకుంటూ బుదడ్ని అడిగేడు.

''సెవెన్టీ ఫైవ్‌లో చేపల పెంపకం ట్రైనింగ్ అయ్యానండి...'' బుదడు చెప్తూ చేతులు నులుముకొని రాని నవ్వునవ్వాడు.

''వెరీగుడ్'' ప్రాజె క్టాఫీసరు, మెచ్చుకున్నాడు.

''మీ భూమి...'' పియ్యే ఆడగబోయాడు.

''లేదండి.. భూమి లేదు... '' తప్పు చేసినవాడిలా తలదించాడు బుదడు.

''సారి... భూమివుంటేనే లేకపోతే ఏం చెయ్యలేం. చెరువు శాంక్షన్ చేసేమే అనుకో... ఎక్కడ తవ్వుతాం?'' పియ్యే వెంటనే వివరించీసేడు.

''బాబ్బాబు... మీరే'' బతిమలాడ బోయాడు బుదడు.

''సారీ.... కుదర్దు... నువ్వెళ్లు... భూమి వున్నోళ్ళెవరయినా ముందుకు రండి అసలే టైం తక్కువుంది.'' ప్రాజెక్టాఫీసరు చెప్పాక బుదడు అసహనంగా రోడ్డు దాటి వెళ్లిపోయాడు.

''మారాజా., మాకున్న భూములన్నీ మెరక భూములు. కొండ మొదల్నవున్న జాగాలో సెరువులా?'' బొడ్డుడుకీ అనుమానం తీరలేదు.

'' ఎక్కడున్నా బాధలేదు, తవ్విచ్చే పూచీ మాది. మీరు ముందుకు రావడమే కావాలి. మిగతావన్నీ మేం చూసుకుంటాం. మీ డెవలప్‌మెంటే మాక్కావలసింది. మీ పేరు?'' ప్రాజెక్టాఫీసరు అడిగేసరికి అవుననాలో కాదనాలో తెలీకపోయినా తెలిసినా తన పేరుమటుకు చెప్పేసాడు, బొడ్డు.

కొండ మీద చెఱువు లేమిటో అర్థం కాకపోయినా బొడ్డు పేరు మొదటిదయి ''నవెూదవుయింది. వేుుదటున్న వ్వారికే వెుుదట. ఆఖర్ని వున్నవారికి ఆఖర్నవుండొచ్చు.... వుండక పోవచ్చు.'' అనడంతో ఒకరొకరూ ముందుకొచ్చారు. పోటీ పడి పేర్లిచ్చారు.

కొండడు, బూగడు, లక్కాయ్, సాంబ్ర నలుగురూ తమ పేర్లిచ్చేసాక బిడ్డికోడు తేరుకొని అడ్డం పడ్డాడు.

''లేకియర్స్,... లక్షాధికారులైపోతాఁరా... మీ దశ తిరిగింది... అదృష్టమంటే మీదే, మీ ముసిలోడితో ఏటి, ఏదీకానివ్వడు దగుల్బాజి లంజికొడుకు... '' పియ్యే బిడ్డికోడి నలుగురు కొడుకుల్ని భుజం మీది చెయ్యివేసి అభినందించేడు.

'లక్షాధికారులం కాకపోయినా లేకిబికారోళ్ళం మాత్రం కాకూడదు, వద్దు' బిడ్డికోడి నోటంట మాటరాకముందే కొడుకులు అడ్డుకున్నారు.

''నోరుమ్మొయ్యి... నలుగుర్తోటీ మనవయినవ్నా... అయినా నువ్వు అనుమానించందేటి? నీకేటి తెల్దు నువ్వొల్లకో...''

బిడ్డికోడి మాట చెల్లలేదు. మనిషినీ ఎవ్వరూ పట్టించుకోలేదు.

ప్రాజెక్టాఫీసరు, పియ్యే ఇంకా ఫీల్డాఫీసర్లు అంతా సర్వేకని భూముల మీదికి ఎగబడ్డారు. బిడ్డికోడి గుండెజారి నేలన కూలబడ్డాడు!



కుక్కి మంచంలో చేరగిలబడివున్న బిడ్డికోడు సలపరించిన నొప్పులకు తాళలేక ముక్కుతూ మూల్గుతూ వున్నాడు.

సిరిమిల వేపుడునూకల తెట్ట మరిగించి పెనిమిటున్న మంచం దగ్గరకు తీసుకువచ్చింది. తెట్ట ఆవిర్లు కక్కుతూ వుండడంతో దాకలోంచి లోటాలోకి లోటాలోంచి దాకలోకి వంపి చల్లారబెట్టింది. బిడ్డికి నుదిటమీద గుండె మీద చెయ్యివేసి చూసింది.

'ఓలమ్మో ఇంకా కాలిపోతందే...' స్వగతంగా పైకే సిరిమిల.

ఇంతలో 'సిరిమిలా.. ఓ.. సిరిమిలా, గుమ్మంలోంచి పిలుపు వినబడ్డంతో, సిరిమిల అరుగుమీదనుండి గుడిసెదాటివచ్చింది. ఎదురుగా జాదవ కత్తికూడు.

'కషాయిమిదే.. బిడ్డిక్కి...'' కత్తికూడు గిన్నెతో ఇచ్చి వెళ్లింది.

కూతురు లిక్కిడి వచ్చి బిడ్డికి మంచం పక్కనే చేరింది.

సిరిమిల బిడ్డికిని లేపి కూర్చోబెట్టి కషాయమిచ్చింది. కళ్ళు మూసుకుంటూ తాగి, మళ్ళీ అదే కుక్కి మంచంలో వెనక్కి వాలిపోయాడు బిడ్డికోడు.

పెనిమిటి ముఖం చూస్తూ కాళ్ళకాడే కూర్చుండిపోయింది సిరిమిల.

కొద్దిసేపటికి సిరిమిలికి కూటిరెప్పపడుతుండగా బిడ్డికోడు ఉలిక్కి పడుతూ దిగ్గునలేచి కూర్చున్నాడు. సిరిమిలికి నిద్రవదలిపోయింది. లిక్కిడి మంచం మీద నుండి లేచి నిల్చొంది. బిడ్డికోడు అయోమయంగా బెదురుతూ చూసాడు.

'' ఏట య్యిందే... సపనమేమిటే.. ఏటయ్యిందే?'' సిరిమిల పెనిమిటిని కుదపబోయింది. బిడ్డికోడు ఆమెను వారించి, సత్తువ లేని శరీరాన్ని మళ్ళీ మంచంమీదకి వాల్చాడు. వెల్లకిలా వున్నవాడల్లా బోర్లా పడుకున్నాడు. అతని కళ్ళు తడిచి బొట్లురాలాయి.

బిడ్డికోడికి వొరిగిపోయిన కాలం జ్ఞాపకానికొచ్చింది. ఆజ్ఞాపకాల్లో... మనిషిని నిలువునా కప్పెట్టేటంత లోతుతో విశాలంగా చెరువులు... గట్టుమీద గంజినీళ్ళు తాగుతూ మురిసిపోయి కొడుకులు... ఆకలి తీరని రాకాసిలా ఆపకుండా తవ్వుకు పోతూ వున్న బుల్డోజర్లు... కార్లూ జీపులూ, కళ్లద్దాలూ గళ్ళ తెల్లచొక్కాల నవ్వులు...

''మీరెదగరయ్యా... ఎదగరు.. గవర్నమెంటుకి బుద్ధిలేదు, మీకు బుద్ధిరాదు. ఫ్రీగా ఇస్తే ఫినాయిలు తాగే కాలంలో వత్తినే చెఱువులు తవ్విస్తాం రండి రా అంటే మీకింత తీపరమా? మా ఆగ్రోస్ సర్వీస్‌లోనే ఇలాంటి కేసులెరగమయ్యా.. అయినా నాకర్మకాలి మీ జిల్లాలో పడ్డాను. అదే ఈస్ట్‌వెస్ట్ గొడావరి, ఏలూరయితేనా ప్రైవేటు పార్టీలు అదిరిపోను..''

''మీకేం పోయిందయ్యా చెరువుకి ఎకరాకి ముప్ఫైమూడు వేలవుదే. అందులో ఐ.టి.డి. ఏ ట్వంటీ పర్సెంటు, ఫిషరీష్ ఫార్మింగ్ డెవలప్‌మెంటు ఏజెన్సీ ఫార్టీ పర్సెంటు రుణంగా ఇస్తుంటే మీకేం సలుపో.''

''అవమ్మా'' అన్నాడు బిడ్డికోడు. దూరంగా వినబడుతున్న మాటలేవో మాయమయ్యాయి. కాళ్ళునొక్కుతున్న సిరిమిల పెనిమిటి మూల్గు విని చేతులు వెనక్కి తీసుకుంది.

బిడ్డికోడు మరొక పక్కకి ఒత్తిగిల్లాడు.

''అమ్మా... సంతకెళ్లమే?'' లిక్కిడి తల్లిని అడిగింది.

ఇప్పపూలమ్మడానికి సంతకి వెళ్లడం సిరిమిలకి గుర్తొచ్చేది. ఇప్పుడా అవసరంలేదు. ఇప్పుడు ఇప్పసెట్లున్నది లేదు. చెఱువులు తవ్వినప్పుడే వాటిని తవ్వి తొక్కిపడేసారు. ఇప్పసెట్లు కూలిపోవడం కాదుగాని సిరిమిలకి సెయ్యి ఇరుసుకున్నట్టుగా వుంది. పూలు లేనేలేవు. పిక్క ఆర్రూపాయలు కేజీకెల్లీవి. నూనె. సారా.. అన్నీ బంద్! మామిడి సెట్లూ లేవు. టెంకంబలీలేదు.

కందులూ చోడీ జొన్న మెరకపంట ఏదీ సున్న!

ఇప్పుడు కట్టెలమ్ముకోవాలి!

అందుకే కోడళ్ళు సుక్కీ, బూదితో లిక్కిడి కూడా కట్టెలమోపు నెత్తినెట్టుకొని సంతకెళ్ళింది.

ఇదంతా చూసి సిరిమిలకోక కళ్లుతుడవలేక తడిచింది.

బిడ్డికోడు బలవంతంగా కళ్ళు మూసాడు. మూసిన కళ్ళకు కనిపించిందేదో కడుపంతాదేవేస్తూ వుంది.

''పండగొంటి పూట పిసర దుమ్ముకున్నాడా దిక్కులేని ఇల్లైపోయింది. ఛీ..ఛీ.. దరిద్రమిల్లు. దరిద్రం బతుకు'' అందరికీ చిన్నోడు బూగడు బుగ్గలు వేలాడేసి తల్లితో యుద్ధానికి దిగాడు.

''తినీగానేటి సొరగమ్మైపోద్దిరా? లేకపోతే నాలికిమీదలాగ వుండిపోద్దా? ఈ తోవనెల్లి ఆతోవ సీకటి రాజ్జింల పడిపోడమేకదా?'' సిరిమిల సర్దిచెప్పబోయింది.

'' ఏదాంతమొద్దు. ఎందుకోడి కొయ్యనీదు?'' బూగడిదదే ప్రశ్న.

''అమ్మితే అరవై రూపాయలొస్తే, ఆ పండగనాడైనా వరికూడు కుటమానం నలుగురుతిందుమని నానే కోడమ్మేసి గింజలు కొనుక్కొచ్చినాను..'' బిడ్డికోడు చేసిన తప్పు తనదే అన్నట్టు మాటరానట్టు చెప్పాడు. దుఃఖం మరిమాటల్ని పెగలనివ్వలేదు.

అదీ బుల్డోజర్లు నడిపినోళ్లకి- కూడు... వరికూడు... కోడి కూర... సారాకాచి రెండుపూటలా మోసికెళ్ళినైవేద్యం పెట్టిన నలుగురు కొడుకులూ బిడ్డికోడికి గుర్తుకొచ్చారు. ఆలంతా బుక్కుతూ వుంటే వట్టి బుగ్గలు చప్పరించిన బూగడు మరీ మరీ కళ్ళముందు మెదిలాడు.

బిడ్డికోడు మంచంమీద నుంచి దగ్గుకెర్లుకొస్తే తట్టుకోలేక లేచి కూర్చున్నాడు. దగ్గిదగ్గి అలసి జాపోసిపోయాక అలాగే సేదతీరాడు.

సిరిమిల కాసేపాగి తెట్టతాగమని ఇచ్చింది. పెళ్ళాం మరీ బలవంతం చేస్తే రెండు బుక్కళ్ళు తాగి మళ్ళీ వాంతి చేసుకున్నాడు.

మట్టినేల ఆవాంతిని కూడా ఆకలిగా పీల్చుకుంది.



ఆరుమాసాల కాలం తిరిగింది!

బిడ్డికోడికి కాలూచెయ్యీ ఆడి, లేచి తిరిగాడి తొలేత చేపల చెరువులకాడికే వెళ్ళాడు. అల్లంత దూరం నుండే అవన్నీ పెద్దపెద్ద గోతుల్లా అగుపించాయి. దగ్గరకొచ్చి చూస్తే గిరిజన గూడేలన్నింటిని చెరువు కడుపులో పెట్టి కప్పేయొచ్చుననిపించింది.

బిడ్డికోడికి చెరువు గట్టు ఎక్కుతుంటే ఒళ్ళు జలదరించింది. ఒక్క క్షణం తలతిరిగి తూలిపడబోయి ఆసుకున్నాడు. మట్టిని చేతుల్లోకి తీసుకొని అప్యాయంగా చూసుకున్నాడు. కళ్ళమ్మట బొట్లు టపటపరాలాయి. దోసిళ్ళలోని మట్టిలో రాలిన కన్నీళ్ళు ఇంకిపోయాయి.

కొద్దిసేపటికి తేరుకొని బిడ్డికోడు చెరువుగట్టు పూర్తిగా ఎక్కాడు. కనుచూపుమేరంతా చెరువులే! ఎండిన నేల ఎడారిగా వుందే గాని మునపటి పచ్చదనం కానరాలేదు. బిడ్డికోడు ఎక్కువసేపు చూడలేక అలాగే కాళ్ళు విరిగినట్టు గట్టుమీద మట్టిలో కూర్చుండిపోయాడు.

ఎండచుర్రున మండుతోంది. వెచ్చటిగాలి తిరుగాడుతోందే తప్ప చెట్టూ పుట్టాలేక ఒక్క పక్షీ వాలిన గూడు, ఎగిరిన జాడ అవుపడలేదు. తేమలేక ఎండకు మండి వాసన్ని కోల్పోయింది. ఇన్నాళ్ళూ ఆ మట్టివాసనే బిడ్డిక్కి గుండెతో పాటు కడుపూ నింపేది.

ఇంతలో కలకల శబ్దం!

దిగువ చెఱువు కడుపులో జనం...

బిడ్డికోడు సత్తువ తెచ్చుకొని అటుగా వడివడిగా అడుగులు వేసాడు. ప్రాజెక్టాఫీసరు,

అతగాడి పియ్యే ఇంకా ఫీల్డు ఆఫీసర్లు ఎవరెవరో... అందర్నీ చుట్టుముట్టిన గిరిజనులు...

అంతా గోలగోలగా వుంది. ఎవ్వరి మాట స్పష్టంగా వినిపించడం లేదు. బిడ్డికోడు మందలో కలిసాడు. మాట వినిపించింది. గోల అర్థమయింది.

''చెరువులు తవ్వి ఆరుమాసాలయింది. చేపపిల్లలు ఇదిగో ఇస్తాం. అదిగో ఇస్తామని అంటన్నారేగాని ఇచ్చింది లేదు సచ్చింది లేదు... నాకు తెలీక అడుగుతాను చేపిల్లలుగాని ఇంకపెద్దవి కాలేదేటి?'' బుదడు నిలదీస్తున్నాడు.

''నీకు చెరువులేదుగా, నీకెందుకు'' ఎవరో బుదడికి సంబంధం లేదన్నట్టుగా మాట్లాడుతున్నారు.

బుదడేసిన ప్రశ్నే బొడ్డుగాడు వేశాడు.

మరికొంత మంది అలగడుగు... 'అర్థలగడుగు...' అని బొడ్డుగాడికి వత్తాసుపలికారు.

''వలలకి, ఆహారానికి అర్డర్లిచ్చాం...'' పియ్యే చెప్పబోయాడు.

''చేపలే లేకంట - ఆటిని పట్టడానికి వలలు... ఆటిని మేపడానికి ఆహారమూ.. అబ్బో...'' వెక్కిరింతగా నవ్వి అన్నాడు బుదడు.

సర్దిచెప్పడానికి ఆఫీసర్లు తడబడ్డారు.

ప్రాజెక్టాఫీసరు మటుకు నమ్మకం కలగడానికనేమో జరిగిన నిజం దాయకుండా చెప్పాడు.

''... తాటిపూడి, రావాడ, రామభద్రపురం, డుమ్మంగిలలో చేప పిల్లల విత్తనాలు లక్షలు ఖర్చు పెట్టి వేసాం. అందులో డెబ్బై అయిదుశాతం చుక్కనీరులేక, వర్షాలు లేక చేప పిల్లలు పెరిగి పెద్దవై అదే కేంద్రాల్లో చనిపోయాయి. మీకూ తెలుసు ఈ ఏడాది వర్షాలు లేవు.. అందుకే ఆలస్యం.''

బిడ్డకోడు అందర్నీ తోసుకుంటూ ముందుకు వెళ్ళి... ''ఆగుబాబు.. నువ్వు సేపపిల్లలిస్తావ్. నిజమే! అసలు ఇందంటా సుక్కనీరు నేదు. మీరట్టుకొచ్చి ఇచ్చినా ఆసేప పిల్లలు ఇందంటయినా సచ్చుండేవి. ఏ సెరువులోనా సుక్కనీరునేపోతే నీరుగురించి మానేసి సేపపిల్లగురించి జమిలేటబ్రా?'' దగ్గు, దాంతో ఆయాసమొచ్చి ఆగిపోయాడు.

అప్పుడందరూ అసలు సమస్యను గుర్తించినట్టు నోళ్ళు వెళ్ళబెట్టారు. కొద్దిసేపు నిశ్శబ్దం..

ప్రాజెక్టాఫీసరు వెంటనే ఇరిగేషన్ డిపార్ట్‌మెంటుకు కబురంపి ఇంజినీర్సుని రప్పించారు. వచ్చిన వాళ్ళు వల్లకాదని చేతులెత్తేసారు. పెద్దగెడ్డ రిజర్వాయరు తూములూ మదుములూ కాలువలూ బాగుచేయించి, వర్షాలు కురిసి నీరు ఎగదంతే అప్పుడవుతుందన్నారు.

అవన్నీ శక్తికి మించిన పనని పివోగారు తేల్చేసుకున్నారు. పియ్యేని పీల్డాఫీసర్లని ఏంచేద్దమన్నట్టుగా చూసి- 'మోటర్' అనీ, ' డైరక్టు కరెంటు పనికిరాదనీ' 'ట్రాన్స్‌పవర్ మీటర్' వుండాలని తర్జనభర్జనలు పడ్డారు. తేల్లేదు. 'జనరేటర్ పెట్టిస్తే - ఆపరేటింగ్ రాదే..? మళ్ళీ దాన్ని ఎవరికి అప్పగించాలి? ఎవరెవరికి ట్రైనింగ్ ఇవ్వాలి?' పీవోగారు తలపట్టుకున్నారు.

''కష్టంసార్ .. రేపు చేపలు పెంచినా అమ్మకం - కొనుగోలు ఈ జనానికి తెలీదుసార్... అందుకూ మనమే ఎవర్నో రిక్రూట్ చెయ్యాల్సి వుంటుంది. వాటికీ మనమే భారం వహించాలి. ఈపథకం వదిలేసి మరో పథకమేదన్నా...'' పియ్యే పీవోతో చెప్పబోయి చుట్టూ చేరిన నలుగురు ముఖాలు చూసి ఆగిపోయాడు.

చదువు కున్న ఆఫీసర్ల బుర్రలు వేగంగా ఆ విషయాన్ని అర్థంచేసుకొని ' ఇట్సాల్‌రైట్' అని అంగీకరించాయి ధృవపరిచినట్టు.

మళ్ళీ ప్రాజెక్టు ఆఫీసర్ అన్నాడు.

''మంచి పనికి ఎప్పుడూ ఆటంకాలే. అలాగని పనులు మానుకుంటామా? అసలు మనదేశంలో వర్షాధారం మీదనే వ్యవసాయం ఆధారపడివుంది. అలాంటిది చేపల చెరువుల పెంపకం అందుకెలాగ అతీతమయిపోతుంది? అంచేత ఇవి వర్షాధారమైన చెరువులు. వర్షాలు పడి చెరువులు నిండితే ఏదన్నా చెయ్యగలం.. చేద్దాం... అందుకు నేను హామీ ఆ..''

ఎక్కడి వారక్కడ చేష్టలుడిగిపోయి నిలబడిపోయారు.

తెల్లకారు, దాని వెనకాలే మట్టిరంగు జీపు పోటీ పడుతూ పరుగులెత్తాయో... పారిపోయాయో ఏమో?!



సంవత్సరం తిరిగింది.!

వర్షాలు నిండి తొణికిసలాడింది. గట్టుల్దాక చేరిన నీరు మట్టిరంగుతో వుండడం మూలాన గట్టూనీరు ఎడతెరిపిలేకుండా ముసురు పట్టి ముంచెత్తాయి! చెరువులనిండా నీరు వర్షపు నీరు తెలీకుండా దూరం నుండి చూస్తే సమానంగా నేలమాదిరి అవుపించింది.

వర్షం కొద్దిగ తెరిపివ్వడంతో ఊరిజనమంతా చెరువుల దగ్గర చేరారు. నీరు నిండడంతో గుండె నిండినట్టే సంబరమయింది. ఆనందం పట్టలేక అప్పటికప్పుడే పార్వతీపురం ఐ.టి.డి.ఏ. ఆఫీసుకు బయలు దేరారంతా.

బిడ్డికోడు వెళ్ళిన కొడుకుల రాకకోసం, కబురు కోసం చెరువు గట్టుమీదే కూకొని

ఎదురుచూస్తూనే వున్నాడు.

పొద్దు కుంకుతుండగా పిల్లలొచ్చారు. కాని వెలుగు నింపుకొని వెళ్ళిన కళ్ళల్లో దీపాలు ఆరిపోయివున్నాయి. నీరసించి పాయిసొప్పకట్టల్లా వేళ్లాడబడిపోయివున్నారు.

''సేప పిల్లలు రాడాకి అయిదారు నెల్లు పడతాదాట''... తెచ్చిన కబురది.

''చేప పిల్లలొచ్చిన్దాక చెరువులో నీలుంటాయేటి... ఈలోగా నీలుసుక్కాలు ఇరిగిపోవూ...?'' ఎవరిదో మాట.

బిడ్డికోడు చెరువుకాడ నుండి గుడిసె వేపు వెనుదిరిగాడు. ఒక్కడూ తనలో తనే గొణుక్కొంటున్నట్టు పైకే అంటున్నాడు.

''... ఇగిరిపోవు... నీళ్లిగిరిపోవు... సేపపిల్లలు వస్తాయి. ఇగిరిపోవు నీళ్లిగిరిపోవు''....

ఆ రాత్రి బిడ్డికోడికి ఆందోళనతో అరకొరగా నిద్రపట్టింది. నిద్రలో కలకూడా వచ్చింది. కలలోకూడా చేపల చెరువులే! చెరువు నిండి కిలకిల లాడుతూ చేపలే చేపలు! ఆ చేపలు క్షణక్షణానికి పెద్దవవుతున్నాయి. అవి ఎగిరి డబ్బుమని మళ్లీ నీళ్లలో పడుంతున్నాయి. అవి అలా పడ్డప్పుడు గట్టుమీద వున్నబిడ్డికొక్కి నీళ్ళు తుళ్ళి తడిచిపోతున్నాడు. ఆ ఆనందంలో వాటికి మరింత ఆహారం పెడుతున్నాడు. అవి మరింత పెరిగి చేతిలోని ఆహారం అందుకుంటున్నాయి. అయినా వాటి ఆకలి తీరడంలేదు. అందులో పెద్దచేపొకటి బలంగా బిడ్డికోడిని నీళ్ళలోకి లాగేసింది. అలాలాగిన చేపే మింగిందో... మిగతా చేపలన్నీ చేరి ముక్కలు ముక్కలుగా కొరుక్కుతిన్నాయో.

బిడ్డికోడు ఉలిక్కిపడి నిద్రలేచాడు. ఒళ్ళంతా తడిచివుంది. నిజంగా నీటిలోపడి నట్టుగానే గుండె పెద్దగా కొట్టుకుంటోంది. చెమటతో బట్టలు కూడా తడిచివున్నాయి.

బిడ్డికోడు కుక్కి మంచందిగి, గుడిసె బయటకు వచ్చాడు. వాన వెలిసినట్టూ కాక, కురుస్తున్నట్టూ కాక వుంది వాతావరణం. ఆకాశం నల్లగా వుండి గుడుగుడుమంటోంది. చీకటీ...చీకటి! దూరంగా వున్న చేపల చెరువుల నుండి అందులో చేరిన కప్పలశబ్దం బెకబెకమంటూ వినిపిస్తోంది ఆశబ్దం విన్నకొద్దీ వికృతంగా వుంది.

*రచనా కాలం : అక్టోబర్ / ౨౦౦౫*

*ప్రచురణ : నాగావళి కథలు / ౨౦౦౫.*